

బ్రతుకుబాట

ఫొటో: కె. ఎస్. కామరాజు, (కాకినాడ)

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

# నవలా రచన పోటీ

# బహుమతి రు. 1000

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సాంఘిక నవలా రచనకు మరొక పోటీ నిర్వహించదలచామని తెలుపటానికి సంతసిస్తున్నాము.

[15-12-1961 గడువుగా పెట్టిన నవలలపోటీ ఫలితాలు త్వరలో తెలుపుతాము. ఇది మరొక పోటీ.]

ఈ పోటీకి పంపే నవలలు మా కార్యాలయానికి 1-5-1962 లోగా చేరాలి.

## నిబంధనలు

- రచనలు కాగితానికి ఒక ప్రైపునసే వ్రాసి ఉండాలి.
- 250 అరఠావు (ఫుల్‌స్కేప్) పేజీలు మించి ఉండరాదు.
- కథా వస్తువు నేటి ఆంధ్రదేశం సాంఘిక జీవితానికి సంబంధించి ఉండాలి.
- రచనలు స్వంతమయినవిగా ఉండాలి. అనువాదాలు పంపకూడదు.
- పోటీలో తుది నిర్ణయం సంపాదకులదే. ఈ విషయంపైన ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు.
- రచనలు తిప్పిపంపగోరేవారు తగిన పోస్టేజి జతపరచి పంపాలి.
- పోటీలో బహుమతి పొందని నవలలు యోగ్యములయితే విడిగా ప్రచురిస్తాము.
- బహుమతి నవలకు సంబంధించిన అన్ని హక్కులూ ఆంధ్ర సచిత్ర వారపత్రికకే చెంది ఉంటాయి.

*రచయితలు ఎప్పటివలె మాతో సహకరించి ఈ పోటీ జయప్రదం చేయగోరుతాము.*

*ఇంతకుముందు పోటీకి నవలలు పంపినవారందరికీ కృతజ్ఞులము.*

# ఉత్తరాలు

## ముఖచిత్ర వ్యాసం

'మడి—గుమ్మడి' శీర్షికలో కళాతపస్వి శ్రీ గుమ్మడిని ఆంధ్ర ప్రజానీకానికి పరిచయంచేసినందుకు మీకు నా అభివందనములు. కాని వ్యాసకర్త వారికి పూర్తి న్యాయం కలుగజేయలేదనిపిస్తుంది. అయినా నటనా చరిత్ర సింహావలోకన ప్రహసనంలో ఇది ప్రథమాధ్యాయం' అని సరిపెట్టుకోమంటారా? వారి స్వగ్రామం 'రావిపాటి'. కాదు 'రావికంపాడు'. మధ్యకాలంలో స్వగ్రామములో 'గుమ్మడి' పాదులు లేవు. తెనాలిలో రేడియో వ్యాపారంలోనూ, కీ. శే. శ్రీ మాధవపెద్ది వారితో కలిసి 'వీరాభిమన్య' వగైరా నాటక ప్రదర్శనలు ఇవ్వటంలోనూ కాలం గడిపారు. 'కమ్మ'ని గంధం 'కమ్మ' వాటి బిడ్డలకు ప్రాధాన్యం ఇచ్చేకన్నా, వారిని గురించి వ్రాయాల్సిన 'కమ్మ'ని మాటలు ఇంకా చాలా ఉన్నవి. ద్వితీయాధ్యాయంకై ఎదురుచూడవచ్చా !

బండి కొండలరావు (తెనాలి)

* * *

వారపత్రిక ఈవారం చాలా నిండుగా ఉన్నది. ఆ గుమ్మడిగారి వ్యాసాన్ని మమ్మల్నెంతో ఆనందపరచినది. మా మూడేళ్ల పాపాయి సహితం చూడగానే 'అమ్మా సినిమాలో గుమ్మడి కదూ. పుస్తకం మీదకు వచ్చాడెందుకు' అని అడిగినది. చిత్రం ఇంత బాగా వేసిన శ్రీమతి దేవిక గార్కి మా ధన్యవాదాలు.

ఎస్. బంగారుదేవి (వైజాగ్)

* * *

1961 వ సంవత్సరంలో వెలువడిన ఆంధ్ర పత్రిక వారపత్రికల సంఖ్య 53.(4—1—61 మొదలు 29—12—61 వరకు). ఇందులో సినిమాలకు సంబంధించిన బొమ్మలు గల ముఖ చిత్రముల వారపత్రికలు 41. మిగిలిన పది రెండులో ఒకటి ఎలిజబెత్‌రాణి ముఖచిత్రం, మిగిలినవి కార్టూన్లకు సంబంధించినవి. కనుక ఈ 1962 వ సంవత్సరములో నైనను సినిమా బొమ్మల ముఖచిత్రములను సాధ్యమైనంతవరకు తగ్గించి, శిల్పసౌందర్యమునకు సంబంధించిన, ప్రకృతి దృశ్యములను ముఖచిత్రములుగ చిత్రించెదరని తలంచుచున్నాను.

సూర్యదేవర గిరిజాప్రసాదు (తుమ్మపూడి)

## కథకాని కథలు

ఈమధ్య పత్రికలో ప్రచురించే "కథకాని కథ"లన్ని చెత్తకథలే. పత్రికలోని ఉత్తరాలు చదువుతూంటే, అందులో చాలా కథలు నిజముగా అర్థములేనివీ, అల్లిబిల్లిగా కల్పించినవి గానూ ఉన్నాయని అర్థమవుతోంది. పచ్చికోత లన్నింటికీ ప్రథమ బహుమతులు ఇస్తూ, కథకాని కథలు ప్రచురించేకన్న ఏదయినా కొత్త శీర్షిక ప్రచురించరాదా ?

ఎం. ఎస్. ఎస్. మూర్తి (విజయవాడ)

## చదువుల్రావు

సత్యమూర్తిగారి "చదువుల్రావు" బాగా నవ్విస్తున్నాడు. కాని నోరు మూసుకొని ఏవిధంగా మాటాడుతారో ...... ?!

మధు (వేములవాడ)

* * *

అబ్బబ్బ ! మన చదువుల్రావు నానాటికి మితిమీరుతున్నాడండోయ్. కాకపోతే తండ్రిగా రెదుట ఆ కళ్లజోడేమిటి, చొక్కాపైన ఆ కుర్తేమిటి, కాస్తంతైనా భయము, భక్తి ఉండక్కర్లేదటండి ఎంత చదువుల్రాకపోయినా—

వై. శ్రీనివాస్ (అనంతపురం)

* * *

ఏమయ్యా చదువుల్రావూ! మార్చి దగ్గర పడుతోంది, ఏమన్నా చదువుతున్నావా లేదా ? అయినా నువ్వు "చదువులరావు" (చదువులు రావు) కనుక చదవడం అనవసరమనుకుంటా ? ఈ మూడు నెలలైనా అమ్మాయిల్ని, ఆఫీస్‌లో క్లర్కుల్ని, సెక్రెటరియన్‌గార్ని, ఏడిపించడం మాని బాగా చదువుకో.

వై. వెంకటరామశాస్త్రి (భీమవరం)

* * *

29—12—61 తేది పత్రికలో 'చదువుల్రావు' చదువుతే కొన్ని అసహజమైనవి కనపడినవి. అవి : మొట్టమొదటి బొమ్మలో, 'చదువుల్రావు' సినిమా హాలులోకి ప్రవేశించాడు. లోపలకు వెళ్లి వాళ్ల క్లాస్‌మేట్ 'సురేఖ' వచ్చిందని చూశాడు. అప్పుడు వెళ్లి టిక్కెట్టు మార్చుకొని రావడం అసంభవం. ఎందుచేతనంటే గేటు వద్ద ఉండేవారు టిక్కెట్టు చింపి ఇస్తారు. చింపిన తరువాత ఎలా మారుస్తాడు. ఇక బొమ్మగారు విస్వకర్మ చేతితో పట్టుకొని 'ఏంకా' (ఫాన్,) కావాలంటోం దేమిటండోయ్ ! కొంచెం తెలియపర్చుతారా !

ముంగళంపల్లి రామకృష్ణ (మద్రాస్)

## సందేహం

ఆంధ్ర పత్రిక వారపత్రిక 22—12—61 లో శ్రీ ఎల్. ఎస్. (మద్రాస్) గారు ఒక జోక్ వ్రాశారు. (59 వ పేజీలో) అది "నేనుమధ్య వైట్ హౌస్‌కి వెడదామని బయల్దేరాను. దారిలో ఒక తమాషా జరిగింది" అని శ్రీ అడ్లాయ్ స్టీవెన్సన్ ఒక ఉపన్యాసం ప్రారంభించాడట" అని. దీనిలో నవ్వు రావడానికి ఏముంది ?

డి. వి. చయనులు (విజయనగరం)

**ఆలోచించి చూడండి మీకే తెలుస్తుంది.**

## కార్ట్యూన్

బాపుగారి 15 వ కార్ట్యూన్ నన్ను అమితంగా ఆకర్షించింది. చిత్ర రచనను మించి పద్య రచన అద్భుతంగా ఉంది. బాలయ్య సగం చాలన్నట్టు నటిస్తారా లేక ఆయన నటన మన కలా అనిపిస్తోందా అనే సందేహం రాక తప్పటంలేదు.

బి. భావన్‌కుమార్ (విశాఖపట్నం)

ఆరుద్ర రామలక్ష్మి వ్రాసిన ఉత్తరం చదివి ఆశ్చర్యపోయాను. శ్రీ గుమ్మడిగారుని మామూలుగా సినిమాలలో చూసినట్లు పడి ఉండకపోవచ్చేమో కాని కొత్తరకంగా ఉంది.

కె. మధుసూదనరావు (బందరు)



'దేవిక గారు చూసి వేసిన 'స్టిల్' ఫోటో ఇక్కడ ప్రచురిస్తున్నాము.

## రైల్వే కూలీ

ఆంధ్రపత్రిక వీక్లీలో ఇంక ఏమీ దొరకనట్టు రైల్వే కూలీలమీద, రిక్షావాళ్లమీద వ్యాసాలు ప్రచురించడం ఏమీ బాగులేదు. ఇంక కొన్నాళ్ళు పోతే సినిమా గేట్‌కీపర్లమీద, బస్సు కండక్టర్లమీద కూడా వ్యాసాలు ప్రచురించేలా ఉన్నారు. నిజంగా ఈ రిక్షావాళ్ల మూలంగా, రైల్వే పోర్టర్ల మూలంగా ప్రజలకు జరిగే నష్టాలు ఇన్నీ అన్నీ కాదు. ఉదాహరణకు బెజవాడ రైల్వేస్టేషన్‌లో పోర్టర్లు చాలాగిరగా ఉంటారు. రైలు వచ్చిందనుకోండి. వాళ్లు సామాను తీసుకెళ్లి వాళ్ల యిష్టం వచ్చిన(అంటే దగ్గిరగా ఉన్న) కంపార్ట్‌మెంట్‌లో పెట్టేస్తారు. సామాను, లోపలికి వచ్చి సర్దరు కూడా ఒక్కొక్కసారి—ఇంక రిక్షావాళ్ల సరేసరి. ఊరు తెలియనివాళ్లు కొత్తవాళ్లు వస్తే దగ్గిరదారిని తీసుకెళ్లడం మానేసి, చుట్టూ తిప్పి, ఎక్కువ డబ్బులు తీసికెళ్లడం మామూలు. కొన్ని కేసులు పేపర్లలో పడితే చదువుతూ ఉంటాం. రిక్షావాళ్ళు, ఒంటరిగా వచ్చిన ఆడవాళ్ల దగ్గిర నగలూ అవి దోచేయడం అలాంటివి. అందుచేత ఇటువంటి హీనమైనవారి మీద వ్యాసాలు ప్రచురించి, వారి గురించి పెద్దగా చెప్పడం విచారకరం. దీనికి బదులు, మహాత్ములు, దేశ నాయకులు లేక మహనీయులైన పురాణపురుషుల జీవిత విశేషాలు, వారి జీవిత గాథలు ప్రచురిస్తే ఆబాలగోపాలము చదివి సంతోషిస్తారు. ఇకనైనా సంపాదకులు ఇటువంటి వ్యాసాలు ప్రచురించరని విశ్వసిస్తున్నాము.

ఎం. జె. రావ్ (పెద్దాపురం)

★

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

ముఖచిత్రం :
ఇ. ప. సరోజ


## విషయానుక్రమణిక


శుక్రవారం : *5-1-62*

ప్లవ సం॥ మార్గశీర్ష బ॥ చతుర్దశి
సంపుటము : 54 సంచిక : 18

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★




## లోకంపోకడ



'మీరన్నది అక్షరాల నిజం రాజాజీ! శ్రీ నెహ్రూ ఇప్పుడు గోవామీద చర్య తీసుకోవడం కచ్చితంగా ఎన్నికల ఎత్తుగడే. ఏమిటికివచ్చి ఈమాటే చెప్పండి.'


మ్యూజికల్ చెయిర్స్
ఆంధ్ర ప్రదేశ ముఖ్య మంత్రి పదవి


పునస్సమాగమం
గోవా


సరే మీపార్టీలోనే చేరుతామనుకోండి! మరి మాకు పర్మిట్లు, లైసెన్సులు, బిరుదాలు ఇప్పిస్తారా?


బాంబోయ్! ఈ గుదిబండ ఏమిటి నాప్రాణానికి!!
నాకు మొదటే తెలుసు!
సైనిక ఒప్పందాలు

# ప్రపంచ పరిశ్రమల ప్రగతి సూచకం
# భారత పారిశ్రామిక ప్రదర్శనం

(ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధి)

భారత పారిశ్రామిక వాణిజ్య మండలుల సమాఖ్య అధ్వర్యాన ప్రభుత్వ సహాయ, సహకారాలతో ఢిల్లీలో నెల రోజులుగా నడిచిన పారిశ్రామిక ప్రదర్శన చాలా బ్రహ్మాండమైనది. ఆసియాలో ఇంత పెద్ద ఎత్తున ఇదివరకెన్నడూ జరుగలేదు. ఒకవైపున పురాణ ఖిల్లా, ఎదురుగా సుప్రీంకోర్టు భవనాల నానుకొని మధురా రోడ్డు వెంబడి 180 ఎకరాల విస్తీర్ణం గల విశాల ప్రదేశంలో దీన్ని నిర్మించారు. రకరకాల కట్టడాలతో, అతి రమ్యంగా నిర్మించిన శాలలతో నిండిన ఈ ప్రదర్శనలోకి వెడుతుంటే, ఏదో విచిత్రమైన జగత్తులో విహరిస్తున్నట్లుంటుంది. ఒకదాని తరువాత, ఒకటిగా అన్ని శాలలు యంత్రాలమయం. ఈ ప్రదర్శనలో పాల్గొన్న 19 విదేశాలు పారిశ్రామిక రంగంలో తాము సాధించిన ప్రావీణ్యంకు నిదర్శనంగా అతి ఆధునికమైన యంత్రాలన్నీ ఇందులో ప్రదర్శించాయి. కేవలం ప్రదర్శన మాత్రమే కాక, అవి ఎట్లా పనిచేసేది కూడా నిపుణులైన పనివారితో నడిపించి ప్రేక్షకులకు చూపుతున్నాయి. మానవుడు తన జీవిత సౌఖ్యానికి యంత్రాన్ని ఏవిధంగా లోబరుచుకుని సమస్త వస్తుజాలాన్ని ఉత్పత్తి చేసుకోగలుగుతున్నాడో, శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం ఎంతగా పురోగమించిందో, తెలుసుకోవాలంటే ఈ ప్రదర్శనను ఒక్కసారి చూచి తీరాలి. ఇందులో వినోదం కన్నా, విజ్ఞానమే ఎక్కువ లభిస్తుంది. శాస్త్ర పరిచయం లేని సామాన్యులకు కూడా పారిశ్రామిక ప్రపంచం అంటే ఎలా ఉంటుందో అర్థమవుతుంది.

ఆరు సంవత్సరాల క్రితం భారత పారిశ్రామిక వాణిజ్య మండలుల సమాఖ్య ఇలాగే ఒక పారిశ్రామిక ప్రదర్శన ఏర్పాటు చేసింది, కాని అది చాలా చిన్నది. దానికన్నా యిప్పటి ఈ ప్రదర్శన రెండున్నర రెట్లు విశాల ప్రాంతాన్ని ఆక్రమించింది. దీంట్లో 400 పైచిలుకు ప్రదర్శనశాల లున్నాయి. మన దేశంలో ప్రైవేటు, పబ్లిక్ రంగాలే గాక, 19 విదేశాలు 35 కోట్లు విలువగల యంత్ర సామగ్రి ప్రదర్శనలో పెట్టాయి. ఈ యంత్రసామగ్రి చాలామటుకు మన దేశానికి అమ్మివేయుటం జరుగుతోంది. అందుకే దీన్ని సంత అని కూడా పిలుస్తున్నారు. ఈ సంతలో గల 400 ప్రదర్శనశాలలు పూర్తిగా చూడాలంటే కనీసం పది పదిహేను రోజులైనా పట్టవచ్చని అంచనా. లోనికి వెళ్ళకుండా ఆయా శాలలను పైపైని చూచుకుంటూ వెడితేనే మొత్తం 35 మైళ్ళు తిరగాల్సి ఉంటుంది.

ఈ ప్రదర్శనను ఎనిమిది భాగాలుగా విభాగించి నాలుగు ముఖద్వారాలు ఏర్పాటు జేశారు. ఒక ముఖద్వారం వద్ద, పారిస్‌లోని ఎఫెల్ టవర్ మాదిరి, ఉక్కుతో నిర్మించిన ముక్కాలి గోపురం ఒకటి అమర్చారు.. ఎ. బి. విభాగాలు ఒకదానికొకటి ఎదురుగా ఉన్నాయి. ఈ రెండు విభాగాలలో ఆంధ్ర, పోలాన్, యుగోస్లావియా, ఇటలీ, జెకోస్లొవేకియా ప్రదర్శనశాలలు, సి. విభాగంలో బ్రిటన్, పశ్చిమ జర్మని, హంగరీ, బల్గేరియా, వియెట్నాం రిపబ్లిక్, ఆస్ట్రియా ప్రదర్శనశాలలు ఉన్నాయి. అమెరికా, తూర్పు జర్మని రష్యా ప్రదర్శనశాలలు ప్రక్క ప్రక్కనే ఉన్నాయి. మన దేశంలో వివిధ రాష్ట్రాల ప్రదర్శనశాలలన్నీ ఇంచుమించు ఒకే విభాగంలో ఏర్పాటయ్యాయి.

విదేశీ ప్రదర్శనశాలలు, ముఖ్యంగా అమెరికా, రష్యా శాలలు జనాన్ని విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఈ రెండు దేశాలు శాస్త్రసాంకేతిక రంగంలో అత్యద్భుతమైన ప్రావీణ్యాన్ని సాధించాయి గనుక జనం విరగబడటంలో ఆశ్చర్యం లేదు. రష్యన్ శాల 11,14000 చదరపుటడుగుల విస్తీర్ణంలో నిర్మించారు. పూర్వం వ్యవసాయ ప్రదర్శనప్పుడు నిర్మించిన శాలే యిది. ఇందులో ప్రవేశించడంతోటే ఎదురుగా బ్రహ్మాండమైన లెనిన్ విగ్రహం కన్పిస్తుంది. ఆ వెనుకనే నెహ్రూ, కృశ్చేవ్ లున్న పెద్ద ఫోటో అమర్చారు. ఈ శాలలో చిన్నచిన్న యంత్రాలు మొదలు అతి భారీ యంత్రాలదాకా ఉన్నాయి. ముఖ్యంగా శేషాలు ప్రత్యేకంగా చూడాల్సినట్టివి.. [illegible] యంత్రాలు [illegible] మెషిన్లు, అతి చిన్న ముద్రణ యంత్రాలు, వ్యవసాయ యంత్రాలు, మట్టి త్రవ్వే భారీ యంత్రాలు, నాలుగు టెలివిజన్ కెమెరాలు ఉన్నాయి.

శాల మధ్యలో లోహంతో నిర్మించిన పెద్ద స్పుత్నిక్ నమూనా, దాని వెనకాల గోడంపై అంతరిక్ష యాత్రికులు గగారిన్, టిటోవ్‌ల ఫోటోలు అమర్చారు. శాల వెలుపల రాకెట్ రూపంలో ఉక్కు చట్రంతో ఒక స్తంభాన్ని నిర్మించి, దానికి అమర్చిన ఎలెక్ట్రిక్ బల్బులను వెలిగిస్తూ, ఆర్పుతూ రాకెట్ వివిధ అంచెలు ఎలా పనిచేసేదీ, ఆఖరి దశలో స్పుత్నిక్ అంతరిక్షంలో ఎలా మిగిలేదీ ఊహించుకునేలా చేస్తున్నారు. రష్యన్ శాల మొత్తంమీద ఆడంబరంగా ఉంది. ఇతరులు సాధించలేని, కొత్త యంత్రాలతోపాటు, సర్వ సామాన్యంగా అన్ని దేశాలు తయారుచేస్తున్న కెమెరాలు, కళ్ళద్దాలు వంటివి కూడా ఇందులో ప్రదర్శనకు పెట్టారు.

అమెరికన్ శాల ఇందుకు కొంత భిన్నంగా ఉన్నది. ఇందులో ప్రత్యేకాకర్షణ గాలిలో నడిచే కారు. 3 లేలు ఖరీదుచేసే కారు, చిన్న ట్రాక్టరు. ఢిల్లీలో ప్రస్తుతం నడుస్తున్న భారత

61-వ పేజీ చూడండి



అమెరికా ప్రదర్శనశాలలో ప్రదర్శించిన ఎయిరో కారు. ఇది భూమినుంచి 12 అంగుళాలు పైకి లేచి, గంటకు 40 మైళ్ళవరకు ప్రయాణం చేస్తుంది.



రాధకి కోపంవచ్చింది, ఓ సందె చీకటివేళ.

రాధకి కోపంవస్తే మొట్టమొదట చేసేపని నాన్నదగ్గరికి పోతానని బెదిరించడం. ఈసారి అంతే చేసింది.

కాని, ప్రతిసారిలాగ గోపాలం తప్పంతా తనదే నని ఒప్పేసుకుని, ఆమె వెయ్యబోయే శిక్షకి తలొగ్గ లేదు సరిగదా, 'నీయిష్టం వచ్చినట్టు చేసుకో' మని ఖచ్చితంగా చెప్పేశాడు. దాంతో, రాధ కింకా కోపం వచ్చి నిజంగానే వెళ్ళిపోయింది.

ఆమె అలా నిర్దాక్షిణ్యంగా వంపెయ్యడానికి కారణం, గోపాలంలో పుంజుకున్న పౌరుషం అనుకున్నవాళ్ళు పొరబడ్డారు. అలాంటి క్షణికోద్రేకాలకి, ఆవేశాలకి అతీతుడు గోపాలం.

రెండు, మూడు రోజుల క్రితం చిన్నమామనుంచొక ఉత్తరం వచ్చింది, తనదగ్గిరకోసారి రమ్మని. గోపాలాన్ని కాస్త ఆదరించి అభిమానించేది, ఆతని ఆరుగురు మామయ్యల్లోనూ చిన్నమామ ఒక్కడే. చిన్నమామ తనని చూసి జాలిపడి ఆప్యాయతతో పలకరిస్తాడు గాని మిగతావాళ్ళలాగ 'బడుద్ధాయీ' అనడు. ఆయన దగ్గిర, తన నేడిపించే ఆడ, మగ పిల్లలు లేకపోవడం యింకో సుగుణం. మామయ్యకి బుజ్జి ఒక్కడే. పన్నెండేళ్ళుంటాయి. అంత ముద్దు యీ ప్రపంచంలో యింకో ఉండడు. వాడు తన నేడిపించడం మాట అటుంచి, తనే వాడి అంటకత్తెర క్రాపుమీద మొట్టి, ఏ వేలుతో మొట్టిందీ చెప్పుకోమని అడుకోవచ్చు!

57-వ పేజీ చూడండి


బాపు
చిత్ర జగతిలో
చలం స్థానం
నిశ్చలం - అచంచలం
పదేళ్లుగా అది పెరగలేదు,
తరగబోదు

# కథ కాని కథ

## ఎవరిభయము వారిది
### (మొదటి బహుమతి)

ఇది 11 సంవత్సరములనాటి విషయము. నేను బెంగుళూరు సైనిక శిక్షణ కేంద్రములో కూరులో శిక్షణ పొందుతున్న రోజులవి. మా బ్యారక్సు ప్రక్కనే బెంగుళూరునుండి మద్రాసు పోయే రైలుమార్గము ఉంది. శిక్షణ కేంద్రములో మూడు కంపెనీలు ఉన్నవి. ఒక్కొక్క కంపెనీలో 800 మందికి పైగా శిక్షణ ఇవ్వబడుతుంది. ప్రతి కంపెనీకి ఒక "హవల్దార్ మేజర్" అను ముఖ్యమైన ఉద్యోగి ఉంటారు. ఇతనిని చూస్తే ప్రతి రిక్రూట్ హడలిపోతారు. ఎందుచేతనంటే, ఎవరైనా సరే, ఇతని కంట పడితే చాలు ఏదో ఒక పని పురమాయిస్తారు. అది రాత్రి గాని, పగలు గాని, తుదకు సెలవుదినము అయినా అవనిచేసితీరవలసిందే. లేకపోతే సైనిక నిబంధనలు అతిక్రమించినట్లు పరిగణిస్తారు. అందుచేత ఆ ఉద్యోగిని చూస్తే మాకు మహా పెద్ద చిరాకు. ఒకనాటిసాయంత్రము, సమయము 4 గంటలై ఉంటుంది. నేను నా స్నేహితులు మరుసటి దినము మాకు అవసరమైన శిక్షణ పరికరములు శుభ్రపరచి తయారుగా ఉంచుకొంటున్నాము. ఇంతలో అకస్మాత్తుగా నా స్నేహితులందరూ ఎటునైపు వారు అటు పారిపోతున్నారు. నేనుకూడ వెంటనే నా ప్రక్కన ఉన్న కిటికీగుండా ఒక దుముకుతో పారిపోయి కొంత దూరములో ఉన్న మా కంపెనీ దాకలివాని గదిలో దూరాను. అరగంట తరువాత మరల తిరిగి బ్యారక్సుకు వచ్చాను. నా స్నేహితులంతా ఎవరి పనులు వారు చేసుకొంటున్నారు. నేను రహస్యముగా నా ప్రక్కనున్న వానితో, "ఏంరా హవల్దార్ మేజర్ పోయాడటరా ?" అని అడిగాను. అందుకు వాడు, అరవ భాషలో "హవల్దార్ మేజర్ ఏమిటిరా నీ ముఖము! ఆయన ఎప్పుడొచ్చాడురా ఇక్కడికి ?" అన్నాడు. మాకు సందేహము తీరక మరి మీరంతా ఎందుకురా అలాగ పారిపోయారు ? అన్నాను. తరువాత తెలిసింది విషయము. శిక్షణ పూర్తికాగానే, సైనికులను శిక్షణ కేంద్రమునుండి భారతదేశపు నలుమైపులకు "సిక్కింగు" పంపేస్తారు. అప్పుడు కాశ్మీరుకు పోయే సైనికులు బెంగుళూరునుండి మద్రాసు వెళ్ళే మెయిల్‌లో పోతారు, ఆ సమయములో వారిని ఉత్సాహపరచి చేతిగుడ్డలు ఆడించుతూ, చేతులు వూపుతూ వారికి వీడ్కోలు ఇచ్చుట మా రివాజు. అదేమాదిరి, నా స్నేహితులంతా ఆదినము కాశ్మీరుకు పోతున్న సైనికులను చూచుటకు పోయారు, పరుగెత్తుకుంటూ. కానీ నేను, స్నేహితులను చూచుకొనే సదవకాశము వదలుకొని "హవల్‌దార్ మేజర్" కు భయపడి దాకలివాని గదిలో ప్రవేశించాను! నా సంగతి విని నా స్నేహితులంతా కడుపుబ్బేటట్లు నవ్వుకొన్నారు. నా కెంతో సిగ్గు, అవమానము అయిపోయింది. ఇందుకు ఎవరి భయము వారిది అంటే తప్పు కాదనుకొంటాను.

డి. వెంకటేశ్వర్లు, లెపోల్డ్‌విల్ (కాంగో)

* * *

## రామూ తెలివి
### (రెండవ బహుమతి)

మేము మూడవఫారం చదివే రోజుల్లో రాము అనే అబ్బాయి మా సై క్లాసు చదువుతూ ఉండేవాడు. ఇతనొక 'కోతి' అనేవారు. కొంచెం తిక్క మనిషి. ఒకదినం మా క్లాసు జరుగుతున్న పక్క గదిలో నాల్గోఫారం క్లాసు నడుస్తోంది. ఇంతలో పెద్ద అల్లరి బయలుదేరి చుట్టు పక్కల క్లాసులన్నీ ఆగిపోయాయి. అందరూ రాము క్లాసు గదివైపు పరుగెత్తుకుంటూ వచ్చారు. అక్కడ మాస్టారు చాలా కంగారుపడి పోయినట్లగుపించారు. చివరకు తేలింది, రాము అల్లరి చేసినందుకు ఆయన నాలుగు దెబ్బలు వేయగా చిన్న 'ఘర్షణ' జరిగిందిట : రాము కోపంగా జేబులోంచి చిన్న సీసా ఒకటి తీసి, అందులోని 'అయొడిన్' ద్రావకం తాగి ఆత్మహత్య చేసుకుంటున్నానని తాగేశాడు. తాగి తూలి పడిపోయాడుట. బాధపడిపోతున్నవాడిలా గిలగిల కొట్టుకుంటున్నాడు.

మాస్టారుగారు పాపం చాలా భయపడి పోయారు. కొందరు వెంటనే స్కూలు దగ్గరే ఉన్న ఆస్పత్రి డాక్టరుని పిలుచుకు వచ్చారు. డాక్టరుగారు విషం తాగినవారికి వాంతి అయ్యే మందు ఇవ్వాలన్నారు. రాము వెంటనే, ఆ మందు పుచ్చుకోనన్నాడు. బలవంతంచేసి రిక్షా ఎక్కించి ఆస్పత్రికి తీసుకుపోయి మందు ఇప్పించారు.

తర్వాత తెలిసిన విషయ మేమిటంటే రాము దగ్గర సీసాలోనిది 'అయొడిన్' కాదనీ బెల్లం కలిపిన నీరనీ ......

చిన్నయ్య (మద్రాసు)

* * *

## త్వరగా వచ్చారే!
### (రెండవ బహుమతి)

ఒకసారి రైలులో వస్తుండగా జరిగిన సంఘటన ఇది. అప్పుడు రాత్రి ఒంటి గంట అయి ఉంటుందేమో. మాపెట్టెలో కూర్చున్న ఇద్దరు వ్యక్తులు మాటమాట పెంచుకుని కొట్లాటకు దిగారు. పెట్టెతలుపు తెరచి వున్నది. వీరిని విడదీయటానికి తోటి ప్రయాణికులు చేసిన ప్రయత్నాలు విఫల మయినాయి. ఇద్దరు పెనుగులాడుతూ తెరచి ఉన్న తలుపు దగ్గరగా వెడుతున్నారు. ఈపరిస్థితిలో ప్రమాదం జరుగ వచ్చునే భయంతో ఒకరు 'చైన్' గుంజారు. రైలు నట్టడివిలో ఆగింది. అమావాశ్య ముందు రోజులు కావటం చేత కన్ను పొడుచుకున్నా కనిపించనంతటి చీకటిగా ఉంది. ఆగిన రైలు రెండు, మూడు నిముషాల తరువాత మళ్ళీ బయలు దేరింది. ఎందుకుఆపారో తెలుసు కునేందుకు గార్డువస్తాడేమో నని మేమంతా అనుకున్నాం. కాని అలాంటిదేమీ జరుగలేదు. సుమారు పావుగంట తరువాత రైలు స్టేషను చేరుకుంది. అది మెయిలు ఆగవలసిన స్టేషను కాదు. ఇంతలో పెట్టె, పెట్టె వెతుకుతూ గార్డు మా పెట్టెకు వచ్చాడు. చైను గుంజింది ఆపెట్టెలోనేనని తెలుసుకుని, 'ఎందుకు గుంజారని' ప్రయాణికులను అడిగాడు. ఆ ప్రశ్న వింటూనే ఒక ప్రయాణికుడు 'చాలా తొందరగా వచ్చారే' అని హేళనగా సమాధానం చెప్పాడు. 'ఆ' ఏదో 'ఆక్సిడెంట్' (ప్రమాదం) అనుకున్నా' అని నీళ్ళు నమిలాడు గార్డు, ఆక్సిడెంట్ జరిగితే తనపూచీ ఏమీ లేనట్టు! తరువాత చల్లగా తన పెట్టెకు వెళ్ళి పోయాడు.

అసలు సంగతి ఏమిటంటే రైలు నట్టడివిలో ఆగినప్పుడు ఆమూలనుంచి ఈమూలకు వచ్చి వెళ్ళే ధైర్యం గార్డుకు లేక పోయింది. తన భయాన్ని కప్పిపుచ్చుకునేందుకు అట్లా తెలివి తక్కువగా మాట్లాడాడు. ఈమాటనే అనుకుని పెట్టెలో ఉన్న మేమంతా నవ్వుకున్నాం! (పోట్లాడుకున్న వారితోసహా)

ఎస్. బి. ఆర్. (విజయవాడ)




## సాందీపనిపర్వం - 42

క్రాశిలో జడిగా వానపడిన నాటి రాత్రి సుదక్షిణకు నిద్దురపట్టలేదు. ఆమె ఏదో అగోచరమైన భయముతో బాధపడుచున్నది. ఆ పగలంతయు మహారాజునకు ఆరోగ్యముగ లేదు. రాత్రి సమీపించుచున్నకొలదియు ఆయన స్థితి మరియు దిగజారిపోవుచున్నట్లున్నది. తన తండ్రి యేమగును ? తన జీవితము ఏమగును ? తన్నేమో, తండ్రి, పౌండ్రక వాసుదేవునకిచ్చి పెండ్లి చేయుద మనుకొన్నాడు. ఆ పెండ్లిని ఆయన చూచునా ! తన తల్లి యేమో చిన్నతనముననే పోయినది. అప్పటినుండియు ఆయనే తన్ను తండ్రియై, తల్లియుగూడనై సాకుచున్నాడు. తన్ను పౌండ్రకుని చేతిలో పెట్టి, సుఖముగా నుండ మనుకొనినాడు. ఇప్పుడు ఆయన స్థితి ఇట్టులున్నది. ఆయన ఆశ ఫలించునో ! సుదక్షిణకు దుఃఖము పొంగులుగా వచ్చినది. వైద్యులు వచ్చినారు. పౌండ్రకుడు వారిని పిలిపించినాడు. సుదక్షిణ సంతోషించినది. తండ్రియు సంతోషించినాడు. "వాసుదేవ ! వైద్యులను ఏల పిలిచితివయ్యా !" అన్నాడు. వాసుదేవుడు మాటాడలేదు. తండ్రి తనవంక చూచినాడు. "నాకు ఈ వైద్యులు అనవసరమయ్యా ! నేను ఒక్క వైద్యుని నే చూడగోరుచున్నాను. కన్నులున్న ఫలము, జన్మించినందులకు ఫలము, ఆ వైద్యుని చూచినచో కలుగును. సర్వ ఆమయములను ఆ వైద్యుని దర్శనముచేత తొలగిపోవును. ఆ వైద్యుని పిలిపించలేవుగదా !" అనినాడు.

సుదక్షిణ కా వైద్యు డెవరో అర్థమైనది. పౌండ్రకునకును అర్థమైనది. అతడు ఈ మాటలు విని తన ముఖము నింత చేసుకున్నాడు. సుదక్షిణకు భయమైనది. పౌండ్రకు డచ్చటినుంచి కదిలిపోయినాడు. సుదక్షిణ అతని ననుసరించినది.

"స్వామి !"

"ఏమి ! సుదక్షిణ !"

"తండ్రిగారి ఆ కోర్కె విన్నారుగదా !"

"విన్నాను."

"ఏమి చేయుదమందురు !"

"నేను వాసుదేవుడ నుండగా, మరియొక వాసుదేవుడు ఇచ్చటకు వచ్చుట యెట్లు ? వచ్చును పో! అది నాకు సంబంధించినది కాదు. ఇప్పుడు నేను అతనిని పిలుచుకొని రావలయునా ! సుదక్షిణ! అది నావలన జరుగుపని కాదు."

సుదక్షిణ ఏమియు మాటాడలేదు. ఆమె హృదయములో దుఃఖములు మేఘములుగా క్రమ్ముచున్నట్లు, ఆకాశమున గూడ మేఘములు క్రమ్ముకొని పోయినవి. అది పగలే కాని, పగలుగా లేదు. చీకటి పడుచున్నట్లున్నది. తనలోగూడ అంతయు నట్టులే యున్నది. ఆ వాసుదేవుడు వచ్చినచో తన తండ్రి బ్రతుకునేమో ! ఆ ఆశయు సాగి వచ్చునట్లులేదు. ఆమె కేమియు తోచలేదు. తాను పోయినచో ! లోకమువారు ఏమనుకొందురు ? ఆమె నెమ్మదిగా మరల తండ్రివద్దకు పోయినది. ఆయనయు ఆమెను చూచి ఏదో మాటాడబోయి, అంతలో ఆగిపోయినాడు. సుదక్షిణ దుఃఖముచే క్రుంగిపోయినది.

రాజు మరల ఆ సంగతి ఎత్తలేదు. వైద్యులతో మాటలాడుచు కొంతకాలమును గడపెను.

"అయ్యా ! ఇది తమవలన నగు వైద్యము కాదు. మీరు శరీరమునకు నేమైన నామయము కల్గుచో మందుల నీయగల్గుదురు. నా వ్యాధి శరీరమునకు సంబంధించినది కాదు. మీవలన తీరునదియు కాదు" అని తన అభిప్రాయమును చివరకు తేల్చివేసినాడు.

వైద్యులు చేయునది లేక యూరక నిలుచుండిపోయినారు. రాజు సుదక్షిణతో అనినాడు : 'అమ్మా! ఇక్కడ వీరి అవసరము ఏమి ఉన్నది ?"

సుదక్షిణ కన్నులలో నీరు కన్నులలో క్రుక్కుకొన్నది. వైద్యులతో నన్నది : 'అయ్యా ! తమరు సెలవు తీసుకొనవచ్చును." వైద్యులు కదిలిపోయినారు.

రాజు మరల సుదక్షిణతో ఇట్లు లనినాడు : "తల్లీ ! నేను నిన్నుగురించి చేసిన ఆలోచనము మంచిదియో, కాదో, ఇప్పు డాలోచించుటలేదు. ఏది ఆలోచించినానో, అది మంచిదే అనుకొన్నాను. ఇప్పుడును అనుకొనుచున్నాను. మరి నేను మాట తప్పువాడను కాను. నిన్ను పౌండ్రకున కిచ్చి వివాహముచేసి మరణించిన నాకు విచారములేదు. ఇది ఇట్లులేల చేసితినని కూడా నేను అనుకొనను. జీవి చేసుకొనిన కర్మనుబట్టి గదా అంతయును జరుగును. ఇందులో నేనై చేసెడి దేమియు లేదు. పౌండ్రకుని తల్లిదండ్రులను నేను వాని చిన్నతనముననే చనిపొమ్మనలేదు. నీవు ఒక్కగాని ఒక్క కూతురవు. నీ తల్లిని మాత్రము నేను చనిపొమ్మనినాను ! సర్వమైన ఈ దుఃఖమును అనుభవించుటకు భగవంతుడు నాకు ఆ అందరి ప్రాణములను ఇచ్చెను. వారి ప్రాణములతో బలిసినవాడను నేను. నాకు మరణము రాదు." ఆయన ఇక మాటలాడలేకపోయెను. కన్నులతో తన కుమార్తెను చూచుచు ఉండిపోయెను. ఆయన కనుకొలకులలో నీళ్ళు తిరిగెను. సుదక్షిణయు మౌనముగ దుఃఖించెను. ఆమె తండ్రియెదుట బేలకాలేదు.

"నాన్నా !"

"అమ్మా !"

"నేను పోయి వాసుదేవుని పిల్చుకొని వత్తును."

"నీవా !"

"పిల్చుకొని రారాదా !"

"తల్లీ ! అతడు వటువు. క్షత్రియుల ఇండ్లకు భిక్షకు మాత్రమే వచ్చును. వానిని పిలుచుట యెట్లమ్మా !"

"ఇది నాకు తెలియలేదు.."

"నేను చెప్పుచున్నాను కదా."

బయట ప్రకృతి యంతయు విటతాటముగనున్నది. కాశిరాజరాజోద్యానములు చెట్లు ఏమో పూనినట్లు గాలికి కదలాడిపోవుచున్నవి. కుండపోతగా పడుచున్న వర్షములో సర్వ ప్రకృతి స్నానమాడుచున్నదివలె ఉన్నది. సుదక్షిణ అనుకొన్నది : "నా మనస్సు ఈ ఉద్యానవనమును పోలి ఉన్నది. నా తండ్రి ఈ నా మనస్సునంత అందముగా పోషించెను. అది యేమో, ఈ ఉద్యానవనము ఈ వాయువునకు తాళుకొనలేనిదివలె, దుఃఖవీచికలకు నా మనస్సు గూడ తాళుకొనలేకపోవుచున్నది. నేను ఇంకను స్నానము చేయలేదు. తండ్రిగారిని స్నానము చేయించలేదు. ప్రకృతియేమో, వర్షాజలముతో శుభ్రము నగుచున్నది. దుఃఖములో సుఖమున్నదా? శుభ్రత యున్నదా ? అహా ! నేను మూర్ఖను. స్నానము చేతును."

ఆమె తండ్రితో అన్నది : "నాన్నా ! మీరు ఇంతవరకును స్నానము చేయలేదు. అగ్నికార్యమును పూర్తిచేసుకొనలేదు. నేను స్నానముచేసి అన్నియు సిద్ధముగా చేసెదను."

"తల్లీ ! వద్దు. నేను ఇక ఏమియు చేయను. శ్రీకృష్ణ వాసుదేవుని చూడక, వచ్చి గంగ కూడ త్రాగను. నేను అన్ని ధర్మములను నేడు వదిలివేయుచున్నాను."

ఆయన ఆగెను. మరల ఇట్లనెను : "చూడు తల్లీ ! జీవి అహంకారము. నేనేమో నా పిల్లకు పెండ్లి చేయలేదని, నా అల్లునకు రాజ్యము నీయలేదని తపన పడుచున్నాను. ఇది వర్షాకాలము ! బయట వర్షము పడుచున్నదా ! నాకు చూడుము. ఉక్కపోయుచున్నది. నేను ఏమి ధర్మములను వదిలితిని. ఏమియు వదలలేదు. అహంకారమును వదలలేని నేను ఏమి వదలినట్లు ! మనసా నన్నియు సన్యసించితిననుకొనుచున్నానే గాని తల్లీ ! నేను విదేహుడను కాదమ్మా !"

సుదక్షిణ మాటాడలేదు. తండ్రికి ప్రక్కగా కూర్చున్నది. ఆమె అనుకొన్నది : "నామీద ప్రేమవలన నా తండ్రి ఇంకను లోకమునకు కట్టుబడియున్నాడు. పరమును చూచుచు, ఇహమునకును బంధితుడైనాడు. మోక్షము తనముందు సాక్షాత్కరించినను ఆయన దానిని నా కొరకు కాలతన్నును. ఆయన కోరికను తీర్చలేని నేను ఏమి కూతురను."

ఆకసము పూర్తిగా మూసుకొనిపోయి, సముద్రము ఘనీభవించి పైకెగిరి కరిగిపడుచున్నట్లు వర్షము పడగా, రాజమందిరములు గూడా ఇరులకే కిరవులైనవి. సేవకులు రత్నదీపములను వెలిగించి మందిరములం దెల్లెడ కాంతులు తెచ్చిపెట్టినారు.

56-వ పేజీచూడండి

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

ఆలోచించి
మరీ ఖర్చుపెట్టండి
అదికూడా
తప్పనిసరి
అయినప్పుడే

ప్రస్తుతం మనం ఉత్పత్తికి ఉపకరించే వస్తువుల నిర్మాణంలో నిమగ్నులమై ఉన్నాము; మనకి పనికివచ్చే నిత్యావసర వస్తువులెన్నో కావలసినవన్నీ దొరకడంలేదు. మనకు కావలసిన వస్తువులు సరసమైన ధరలకు పుష్కలంగా లభించేవరకూ ఎందుకు వేచియుండకూడదూ? అవి లేకుండానే గడపవచ్చునేమో కూడా!

మీరు పొదుపు చేసిన ధనాన్ని ఉత్పత్తికి పనికివచ్చేవిధంగా ఉపయోగించండి... జాతీయాభివృద్ధికీ, భవిష్యత్తులో సమృద్ధికీ అది తోడ్పడుతుంది.



జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

DA 61/491




# లివరు: దాని ధర్మములు-2

లివరునుగురించీ, అందులో ప్రధానభాగములనుగురించీ, పసరుతిత్తిని గురించీ తెలుసుకున్నాము. లివరు నిర్వర్తించవలసినధర్మములు అనేకములు. అవి అతిసంక్లిష్టములు. వాటిని అర్థం చేసుకోవడం, గృహ వైద్యానికీ, కొన్ని పరిస్థితులలో ఆహారాదులు నిర్ణయించడానికీ చాలా అవసరం. లివరువిధులను అర్థం చేసుకుంటానికి, లివరులో అంతర్భాగముల సూక్ష్మనిర్మితిని గురించి కొద్దిగా తెలుసుకోడం అత్యవసరం.

లివరులో చాలా చిన్న చిన్న భాగము లున్నవనీ ఆ చిన్న భాగములను 'లోబ్యూలు' లు అంటారనీ యిదివరకే తెలుసుకున్నాము. లివరులో పిత్తరసమును ఉత్పత్తిచేసే జీవకణములు స్ఫటికాకారము గలవి. ఇవి వరుసగా చేరి అనేక చిన్న గ్రంథులుగా యేర్పడతవి. ఆ గ్రంథులమధ్యభాగముతో ఖాళీ ప్రదేశములు ఉంటవి. ఈ ఖాళీ ప్రదేశములలో నుంచి అతి సూక్ష్మము అయిన నాళములు బయలుదేరుతవి. అందులో ఒకటి లోబ్యూలులో తయారయిన పిత్తరసమును తీసుకొనిపోయే నాళిక మరొకటి లోబ్యూలులోకి ఆర్టరీ ద్వారా వచ్చిన రక్తమును తిరిగి హృదయానికి తీసుకొనిపోయే వెయినుయొక్క ఉపశాఖ. ఈ వెయిను ఉపశాఖ లాబ్యూలు శరీర మధ్యంలో నుంచి బయలుదేరుతుంది. ఇటువంటి ఉపశాఖలు ఎన్నో చేరి లివరునుంచి పోయే ముఖ్య వెయిను ఏర్పడుతుంది. పోర్టల్ వెయిను శాఖలు. లోబ్యూలును చుట్టి ఉంటవి. అంటే లోబ్యూలుపోర్టలు వెయినులో నుంచి వచ్చిన రక్తంలో పానకంలో తేలే రసగుల్లా లాగా ఉంటుందన్నమాట. లాబ్యూలుకు వచ్చే ఆర్టెరీ శాఖోపశాఖలుగా చిలిచిలి కేపిలరీలనే నాళములుగా లోబ్యూలులో ఉన్న స్ఫటికాకృతి గల జీవకణముల మధ్య ప్రదేశములకు రక్తం సరఫరా చేస్తుంది. ఈ వివరములు చిత్రంలో చూపబడినవి. లివరుకు పోయే ఆర్టెరీ, పోర్టల్ వెయినూ, పిత్తరసనాళమూ మూడు కలిసిపోతూ ఉంటవి. పోర్టల్ వెయిను శాఖలు లాబ్యూలును చుట్టివుంటవి. ఈవిధంగా జీర్ణకోశంలో తయారయిన చిన్న ప్రేగులోనుంచి ఆహరించబడిన, ఆహారపదార్థములను సేకరించి, లివరుకు తెచ్చే పోర్టలు వెయినులో ఉన్న రక్తము లివరులో ప్రతి జీవకణముకూ పోతుంది. లివరులో నుంచి పోకుండా తిన్న ఆహారం శరీర భాగములకు పోలేదు. లివరుభాగములలో ప్రవహించే రక్తము ఆర్టెరీ రక్తమూ, వెయిను రక్తమూ చేరి ఏర్పడిన మిశ్రమ మన్నమాట.

లివరులో జీవకణముల మధ్య రక్తనాళము విస్తరించి స్థావరము లేర్పడతవి. ఆ స్థావరముల అంచులలో నక్షత్రాకారముగల కొన్ని జీవకణములు ఉంటవి. వీటిని కుప్ఫర్ అనే శాస్త్రజ్ఞుడు మొట్టమొదట కనిపెట్టాడు. వీటికి క్రిములనూ, ప్రమాదకరములయిన విషపదార్థములనూ మ్రింగి, జీర్ణంచేసే శక్తి శరీరానికీ, లివరుకూ వాటివల్ల ప్రమాదం రాకుండా బయటికి పంపే శక్తి ఉంటుంది. ఇటువంటి శక్తిగల జీవకణములే స్ప్లీను (Spleen) (ప్లీహము) లోనూ, ఎముకల మధ్య ఉండే మజ్జా ధాతువులలోనూ (Bone Marrow), లింపు గ్రంథులలోనూ ఉంటవి. ఈ జీవకణముల విధి రక్తంలో ఉండే శ్వేతకణముల విధి వంటిదే. మజ్జా ధాతువులో ఉన్న యీ జాతి కణములు ఆకారం. వలలాగా ఉంటుంది. 'రిటెక్యులం' అంటే లేటిన్ భాషలో 'వల' అని అర్థము. నాళముల లోపలివైపున ఉండే జీవకణములను ఎండో దీలియ కణములు అంటారు. మజ్జా ధాతువు స్పాంజి వంటి నిర్మితి కలది. లివరులోనూ, స్ప్లీనులోనూ, మజ్జా ధాతువులోనూ, లింపు గ్రంథులలోనూ ఉన్న ఈ క్రిమిసంహారక కణముల నన్నింటినీ చేర్చి రిటెక్యులో ఎండో తీలియల్ సిస్టము (Riticulo Endothelion System) అంటారు. దీర్ఘములయిన క్రిమి వ్యాధులలో రక్తక్షీణతఏర్పడుతుంది. రక్తం, మజ్జా ధాతువులో ఉత్పత్తి అవుతుంది. అక్కడ ఉండే క్రిమిసంహారకకణములు, ఆపని చేయలేనప్పుడు, మజ్జ రక్తోత్పత్తి చేయలేదు. లివరులోనూ, స్ప్లీనులోనూ ఉండే యీ కణములు, క్రిమిదోషం ఏర్పడ్డప్పుడు అధిక మవుతవి. అందువల్లనే కొన్ని క్రిమి వ్యాధులలో, లివరూ, స్ప్లీనూ పెద్ద వవుతవి.

పిత్తరసము :—(Bile) పిత్తరసము చాలా ముఖ్యమయిన శరీర స్యందనము. ఇతర రసముల లాగా కాకుండా ఇది నిరంతరాయంగా లివరులో తయారవుతూ ఉంటుంది. పిత్తరసము ఏదో రకమయిన రసాయనిక వికృతికి హేతువైన రసము మాత్రమే కాదు. పోర్టల్ వెయిను ద్వారాను, రక్తనాళముల ద్వారానూ, శరీరంలో ప్రవేశించిన విషపదార్థములనూ జీర్ణ పరిణామఫలితములుగా తయారయిన విషపదార్థములనూ, ఇది ప్రేగుల ద్వారానూ, మూత్రం ద్వారానూ, బయటికి పంపుతుంది. "మలం" అంటే అక్కర్లేని పదార్థము. కంట్లో నుంచి వచ్చే పుసిని నేత్ర మలం అంటారు. ఈ మలవిసర్జనకోసమే పిత్తరసము నిరంతరాయంగా స్యందింపబడుతూ ఉంటుంది. 24 గంటల కాలంలో సుమారు ఒక మీటరు పిత్తరసమును లివరు తయారుచేస్తుంది. పిండానికి ఆరుమాసముల వయస్సు రాంగానే పిండశరీరంలో లివరు పిత్తరసమును తయారుచేయడం ప్రారంభిస్తుంది.

పిత్తరసం తయారుకావటం నిరంతరాయంగా జరుగుతున్నప్పటికీ, ఆ పిత్తరసం నిరంతరాయంగా డువోడినంలోకి పోతూవుండదు. లివరులో జీవకణములలో తయారయిన పిత్తరసం, పిత్తరసనాళికలలోకి పోయి చివరకు పసరు తిత్తిలో నిలవ చేయబడుతుంది. డివోడినంలోకి కొవ్వు పదార్థములు రాగానే, వేగస్ నరం ద్వారా వచ్చే ఆదేశములవల్ల

62-వ పేజీ చూడుడు



లోబ్యూల్ లోపలి నిర్మితి

# చదువుల్రావు

చదువుల్రావు









# ఈ వారం సినీ విహారం

మధుమూర్తి

## సావిత్రి నూరో చిత్రం

సాంఘిక చిత్రం "కలసి ఉంటే కలదు సుఖం" శతదినోత్సవాలు విజయవాడలో అన్నివిధాల వైభవంగా జరిగినవనే చెప్పాలి. ఉత్సవాన్ని పండుగలుగా జరిపించటం నవయుగవారి సంప్రదాయమే. ఈసారి మాత్రం ఈ ఉత్సవంలోని విశిష్టత ఏమిటంటే, శ్రీమతి సావిత్రి తిరుపతి విశ్వవిద్యాలయానికి భూరివిరాళం అందించ నున్నట్లు ప్రకటించింది. స్థానికంగా నిర్మించబడే స్టేడియమ్‌కు నవయుగావారు పదివేల విరాళం, ఎన్. టి. రామారావుకొంత విరాళం అందిస్తామని వెల్లడి చేశారు.

సావిత్రికి అభినందనలు అందించాలనే సంకల్పంతో ఆరోజు ఏ చిత్రం తాలూకు యూటింగ్‌లో పాల్గొంటున్నదో కనుక్కొని వాహినీ స్టూడియోకు వెళ్ళాను. మూడవ ఫ్లోరులో జగతి చిత్రం "ఆరాధన" కుచెందిన షూటింగ్ సాగు తున్నది.

నేను ఫ్లోర్‌లో అడుగు పెట్టేసరికి కిలకిలమంటూ నూరు మంది ఆంగ్లో ఇండియన్ అమ్మాయిలు అబ్బాయిలూ ఇటూ అటూ తిరుగు తున్నారు. అదేదో తేనీటి విందు సన్నివేశంకాబోలు చిత్ర నిర్మాణశాలకు చెందిన సిబ్బంది వారందరికి బల్లలు సర్దుతున్నారు. వాటిపై అలంకార వస్త్రాలు ఒక మూలనుంచి ఫలహారపానీయాలు సామగ్రి మరొకవైపునుంచి అందంగా పెడుతున్నారు. మరి కొంచెం ముందుకు వెళ్ళగానే ఇది విందు మాత్రమే కాదు నృత్యవినోదం ముందు జరిగే విందు అని సూచించే విధంగా రంగస్థలం, తెరలు నిర్మించబడిఉన్నది.

నిర్మాతలను పలకరించి ఇక్కడ ఎవరి నృత్యం జరుగుతోందని ప్రశ్నించాము. చిత్రగాధలో ఆనాడు లక్ష్మి పుట్టిన దినం. వేడుకగా విందు, పసందైన నృత్యం విజయలక్ష్మిచే జరిపించ బడుతున్నది. కొసరాజు వ్రాసిన పాట, స్వర్ణలత పిఠాపురం నాగేశ్వరరావుల కంఠస్వరంలో ఎస్. రాజేశ్వరరావు బాణీతో పాట ప్లేబాక్ యంత్రం నుంచి వినబడుతూంది. "ఏమంటా నేమంటావ్ ఓయ్ బావా! ఈ మాటకేమంటావోయ్ బావా!" అనేది పాట.

ముచ్చటైన మహారాష్ట్రమహిళగా విజయలక్ష్మి అలంకరించుకుని రంగస్థలంపై, డ్యాన్సు జతగా చేసుకుని చిన్ని, సంపత్ ఇచ్చిన ఆ దేశానుసారం నాట్యం చేస్తోంది.

కామెరామన్ సి. నాగేశ్వరరావు, దర్శకుడు వి. మధుసూదనరావు మంచి కోణాలలో నృత్యాన్ని వెండితెరకు అందిస్తున్నారు.

ఈ విందుకి వినోదానికి కథననుసరించి హాజరు కావలసిన పాత్రలరూపం ధరించి అక్కడకు సావిత్రి, గిరిజ, రేలంగి, రమణారెడ్డి వచ్చారు.

జగతి నిర్మాతలు రంగారావు, రామేంద్ర ప్రసాద్‌లు, దర్శకుడు మధుసూదనరావు మరో వేడివేడి వార్త సావిత్రికి చెందినదే అందించారు. సావిత్రి ఇంతవరకు నటించిన చిత్రాల సంఖ్య తొంభై తొమ్మిది. జనవరి నెలలో ఏచిత్రం విడుదలైతే ఆ చిత్రానికి ఆమె నటించిన నూరవ చిత్రంగా ఖ్యాతి వస్తుంది.

సావిత్రి నిజంగా అభినందనీయురాలు. చిన్న వయస్సులో, చిత్రపరిశ్రమలో అడుగు పెట్టి దశాబ్దం కాకమునుపే తెలుగు, తమిళ చిత్రాలు నూరింటిలో హీరోయిన్‌గా నటించ గలిగే విశేషమైన కీర్తిని ఆర్జించగలగడం అసాధారణమైన అంశం. ఏ తెలుగు తార కూడా స్వల్ప వ్యవధిలో శతచిత్ర సుందరి కీర్తిని అందుకో లేదు. అందచందాలతోబాటు సున్నితమూ, సునిశితమూ అయిన నటనతో పాత్రలకు జీవం పోయగల శక్తిని ఆమె స్వంతం చేసుకున్నది. ప్రేక్షకులు గుర్తించి ఆదరాభిమానాలు అందించారు.

## ఆనందం ఎక్కువైతే ఆరోగ్యం ఎలా ఉంటుంది?

విరామసమయం అప్పుడే దొర్లిపోయినట్లున్నది. వాహినీ స్టూడియో ఒకటో ఫ్లోర్‌లోకి చక్రపాణి, దర్శకుడు కె. కామేశ్వరరావు, కామెరామన్ మార్కస్ బార్‌ట్లే, సౌండ్ ఇంజనీర్ శివరామ్, ఇతర సహాయకుల బృందం ప్రవేశిస్తున్నారు. వారివెంట నాగేశ్వరరావు, జమునలు వేషధారులై వెడుతున్నారు.

అదొక దాబా. తోటప్రదేశంలో పూలమొక్కలు, ఆకాశం నుంచి వెన్నెల, గదిముందున్న స్తంభాలను అల్లుకుపోయిన [illegible] తల లాడే



శేఖర్ ఫిలిమ్స్ వారి 'చిన్ననాటి శపథం'లో బి. సరోజాదేవి.

స్తుండడం — అంతా మనోహరంగా ఉంది. అక్కడే ఒక యువకుడు ఆ గది తలుపు దగ్గర నిలబడి లోపలనుంచి అమ్మాయి వస్తుందో లేదో రహస్యంగా కనిపెడుతూ, ఆమె వస్తున్న అలికిడి వినగానే బుద్ధిమంతుడిలా స్తంభం దగ్గరకు వచ్చి నిలబడి నింగివైపు చూస్తున్నాడు.

ఆమె వచ్చి స్తంభాన్ని ఆనుకుని నిలబడింది. ఆమెలో ఉత్సాహం ఒక గ్రామ్ కూడా లేదు. ఆరోజు ఆమె ఎంతో ఆనందంలో ఉండవలసిన

51 వ పేజీ చూడండి



జగతి చిత్రావారి '[illegible]'లో రేలంగి, గిరిజ.

# సహనశీలి

ముద్దంశెట్టి హనుమంతరావు



బైట చిన్న వర్షపు జల్లు. . . . ఈదురుగాలి వీస్తోంది. . . .

ప్రసాదరావు చుట్ట కాల్చుకుంటూ, వాలు కుర్చీలో కూచుని, ఓసారి తనజీవితాన్ని సంక్షిప్తంగా పునఃపరిశీలన చేసుకుంటున్నాడు.

అతనికి లేక లేక ఒక్కగా నొక్క కొడుకు పుట్టాడు. వంశోద్ధారకుడు ఉద్భవించాడన్న ఆనందం, ప్రసాదరావు దంపతులను ఉక్కిరి బిక్కిరి చేసింది. ఆ ఆనందంతోనే అల్లారుముద్దుగా పెంచుకొచ్చారు. 'మోహనరావు' అని నామకరణం చేశారు.

మోహన్‌రావు పదేళ్ళవాడుగా వున్నప్పుడే, ప్రసాదరావు ఉద్యోగంనుండి రిటైరై, విజయనగరంలో మకాం పెట్టాడు. మోహన్‌రావు అక్కడే చదువు సాగించాడు. స్కూలుఫైనల్ చదువుతుండగా అతని తల్లి మరణించింది. తల్లిని పోగొట్టుకున్న మోహనరావు వ్యథ యెలావున్నా, భార్యను పోగొట్టుకున్న ప్రసాదరావు ఆవేదన వర్ణనాతీతం. ఈ వృద్ధాప్యపు ప్రారంభదశలో, తను ఒంటరి జీవితం గడపవల్సివస్తుందని అతను యేనాడూ అనుకోలేదు. జీవితంలో తనకింకా తోడెవ్వరూ లేరనుకున్నాడు. అతనిలో ఒకవిధమైన నిరాశ, నిర్లిప్తత నిండుకున్నాయి.

అవుతేనేం—యింత నిరాశలోనూ అతనికి ఒక్కటే ఆశారేఖ అగుపిస్తుంది. అదే మోహన్‌రావు. వాడి జీవితం ఆనందమయంగా చెయ్యాలనీ, అతడ్ని ఉన్నతస్థాయికి తీసుకురావాలనీ, ఒక ఆశయం పెట్టుకున్నాడు. ఈ ఆశయమే అతనిలో ఆశను, ఆనందాన్ని మొలకెత్తించింది. ఇప్పుడు మోహన్ తల్లిలేనివాడుకాదు. తల్లీ,తండ్రీ అతనికిప్పుడు ప్రసాదరావే. ముద్దు, మురిపాలతో అబ్బాయిని పెంచుకొస్తున్నాడు. ఇంటరు పూర్తయ్యాక, వాణ్ణి యింజనీరు చెయ్యాలనిపించింది. వెంటనే మద్రాసు తీసుకుపోయి, యింజనీరింగ్ కాలేజీలో చేర్చాడు. తన ఆస్తినంతా వెచ్చించయినా సరే, కొడుకుని ఉన్నతస్థాయికి తీసుకు రావాలనే అతని వాంఛితం. అదే అతని ధ్యేయం!

మొదట్లో మోహన్‌రావు చాలా మంచివాడే. కాని, పరిసరాల ప్రాభవం కూడా మనిషిలో కొన్ని మార్పులు తెస్తుంటుంది. మద్రాసు వెళ్ళిన రెండో సంవత్సరంలో, కొడుకులో యేదో మార్పు వచ్చిందని, ప్రసాదరావు చూచాయగా అభిప్రాయపడ్డాడు. ఇటీవల ప్రతినెలా అదనంగా కొంత డబ్బు పంపిమంటూ, ఉత్తరాలవర్షం కురిపిస్తున్నాడు మోహన్‌రావు. ఇదే అవ్యక్తంగా ఒక కారణమయ్యింది, ప్రసాదరావు అలా అభిప్రాయపడ్డానికి. ఈ అభిప్రాయం కలిగినప్పుడంతా అనుకుంటుంటాడు, తను వాణ్ణి మద్రాసులో చదువుకి పెట్టడంలోనే పొరపాటు చేశాడేమోనని; విశాఖలో మెడిసిన్ చదివించితే బాగుండేదేమోనని కూడా అనుకుంటుండేవాడు. కాని, తరుణం మించిపోయింది. తాను డబ్బుకి యెక్కడ యిబ్బంది పడతాడోనని ఉత్తరం వచ్చినప్పుడంతా డబ్బు పంపుతూనే వున్నాడు. అసలే సున్నితహృదయుడు ప్రసాదరావు. పైగా, లేక లేక పుట్టిన గారాబు కొడుకు మోహన్. ఈ అనుబంధమే అతణ్ణి ప్రోత్సహిస్తుండేది.

ఆరోజే మోహన్ దగ్గర్నుంచి టెలిగ్రామ్ రావడం, ప్రసాదరావుని యింత ఆలోచనలోముంచింది. అర్జంటుగా నూరు రూపాయిలు పంపమన్నాడు. వాడి అవసరాలు రోజ రోజుకీ పెరిగిపోతున్నాయా? అన్న సందిగ్ధంలోపడ్డాడు ప్రసాదరావు. ఏమిటీ అవసరాలు? ఇంతకీ శ్రద్ధగా చదువుతున్నాడా? లేక యేమన్నా చెడుత్రోవలు పట్టాడా ? . . . . ఈ ఆలోచన వచ్చేసరికి ప్రసాదరావుకి ముచ్చెమటలు పోశాయి. కాదు. . . . అలా అయ్యుండదు. . . . అని మళ్ళీ తనలో తనే సమర్థించుకున్నాడు. తన ఆశయం తప్పకుండా నెరవేరుతుంది. . . . తన శ్రమ ఫలిస్తుంది. . . . బలవంతాన ఆ భావన తెచ్చుకున్నాడు. కీడెంచడం ఇష్టంలేక.

మరుసటిరోజు మామూలు ధోరణిలోనే నూరు రూపాయిలు మనియార్డరుచేసి ఓ ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరం ఆసాంతం ఒక్కటిగిని చదివితే సౌమ్యంగానే వుంది. కాని, కాస్తంత యింగితం వున్నవాడికి అత్మాభిమానం వున్నవాడికి, అక్కడక్కడ చరుక్కుమనిపిస్తుంది. మోహన్ తప్పకుండా ఆ ఉత్తరాన్ని అర్థం చేసుకుంటాడనే భావించాడు ప్రసాదరావు.

మోహన్‌మీద ప్రసాదరావు యెన్నో ఆశలు పెట్టుకున్నాడు. తనకొడుకు తనవంశానికే పేరు తీసుకురావాలని, వాణ్ణి ఆ స్థాయికి తీసుకువెళ్ళే బాధ్యత తనమీద వుందనీ, భావించాడు. మోహన్ ఆఫీసరు రాంక్‌లో ఒకరోజు తనకి కనిపిస్తాడన్న ఆకాంక్ష అతనిలో దృఢంగా వుంది.

కాని, మానవుడు తలచింది యెప్పుడూ నిర్విఘ్నంగా జరగదు. అది ఒక విధమైన శాపమో, యేమో మరి!

ప్రసాదరావు డబ్బు పంపిన పదిరోజులకు మోహన్ దగ్గర్నించి మరో ఉత్తరం వచ్చింది. తను వస్తున్నట్టుగా రాశాడు.

కొడుకు వస్తున్నందుకు అమితానందం పొందాడు ప్రసాదరావు. కాని, అదే సమయంలో ఓ విధమైన అసంతృప్తి కూడా ఉద్భవించింది. కాలేజీకి యిప్పుడేమీ శలవులు లేవుగదా, యెందుకు వస్తున్నాడా అన్నదే అతని అసంతృప్తికి కారణం. . . అదే అనుమానానికి దారితీసింది. అదే ప్రసాదరావుని బాగా పీడించింది. అవుతే తన అనుమానాన్ని బాహ్యంగా యే స్నేహితులతోనూ వ్యక్తం చేసుకోలేకపోయాడు.

* * *

వస్తానన్న రోజుకి సరిగ్గా మోహన్‌రావు వచ్చాడు. రావడం ఒంటరిగా కాదు. ప్రక్కనే ఓ అమ్మాయి వుండటంచూసి, మొదట్లో ప్రసాదరావు దిగ్భ్రమ చెందినా, క్రమంగా తట్టుకుని మందహాసం చేశాడు. అతని హృదయాంతరాళంలో అగ్నిజ్వాలలు వుజ్వలంగా రేగుతున్నా, పెదాలపై ప్రయత్నపూర్వకంగా చిరునవ్వు తెచ్చుకోవడం అతనికి క్రొత్తకాదు.

“మా నాన్నగారికి నమస్కారం చెయ్యి సరళా!” అన్నాడు మోహన్ ప్రియురాలివేపు మందహాసంతో చూస్తూ. అతడి మాటలు ప్రసాదరావు గుండెల్లోంచి బాణాల్లా దూసుకుపోయాయి. కొడుకువేపు, ఆ అమ్మాయివేపు, వింతగా, అయోమయంగా చూశాడు.

“ఏవిట్రా యిది?” యెంతో ప్రయత్నం మీద, సౌమ్యంగా అన్నాడు.

మోహన్ తడబడలేదు. భయపడలేదు. బిడియపడలేదు. అతని పెదాలపై చిరునవ్వు మాత్రం క్షణంసేపు మాయమయ్యింది. అంతే!

“క్షమించండి నాన్నా! మీకు తెలియజెయ్యకుండా, స్వతంత్రించి నా సహచరిణిని నేను యెన్నుకున్నాను. నా కోరిక మీరు ఎన్నడూ కాదనలేదు. ఈనాడు కూడా నా హృదయానికి ఘాతం తగుల్తుందని అనుకోను. . . . అందుకే వున్న విషయాన్ని దాపరికం లేకుండా విజ్ఞప్తి చేశాను. మా యిరువురి మనసులు కలిశాయి. మీ ఆశీర్వచనంకోసం అభ్యర్థిస్తున్నాం. . . .” అన్నాడు సవినయంగా.

సరళ వంగి మామగారికి నమస్కరించింది. ప్రసాదరావు యాంత్రికంగా ఆమెను దీవించకుండా వుండలేకపోయాడు. కొడుకు చేసినపని అసమంజసంగావుండి, హృదయానికి ఘాతం కలిగించినా, అంతరిలా వుద్రిక్తుడై, నోరు పారేసుకోవడం, వాళ్ళని అసహ్యించుకోవడం, ప్రసాదరావుకి చాతనయ్యింది కాదు. అదే అతనిలోవున్న ప్రత్యేకత.

“లోపలికి తీసుకువెళ్ళు. . . .” ముక్తసరిగా ఈ మాట మాత్రం అనగలిగాడు. అది కూడా గంభీరంగా, సౌమ్యంగా వుంది.

ప్రసాదరావు మనస్తత్వాన్ని ప్రప్రథమంగా చవిచూస్తున్న సరళ, నిజంగా విస్తుపోయింది. తన మామగారు యెంత సహృదయులు ?. . . . అనుకుంది.

“పద సరళా! మా నాన్నగారు నా అభిమతాన్ని యేనాడూ కొట్టిపారేయరని చెప్పానుగా!” మందహాసంతో అంటూ ముందుకు సాగాడు. సరళ అతణ్ణి అనుసరించింది.

ప్రసాదరావు మొదలు తెగిన వృక్షంలా కూలబడిపోయాడు. రక్తప్రవాహం స్తంభించిపోయినట్టుగా భావించాడు. మెదడులో [illegible] కొట్టుకుంటున్నాయి. ఏవిటి, వీడు చేసిన నిర్వాకం ? వాడి భవిష్యత్తుపై తను యెన్ని ఆశలు పెట్టుకున్నాడో, వాడికి తెలుసునే. తెలిసి కూడా యిప్పుడిలా చదువుకి అంతరాయం కలిగించుకుని, ఆ అమ్మాయిని వెంటబెట్టుకు రావడమేవిటి? ఈ పరిస్థితుల్లో యింక వీడు చదివేదేవిటి? తను నిర్మించుకున్న ఊహాసౌధాలు కూలిపోవాల్సిందేనా, [illegible] అన్నీ అడుగంటవల్సిందేనా, ఇప్పుడు తన కర్తవ్యం యేమిటి?. . . . ఈ విధంగా రక రకాల ఆలోచనలతో అతని బుర్ర వేడెక్కిందిగాని, ప్రస్తుతం ఆలోచించవల్సిన మార్గమేమిటో వూహకి తట్టలేదు. గట్టిగా కేకలు వేయడంవల్ల, ఉద్రేకం తెచ్చుకోవడంవల్ల, ఫలితం యేమీ వుండదని అతను యేనాడో తెలుసుకున్నాడు గాబట్టి, మార్గాంతరం యోచించాల్సి వచ్చింది.

మిట్ట మధ్యాహ్నం వేళ. . . .

అప్పుడే ప్రసాదరావు, మోహన్‌రావు భోజనాలు ముగించారు. సరళ వంటగది ద్వారం దగ్గర నుంచుంది.

43-వ పేజీ చూడండి



# వనితా వాణి

## పేకాట

కుమారి నాగినిగారు 'పేకాట' విషయం మీద వ్రాసిన వ్యాసం చూస్తే చాల బాధ కలిగింది. ఆమెగారు ఎన్ని సంసారాలు ఈ వ్యసనానికి బలౌతున్నాయో చక్కగా వివరించారు. ఒకటి రెండు సార్లు డబ్బు వస్తే ఇక ఆ ఆటలోనే సర్వమూ ఒడ్డి వోడిపోతారు. క్లబ్బులని ప్రత్యక్షంగా సాగుతున్న జూదానికి ప్రభుత్వం లైసెన్సులు కూడా ఇస్తున్నారు. పేరుకు అందరూ పెద్దమనుష్యులే! కాని ఇంటిలో ఆడవారికి తెలుసు వారి పెద్దరికమేమిటో ! మాకు పరిచయమున్న ఒకాయన తాను తిని పదిమందికి పెట్టగల స్థితిలో ఉండేవాడు. పేకాటకు దాసుడై ఇప్పు డాతనికి పదిమంది పెట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది.

టి. డి. జానకీబాయి (రాజంపేట)

* * *

దురభ్యాసాలలో ఒకటయినటువంటి 'పేకాట' ను గురించి 'కుమారి నాగిని' చక్కగా వ్రాశారు. దీనివల్ల ఆ అభ్యాసంఉన్న వారికి మంచి బుద్ధి కలుగుతుందని నా అభిప్రాయం.

బాణగిరి విజయలక్ష్మి (కర్నూలు)

* * *

సప్త వ్యసనములలో "పేకాట" ఒకటి. సప్త వ్యసనములలో ఏ ఒక్కటి ఉన్నా చెడిపోవుదురన్న పెద్దల వాక్కులు నిజము.

కుమారి సూరు విమల (చీపురుపల్లి)

* * *

ఈ పేకాట వ్యసనానికి లోలుడై మాకు తెలిసినాయన ఆస్తినంతంచేసి భార్యబిడ్డలను వదలి దేశాంతర్యామియై అడుక్కోగా వచ్చు డబ్బుతో రోడ్డు ప్రక్క మూడు ముక్కల మాజిక్కాట ఆడుచుండగా మా ఆయన కంటపడ్డారుట. ఈ వ్యాసం చదివిఅన్నా ఇలాంటిపెద్దలు ఒకదారికి వస్తారని నమ్ముచున్నాము. నా రన్నట్లు పండగ పబ్బాలలో ఆడకపోతే రక్తే ఉండదనిపిస్తుంది !

మరువాడ సూర్యకుమారి (పార్వతీపురం)

* * *

పేకముక్కలు ముఖము దగ్గర ఉంచుకొని రాత్రంతా నిద్రురలేక టీ సేవించడము, సిగరెట్, బీడీలు కాల్చడం, తెల్లవారుజామున ఏ నాల్గింటికో యింటికి రావడం పేకాట ప్రబుద్ధుల లక్షణం. కొంపలు గుల్లలు చేయుటే గాక మనస్సు చిల్లులు పడేలా మాటాడుతారు ఈ జాతివారు.

వే. బాలనాగి (వై. టి. చెర్వు)

* * *

పేకాట అనే ఈ అంటురోగానికి ఆహుతి అవుతున్న కుటుంబాలు అనేకం ఉన్నాయి. వ్యాసం చదువుతుంటే మా బంధువులలో ఒకాయన గుర్తుకు వచ్చారు. ఆయనకు తాగుడు మొదలైన దురభ్యాసాలన్నీ ఉన్నాయి. పగలు మూడింటికి క్లబ్బుకి వెడితే తెల్లవారిన తరువాతగాని ఇంటికి రారు. ఒక్కొక్కసారి రెండు రోజుల వరకూ ఇంటిమొహం చూడరు. ఎప్పుడైనా భార్య ఏమైనా అంటే ఈమధ్య కొట్టడం కూడా మొదలుపెట్టారు. ఈ వ్యాసం చదివితే ఏమైనా మారుతారేమో ?

ఎ. విమలాదేవి (కోరుకొల్లు)

* * *

కనీసము కొందరికైనా దీనివలన బుద్ధి కలుగుతుందనే ఆశయము తప్పక నెరవేరుతుందని నా ఆశ.

ఎస్. సుదామణి (వాల్తేరు)

* * *

మగవారు ఈ పేకాట పిచ్చిలో పడి భార్యపిల్లలు ఏమైపోతారో అని కూడ ఆలోచించరు. ఈ వ్యాసం చదివిన తరువాతైనా పేకాట ఆడుట మానగలరేమో !

జె. బేబి (మోరి)

* * *

ఇది చదివినవారు నూటికి ఒక్కరు మారుతారు గాని, అంత సులువుగా ఈ అంటువ్యాధి నుండి విముక్తులు కారు. ఈ పిచ్చ మా ఇంటిలో కూడా ఉన్నది.

టి. లక్ష్మీతాయారమ్మ (వేగివాడ)

* * *

పేకాట పిచ్చిలో పడిన మహానుభావుల పడక ఈ వ్యాసం ద్వారా చక్కగా విశదీకరించారు. మాకు తెలుసున్న ఒకతను ఈ కోవకు చెందినవాడే. ఈ పిచ్చిలో పడినవాళ్ళకు కాలగమనమే గుర్తు ఉండదనిపిస్తుంది. ఒకసారి యితను భార్యను సినిమాకు తీసుకు వెడతాను సిద్ధంగా ఉండమని తను క్లబ్బుకి వెళ్ళి రాత్రి 2 గం. ల తరువాత వచ్చాడు. ఆయన భార్య పాపం రెడీగా తయారు అయి ఆయనగారి కోసం చూసి ఈ పేకాట పిచ్చిలో పడినవాళ్ళకు భార్య కూడా గుర్తుకు రాదు అనుకుంటూ పడుకుంది. ఇలాంటివారిని మనం సాధారణంగా చూస్తూనే ఉంటాము..

సుభద్రా వర్ధమాని (పూనా)

* * *

నాకు తెలుసున్న ఒకామె గుర్తుకు వస్తున్నది. ఆమె ఒకరోజు మెడనిండా వస్తువులు అలంకరించుకొని వచ్చేది. మరి రెండు రోజులకు అవి ఉండేవి కావు. ఎవరైనా నీ వస్తువులు ఏవి అని అడిగితే "మామూలే పేకాటలోకి వెళ్లాయి" అనేది. ఇట్లా ఎంతమంది విలువైన కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నారో అనే ఆలోచన రాకమానదు. ఈ వ్యాసం చదివైనా చాలామంది తమ తప్పు తెలుసుకుంటారని ఆశిస్తాను.

డి. ఇందిర (శెట్టిపేట)

* * *

పేకాట దాసులైన మానవుల కుటుంబాలు ఎంత అధోగతి పాలవుతున్నాయో చక్కగా విశదీకరించారు. పేకాట అంటే జ్ఞాపక మొస్తుంది. నాకు తెలిసిన ఒకాయనకు పేకాట అంటే తెగ పిచ్చి. ఆయన ఇలాగే పేకాటకు వెళ్లి ఆడుతూ ఉన్నారు. ఆదేం అదృష్టం పట్టిందో కాని వెళ్లిన దగ్గర్నుంచి తిరిగివచ్చే వరకు ఆయనదే గెలుపు. ఇది సహించలేక మిగతా ఆటగాండ్రు కుట్రపన్ని దారిలో కాచి ఆయన్ని నరికివేసి ఆయన దగ్గరున్న డబ్బును తీసుకుపోయారు. ఇటువంటివి జరుగకుండా ఉండా లంటే "పేకాట" అనే అంటురోగముకు దూరముగా ఉండవలెను.

ఎం. పద్మ (పలాస)

* * *

పేకాట కాస్త, కూస్త, వ్యసనం కాదు. అది మనిషిని చులకనగా లోపరచుకుంటుంది. ఏమి తోచక మా చెల్లెలు, నేను పేకాట ఆడుతూ వచ్చాము. ఆడిన రెండు మూడు రోజుల్లోనే దాని సంగతి అర్థమైంది. వేళకు పనిపాటలు చెయ్యటం కూడ మానేసి అదే ఆడటం మొదలుపెట్టాం. డబ్బూ గిబ్బూ పెట్టకుండా ఆడితేనే ఇట్లా ఉంటే ఇంక డబ్బుపెట్టి ఆడేవాళ్ల సంగతి వేరే చెప్పనక్కర్లేదు. ఆడేవారంతా పెద్ద పెద్ద ఉద్యోగస్థులు. వీళ్లంతా సరదాకి ఆడుతున్నామనే అంటారు. కాని చూచేవాళ్లకి తెలుస్తుంది వీళ్ల వ్యసనం. సరదాలకి ఆడాలంటే 'ఇండోర్ గేమ్సు' కూడ చాలా ఉన్నాయిగా. కాని ఎక్కడ చూచినా దీనిమీద ఉండే భ్రమ మరొక దానిమీద కనిపించటంలేదు. విద్య, సంస్కారం లేనివాళ్లెవరైనా, ఏ చెట్టుక్రిందో కూర్చొని పేకాట ఆడుతుంటే అదిలించి, బెదరించి లేవదీస్తారు. కాని, విద్య, సంస్కారం కలిగి పుట్టెడు బాధ్యతలు భరించవలసిన మహానుభావులు, క్లబ్బులంటూ ఇటువంటి అసభ్యపు పనులు చేస్తుంటే అరికట్టేవాళ్లే లేరు. డబ్బు పోగొట్టుకునేవాళ్ళు ముందైనా గెలవాలని, పోగొట్టుకోనివాళ్ళు ఇంకా ఉషారులో— ఆటను సాగిస్తూంటారు. ఇటువంటి విషయా లింకొకరు చెప్తే ఎక్కువ సరికదా, వీళ్లమీద కోపం కూడా

వస్తుంది. ఎవరికివారే తెలుసుకోవాలి. ఒకరిచేత తెప్పించుకొనేంత విపరీత స్థాయికి రాకూడదు.

జి. అంజనీదేవి ( నెల్లూరు )

* * *

## లౌడ్ స్పీకర్లు

పి. అనసూయగారు వ్రాసిన "లౌడ్‌స్పీకర్లు" వ్యాసంలో ఉన్నబాధ ఉన్నట్లు వివరించారు. కానీ కర్మ మంత్రాలకి కూడా లౌడ్‌స్పీకర్లు ఉపయోగించటం నే నెక్కడా ఎరుగను.

వి. విజయలక్ష్మి ( విజయవాడ )

* * *

లౌడుస్పీకర్లమీద వ్యాసం చదివాను. వీటికోసం మనం మీటింగులకు, పెళ్లిళ్లకు వెళ్లక్కరలేదు. మనలో చాలామంది లౌడ్‌స్పీకర్లలాగే ప్రవర్తిస్తారు; ఎంత గట్టిగా అరిస్తే అంత బాగా (అవతల వాళ్లకి) అర్థమవుతుందనే వూహ కొందరికి ఉంటుంది గావును. పోనీ అరిస్తే పరవాలేదు అనుకుంటే సినిమాలలో కూడా ఇదొక ఫాషన్ అయిపోయింది. అందులో చివరి సీనులలో తప్పకుండా అందరూ గొంతు చించుకునేట్లు 'మాట్లాడుతారు'. దానికి తోడు విచిత్రంగా అభినయాలు చేస్తారు. ఎంతమంది పిల్లలు దీన్నంతా చూసి అనుకరణ మొదలుపెట్టి ఎంతమందికి చెముడు తెప్పిస్తారో చెప్పలేము.

ఎస్. హేమ ( మద్రాసు )

* * *

## పేర్లూ - పిలవడాలూ

"వెంకటసుబ్బమ్మ" కు షార్టుకట్ అడిగారు. ( సుబ్బమ్మ ) "సుబ్బులూ!" అని మహా చక్కగా 'కట్' చేయవచ్చు. 'ఏమేవ్' అనో, 'ఒసేవ్' అనో పిల్చుటలో మొరటుదనం ఎంతమాత్రం లేనప్పుడు "సుబ్బులూ!" అనడంలో మొరటుదనం అనేదే లేదు.

"దాసీలను 'ఒసేవ్' అంటే ఇక్కడ దుమ్మెత్తి పోస్తారు." దీనిని ఎందుకు వ్రాశారు ? ఒకే పదము వివిధ ప్రాంతాలలో వివిధ అర్థములతో ప్రజలు వాడుకుంటారు. త్రిపురసుందరిగారి వ్యాసానికి ఈ వాక్యానికి సంబంధమే లేదు.

—కె. ఆదిలక్ష్మి, బి. రాజేశ్వరి, జి. రాణి, కె. రాణి ( ఏలూరు )

* * *

భర్తలు భార్యలను పిలిచే దగ్గర ఏమే, ఒసే అన్నంతమాత్రాన దాసీదాన్ని అని ఎందుకు అనుకోవాలి. సాధారణంగా మన అక్క చెల్లెళ్లలో గాని, తల్లినిగాని ఏమే, ఒసే అని పిల్చుకుంటుంటాము కదా ! అలాంటప్పుడు భర్త అలా పిలిస్తే మనం ఎందుకు తప్పుగా భావించుకోవాలి. ఇప్పటి నాగరిక పద్ధతి ననుసరించి పేరుతో పిల్చుకోవటం మంచిదే గాని తల్లిదండ్రులు అన్నదమ్ములు ఉన్న సమిష్టి కుటుంబములో భార్యను పేరుతో పిలిస్తే వారేమనుకుంటారో నసే బిడియముకొద్దీ కూడ పేరుతో పిలవకపోవచ్చు. ఇంతమాత్రానికే ఈ విషయమును గురించి మనం తప్పుగా ఎందుకు అనుకోవాలి.

కొప్పాక రుక్మిణమ్మ ( గోపవరం )

నేటి యువతీ యువకులలో అలా పిలవడం చాలా అరుదుగా కనబడుతుంది. తాతయ్యగారి కేకలు, బాబాయిగారి పిలుపులు మరల జ్ఞాపకం చేశారు.

పద్మా సుశీల ఇందుమతి ( వరిగి )

* * *

ఒక సోదరి "పేర్లు, పిలవడాలు" వ్యాసాన్ని కొంత విమర్శించారు. రచయిత్రి భార్యలను భర్తలు షార్ట్‌కట్‌తో పిలువవచ్చు అని అన్నారు. కానీ, "వెంకటసుబ్బమ్మ" అన్న పేరుని షార్ట్‌కట్‌తో ఎలా పిలుస్తారు అని రాసారు. ఎందుకు పిలవకూడదండీ ! చక్కగా పిలవవచ్చు! "వెంకటసుబ్బమ్మ" ని షార్ట్‌కట్‌తో "వెంకులూ" అని పిలువచ్చు! లేకపోతే "సుబ్బులూ" అని పిలవచ్చు. ఏ పేరు నయినా త్రుంచి పిలవచ్చు.

కుమారి కాజ వెంకట శారద ( తెనాలి )

* * *

ప్రస్తుతం భర్తలు భార్యలను పేర్లతో పిలుస్తున్నారు. అలా పిలవడము ఫ్యాషను అయింది కూడా. అట్లా సంబోధించడం భార్యపై గల అనురాగాన్ని వ్యక్తపరచడ మన్నమాట. మా ఇంట్లో నన్ను కూడా పేరుతోనే పిలుస్తా రనుకోండి. కారణం, మేము యిప్పటి కోవకు చెందినవారమే గనుక.

భర్తలు అలా పేర్లతో సంబోధిస్తారని, స్త్రీలు కూడా భర్తలను ఎలా పేర్లతో పిలుస్తారు ?

స్త్రీలు భర్తను "ఏమండీ" అని పిలవాలి. ఒకవేళ అలా పేర్లుపెట్టి అభిరుచులనుబట్టి నచ్చిన పేర్లతో పిలిచినా "భర్త ఎంత లోకువ" "భర్తయందు గౌరవము లేనిదని" తలుస్తారు, అలా పిలవడం విన్నవాళ్లు. నిజముగా, మనస్సులో భర్త అంటే గౌరవభక్తులు ఉన్నా, చూపరులకి మాత్రం అలా అనిపిస్తుంది.

పేర్లుపెట్టి పిలిచేవారికి నచ్చినా, లోకానికి నచ్చాలిగా. అందుకనే లోకానికి వెరవా లన్నారు.

ఏది ఎలాగ ఉన్నా, ప్రతి స్త్రీ కూడా భర్తను "ఏమండీ" అని పిలుస్తే బాగుంటుందని నా అభిప్రాయము. అవిధముగా సంబోధించడమువలన, గౌరవ, మర్యాదలకి లోటు ఉండదని, అమాట ఎంతో గౌరవమయినదని నా భావన.

అమారాధ (ఏలూరు)

* * *

ఒక స్నేహితుడుగాని, స్నేహితురాలుగాని ఒరేయ్ అనిగాని, ఒసేవ్ అనిగాని పిలిస్తే మనమేమన్నా బాధపడుతున్నామా? లేదు. పైగా దాని వలన వారివారి ప్రగాఢమైన స్నేహం బహిర్గతమవుతుంది. భర్త భార్యను ముద్దుగా పిలుస్తూ, సమయం దొరికినప్పుడల్లా రంపంకోతకోస్తే ఏం లాభం? పిలుపులెలావున్నా అంతరాత్మలో అభిమానాలుండాలని తలుస్తాను.

పిల్లా లక్ష్మీతులసి (కాకినాడ)

* * *

భర్త భార్యను, ఏమేవ్, ఒసే అని పిలిస్తే బాగుండదు. అలా పిలిస్తే భార్యకు కష్టము కలుగునని కూడ యోచించరు. పేర్లతో పిలిస్తే బాగుంటుంది. మరి కొంతమంది భార్యను, జంతువులను పిలిచినట్లు, చీవాట్లు వేసినట్టు పిలుస్తారు. ఈ రోజులలో చదువుకొన్నవారు కూడ అలాగే పిలుస్తారు. వేరే వారిసంగతి చెప్పనక్కరలేదు.

వి. సుశీల ( గుత్తి )

* *

బాలా త్రిపురసుందరిగారు వ్రాసిన వ్యాసం చదివాను. కాని వారితో నేను ఏకీభవించలేకపోయాను. కేవలం పేరుపెట్టి పిలవడముతోనే భర్త ప్రేమ, అనురాగం నిండివుంటుందనడం పొరపాటు. కొంతమంది భర్తలు తమభార్యలను పేరుపెట్టి పిలవడానికి సిగ్గుపడతారు. పైగా మన పెద్దలు భార్యలను పేరుపెట్టి పిలిస్తే వారి (భార్యల) ఆయుర్దాయం తగ్గుతుందంటారు. ఈ నమ్మకంచేత కొంతమంది పేరుపెట్టి పిలవరు. ఈ నవనాగరికతా కాలములో భార్యలను పేరుపెట్టి పిలవడము ఫేషన్ అయినది. అలా పిలవనివారిని పిలిపించుకోలేని వారిని తెలివి తక్కువ వారుక్రింద జమ కడుతున్నారు. అసలంటూ భార్యమీద భర్తకు ప్రేమ ఉంటే ఏవిధంగా పిలిచినా అనురాగం స్ఫురిస్తుంది.

వక్కలంక కనకదుర్గాదేవి (కొత్తపేట)

* * *

నాపేరు స్వరాజ్యలక్ష్మి. మావారు నన్ను 'స్వరాజ్యం', 'రాజ్యం', 'రాజ్యలక్ష్మి', 'లక్ష్మి' అని ముచ్చటగా పిలుస్తూవచ్చి, చివరకు ఎవరికైనా విశదపడేలాగైతే 'రాజీ', అని మాయిద్దరి మధ్యే అయితే 'రాజు' అని అనేచోట ఆగారు.

మూడు భాగాలుగాచేసి ఎలా పిల్చినా, పిలుపించుకొన్నా ముచ్చటగావుండే వ్యాసకర్తగారిపేరులాంటి పేర్లు పిలుపించుకొనే అదృష్టం అందరికీ వుండదంటాను నేను.

పేరుతో పిలవడంలో ముచ్చటేగాదు మమకారం, గౌరవం పెరక్కపోవు.

రాజి (ఖమ్మం)

★



# అద్భుతము !




గృహములకు
- హోటళ్లకు

## బ్రూక్ బాండ్
# స్పెషల్ హోటల్ బ్లెండ్
డస్ట్ టీ

* ఎల్లప్పుడు తోటలోని తాజాతనముతో మీరు పొందగలరు.
* నిపుణులు బ్లెండు చేయుటవలన అహ్లాదకరమగు సువాసనను మీకు చేకూర్చును.
* లక్షలాది ప్రజలు దీనిని కోరుచున్నారు.

**3** సైజులలో లభించును

500 గ్రాములు, 100 గ్రాములు,
50 గ్రాములు

IWT BB 387

# ఈ చలికాలంలో

సి. రాధ

వైపూళ్లమాట విలావున్నా హైదరాబాదులో చలి ఎక్కువగా ఉంటోంది. సాయంత్రం ఆరు దాటితే చాలు చలి. చల్లని నీళ్ళ తగిలితే ఒళ్ళు జిల్లుమంటుంది. పనిచేస్తున్నంతసేపు ఏమీ అనిపించదు గాని తర్వాత కూర్చున్న చోటు నుంచి లేవ బుద్ధిపుట్టదు. వెచ్చగా కప్పుకుని పడుకోవాలనిపిస్తుంది.

ఈ చలికాలంలో మాత్రం దేహ సౌందర్యం పట్ల శ్రద్ధ చాలా అవసరము. ఈ చలికి పళ్ళు పగలడం, చర్మం బిరుసుగా అయి గరగర లాడుతూ ఉండడం, కొందరికి ముఖం, చేతులమీద తెల్ల తెల్లగా పొడలు ఏర్పడతాయి. ఇంకా కొందరికి కాళ్ళు, చేతులు పగుళ్ళువారి దురదలు, మంటలు పెడుతుంటాయి. అశ్రద్ధగా వూరుకుంటే కాళ్ళు, చేతులమీది చర్మం చిట్లి రక్తం చిమ్మటం కద్దు. కాబట్టి ఈ చలికాలంలో చర్మంపెట్లి పొడయిపోకుండా ముందునుంచి జాగ్రత్తగా ఉండటం మంచిది.

దేహసౌందర్యం :—ఈ చలికాలంలో సబ్బు వాడకం పూర్తిగా తగ్గించివేయాలి. అసలే చలికి గరగర లాడుతున్న దేహానికి సబ్బు వాడితే చర్మం పొక్కినట్లు అయి మరీ పొడవుతుంది. సబ్బు బదులు సున్నిపిండి, శీకాయపొడి వాడితే మంచిది. మన చర్మములో రెండు రకాలున్నాయి. కొందరి చర్మం మెత్తగా ఉండి జిడ్డు కారుతూ ఉంటుంది. అటువంటివారికి చలికాలంలో ఏ బాధా ఉండదు. సబ్బు వాడినా ఫర్వాలేదు. కాని కొందరి చర్మం ఎండిపోయినట్లు పొడిపొడిగా ఉంటుంది. అటువంటివారు అసలు సబ్బు వాడకూడదు. ప్రతి రోజూ స్నానం చేయుటకు ముందు వెన్న గాని, కొబ్బరినూనె గాని శరీరానికి పట్టించి ఓ పది నిముషాలు పోయాక సున్నిపిండి రుద్దుకుని గోరువెచ్చని నీటితో స్నానం చేస్తే చర్మం మృధువుగా తయారవుతుంది. ఈ రకం పొడిపొడిగా పల్చటి చర్మం గలవారు ప్రతిరోజూ చమురుతో మర్దన చేస్తేగాని లేకపోతే ఈ చలికాలంలో చర్మం మరీ పగిలినట్లయి మంటలు పుడతాయి. ఇటువంటివారు ఎక్కువ వేడినీటితో గాని చల్లని నీటితో స్నానం చేయకూడదు. గోరువెచ్చని నీటితో చేయాలి.

ముఖం :—ఈ చలికాలంలో ముఖం, చేతుల పట్ల శ్రద్ధ ముఖ్యం. ఎందువల్లనంటే ముఖం, చేతులూ పైకి కనుపిస్తూ, చలిగాలి ఎక్కువగా తగిలే అవకాశం ఉండటంవల్ల పగిలి, పొడలు పొడలుగా తయారవుతాయి. కొందరికి పెదవులు, బుగ్గలు ఎక్కువగా పగిలి బీటలు వారినట్లు తెల్ల తెల్లగా తయారవుతాయి. మరికొందరికి నోటి కిరువైపులా చర్మం పగిలి ముడతలు పడతాయి. అందువల్ల ముందునుంచి జాగ్రత్తగా ఉండటం ఎంతైనా మంచిది. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం ముఖం, చేతులు వెన్న లేక పేరిన వెన్నెయ్యితో గాని నెమ్మదిగా పత్తుతూ మర్దించి పది నిముషాలు పోయాక సున్నిపిండితో ముఖం కడగాలి. రాత్రి పడుకోబోయే ముందు పట్టించి పడుకుంటే ప్రొద్దున్న లేచేసరికి ముఖం మృదువుగా ఉంటుంది—పెదవులకి వెన్న గాని, వాజ్‌లైను గాని రాస్తే మెత్తబడతాయి.

చిన్న చిట్కా :—

ముఖం, చేతులు పొడిపొడిగా ఎండిపోయినట్లు ఉన్నవారికి ఒక చిన్న చిట్కా. ఓపిక ఉంటే ప్రయత్నించండి. 4 టేబిల్ స్పూనులు కాచి చల్లార్చిన నీళ్ళు, 4 టే. స్పూనులు నిమ్మరసం, 4 టీ స్పూనులు గ్లిసరిన్. ఈ మూడు కలిపి ఒక శుభ్రమైన సీసాలో పోసి ఉంచుకుని రాత్రి పడుకోబోయే ముందు ముఖానికి, చేతులకి చల్లని నీళ్లతో కడిగిన తర్వాత రాచుకుని పడుకుంటే గుణం కనుపించవచ్చు.

కొందరికి పాదములు పగిళ్ళువారి దురదలు, మంటలుగా ఉంటాయి. రాత్రి పడుకోబోయే ముందు కాళ్ళుకడిగి, గోరువెచ్చని నీటిలో రెండు డెట్టాల్ చుక్కలు కలిపి అందులో ఓ పది నిముషాలుంచి తర్వాత తుడిచి, వాజ్‌లైను రాచుకుని పడుకుంటే తగ్గిపోతాయి. ఏదైనా ప్రారంభంలోనే చేస్తే మంచిది.



ఎప్పుడూ ఇంతే—114 శంకర్



విశాఖ

# ఆడపిల్లలూ - వరకట్నాలూ

ఆమధ్య పేపరు తిరగవేస్తుంటే రాష్ట్రపతి వరకట్న నిషేధం బిల్లు లోక్‌సభ, రాజ్యసభలనమా వేశపరచి, అమలులోకి తెచ్చినట్లు కంటబడింది. అది చూడగానే మా నిర్మల పెళ్ళి ఆగిపోయిన విషయం జ్ఞాపకం వచ్చింది. ఉగాదినాడు పద్మవచ్చి "మన నిర్మలకి వైశాఖంలో పెళ్ళిట. అతను కలకత్తాలో ఏదో ఉద్యోగం చేస్తున్నాడుట" అంది. అలాంటిది చైత్ర, వైశాఖలు వెళ్ళిపోయినా, శుభలేఖలు రాకపోతే ఆశ్చర్యపోయి నిర్మలకి టెలిఫోన్ చేశాను. నిర్మల ఇంటికివెళ్ళి అడిగితే అది చెప్పిన విషయం ఇది. వాళ్లేమో వరుడికి నాలుగువేల రూపాయలు కట్నం ఇస్తామన్నారుట. కాని పిల్లవాని తండ్రి ఆరువేల రూపాయలు కావాలన్నారుట. కానీ, అప్పట్లో అంత ఇచ్చేవాళ్ళు అతనికి కనపడనందున నిర్మలనే కోడలుగా చేసుకుంటామని నిశ్చయాన్ని తెలిపారుట. వాళ్ళు కలకత్తా వెళ్ళాక, శాఖభేదం అయినా ఆరువేల రూపాయిలూ ఇస్తామని వచ్చిన వాళ్ళ పిల్లనిచ్చి కొడుక్కి పెళ్ళిచేసేసాడుట ఆ మహానుభావుడు. ఇవతల వీళ్ళకి ఆ సంగతి తెలియక ముహూర్తం పెట్టించమంటారా అంటూ వంపినదానికి, జవాబుగా ఆ అబ్బాయి పెళ్ళికి శుభలేఖ వచ్చింది. దాంతో నిర్మల పెళ్ళి ఆగిపోయింది.

ఇలాంటివి ఎన్నో వున్నాయి. వాటి నన్నిటినీ గూర్చి ఆడ పిల్లలకీ, వనితలకీ, ఆడపిల్లల్నికన్న తల్లి తండ్రులకు తెలియనిదేమీ లేదు. పీటలమీద పెళ్ళిళ్ళు కూడా ఆగిపోయినాయి. హిరణ్యాక్షవరాలని తీర్చ నేరక ఆడపిల్లని కన్నతల్లితండ్రులు పడే అవస్థ వర్ణనాతీతము. అసలు ఒక సామెత కూడా వుంది. అయిదుగురు ఆడపిల్లల్ని కన్న లక్షాధికారి కూడా వాళ్ళకి పెళ్ళిళ్ళు చేసాక భిక్షాధికారి అవుతాడని. అలాంటిది సామాన్య సంసారుల విషయం వేరే చెప్పాలా.

అసలు మొదట కన్యాశుల్కం అమలులో వుండేది. కన్యాశుల్కం అంటే వరుడు ఏదైనా డబ్బు కన్యాదాతకిచ్చి కన్యని, తను పెళ్ళాడుతాడు. అప్పుడు కూడా అన్యాయాలు జరుగుతూ వుండేవి. డబ్బు కొంచెం ఎక్కువ ఇస్తారుకదా అని వయస్సులో పెద్దవానికో, దుర్వ్యసనాలుగలవానికో పిల్ల ఇష్టానికి వ్యతిరేకంగా పెళ్ళిళ్ళు చేసేవారు.

ఈ పద్ధతి మారి, వరునికి లాంఛనాలతోబాటు కట్నం ముట్టచెప్పి పిల్లనిఇచ్చి పెండ్లి చేయడం జరిగింది. ఇప్పుడు ఆ వరకట్నాలవల్ల కలిగే నష్టాలు చెప్పనేరము. దానివల్ల ఎన్నో కుటుంబాలు విచ్ఛిన్నమయిపోయాయి. పెళ్ళి సమయంలో కట్నం సరిగ్గా ఇవ్వలేదనో, లాంఛనాలు, మర్యాదలూ సరిగ్గా జరుగలేదనో కారణాలవల్ల కోడలుని సరిగా చూడక, బాధలు పెట్టిన పెద్దవారూ వున్నారు.

ప్రభుత్వం దీన్ని అరికట్టాలని వరకట్న నిషేధ చట్టం అమలులోకి తెచ్చింది. కానీ ఇది ఎంత వరకూ ఆడపిల్లల్ని కన్నవారికి సహాయపడుతుందో ఆలోచించవలసిన విషయం.

కట్నం అనేది నిషేధించారు. చట్ట ప్రకారంగా కట్నం పుచ్చుకున్నవారిని ప్రభుత్వం శిక్షిస్తుంది. పెళ్ళి అనేది మానవుని జీవితంలో శుభప్రదమైనది కనుక వరునికి వధువువైపువారు ఏదైనా సంతోషంతో ఇస్తే బాధేలేదు. ఇవ్వగలిగిన తాహతున్నవారు వారి కిష్టమైనంత వరునికి లాంఛనంగా ఇవ్వవచ్చు. కానీ ప్రస్తుత సాంఘిక వ్యవస్థ ఎలా వున్నదంటే, వరునికోసం వేలం పాటలాగా కట్నాలు పాడి ఎవరు ఎక్కువ ఇవ్వగలరో వారి కుమార్తెనే కట్టబెట్టుతున్నారు.

కానీ, దీన్ని నిషేధిస్తూ, ప్రభుత్వం చట్టం అమలులోకి తెచ్చింది. మనం చూడాల్సింది ఈ చట్టం ఎంతవరకూ వినియోగపడుతుంది. వరకట్నాలని ఎంతవరకూ అమలులోనుంచి అరికట్టుతుంది అనేది. వరకట్నాలవల్ల కలిగే నష్టాల గురించి నేను చెప్పాల్సిందేమీలేదు. వనితాలోకం వనితలకి వరకట్నాలగూర్చి తెలియందేమీలేదు. కానీ, ప్రస్తుతం అమలులోకి వచ్చిన చట్టం ఎంతవరకూ సామాన్య సంసారులకి ఉపయోగపడుతుందనే విషయం చర్చనీయాంశం.

అసలు ఆడ పిల్లల్ని కన్నవారు కొంతమంది వరుని కోసం గాలంవేసి వుంచుతారు. నీరు నిశ్చలంగా వున్నప్పుడు కూడా చేపలవేట కష్టతరమైందే. అలాగే ఒడుదుడుకులు లేకపోయినా కట్నం లేనిదే వరుడు దొరకటం కష్టంగా వుందినాడు. అసలీ కట్నమనేది ఎందుకు ఇస్తున్నారు. తమ కూర్తెకు తగిన వరుడు, ఏదో మంచి ఉద్యోగంలో వున్నవానినిచూసి ఇద్దామని వుంటుంది ప్రతీ తండ్రికి. ఇదే కాకుండా మన దేశంలో అనేక జాతులు, వర్గాలు, శాఖలు వున్నాయి. శాఖాంతర వివాహానికి కూడా ఇష్టపడరు మనవారు. అదే శాఖలో సగోత్రం కాకుండా, ఆస్థి అదీ వుండి ఏదో మంచి ఉద్యోగం చేస్తూ, ఇంకా పైకిపోయే అవకాశంవుండేవారిని తమ కుమార్తెకిచ్చి చేద్దామని పెద్దలిచ్చపడతారు. ఇప్పుడు చూడండి. వరుడు దొరకటం ఎంత కష్టమో. ఆ లక్షణాలన్నీ వున్న వానికోసం ప్రతీ ఆడపిల్ల తండ్రి ఆశించి, తమ అల్లునిగా చేసుకోడం కోసరం అనేక విధములుగా పాటుబడి, కారు యిస్తామని ఎక్కువ కట్నం పోస్తామని, తాహతుకి మించినవిచేసి అధోగతిపాలవుతున్నారు. ఆఖరికి ఒకే శాఖలోవుండి అన్నీ వున్న వానికోసం వెదికేసరికి అదో గళ్ళనుడికట్టుగా తయారవుతుంది. దాంతో ఆ పిల్లవానికి వేలంపాట మొదలవుతుంది. దాంతో పిల్లవానికి కన్న తల్లి తండ్రులకి ఎవరు ఎక్కువ కట్నం ఎరగా చూపిస్తే వారి పిల్లనే చేసుకుందామని అనిపిస్తుంది. అలాంటప్పుడు వరకట్నం ఎక్కువైతే ఆశ్చర్యపడవలసినదేమీలేదు.

ఈ నష్టాలని, కష్టాలనీ చూడనేరక మన రాష్ట్రపతి ఇరు సభల సహకారంతో ఈ వరకట్న నిషేధ చట్టం అమలులోకి తీసుకువచ్చారు. వరకట్నాన్ని వేరుగాగాని వస్తురూపంలోగాని తీసుకోకూడదన్ని ప్రభుత్వం ప్రస్తుతం నిషేధించింది. బాహాటంగా వరకట్నం తీసుకోకూడదుగదా అని పిల్లవానిని కన్న తల్లి తండ్రులు నల్లబజారులో తీసుకోరని నమ్మకమేముంది. చేపని పట్టడానికి ఎర చూపించినా ఆ విలువైన ఎర—మన దేశపు వరుడు దొరకడం కష్టం. అలాంటిది పల్లికుక్కగా కట్నం ఎర చూపలేనివారు వెనుకచాటుగా ఇవ్వరని నమ్మకమేముంది? జైలు శిక్ష విధిస్తారని తెలిసి కూడా కట్నం తీసుకోడానికి వెనుదియ్యరని నమ్మకమేముంది? ఈ చట్టంలో అన్ని చట్టాల్లోలాగానే, అక్కడక్కడ ఖాళీలున్నాయి. దాంటోంచి ప్రతివారూ చేతులు కాలకుండా జారి పోగలరు.

కట్నాన్ని తీసుకున్నారని తెలిసి ఎవరైనా కోర్టులో వ్యాజ్యం వేసినా దానికి సాక్ష్యమివ్వడానికి ఎవరు ముందరికి వస్తారు? పిల్లని త్వరగా వదుల్చుకుందామని కట్నమిచ్చిన తల్లి దండ్రులా? కట్నం పుచ్చుకున్న పిల్లవాడా? లేక అప్పుడే కొత్త ప్రపంచంలో అడుగుపెట్టుతూ, తన భవిష్యత్తు జీవనమంతా ఆనందదాయకంగా వుండాలంటే ఈ విషయం రహస్యంగా వుంచుకోవాలని ఎరిగిన ఆ పెళ్ళికూతురా? తనవల్లే తన తండ్రి ఇంతలేసి కట్నాలుపోసి అప్పులపాలవుతాడని తెలిసినా కూడా ఏ ముగ్ధ తన జీవితాన్ని కాళ్ళకి రాసిన పారాయణ అయినా ఆరకుండా చేజేతులా నాశనం చేసుకోవాలని కోర్టులో తన భర్త కెదురు సాక్ష్యమిస్తుంది?

ఉదాహరణగా ఒక కుబేరుడైన కుచేలుని తీసుకోండి. డబ్బు పుష్కలంగా వుంటుంది. దానికి తగ్గట్టు ఆడపిల్లలూ వున్నారనుకోండి. అందరూ అందంగా వుండరుకదా. ఇదే పూర్వం అయితే బాహాటంగా ఫలానా అంత కట్నం ఇస్తామనీ, ముద్దూ ముచ్చట జరుపుతామని చెప్పి ఆశ పెట్టొచ్చు. ఇప్పుడు ఈ కట్న నిషేధంవల్ల అలా చెప్పడానికిలేదు. డబ్బులు గలిగల్లాడినంతవరకూ అందం లేకపోయినా పర్వా లేదనుకునేవారే. కట్నం సంగతి ఎత్తకపోయేసరికి ఆ పిల్ల చదువు, సంస్కారం వుండీ, ఇంటి పనులన్నీ చేసుకున్ననూ అక్కరలేనిదై పోతుంది. ఎప్పటికీ కన్నె పిల్లగానే వుంటుందేమోనన్న భయంకొద్దీ ఆ తండ్రి నల్లబజారు కుపక్రమిస్తాడు. పైకి ఏమీ పటాటోపంలేనిపెళ్ళి. కానీ లోపయకారిగా ఎన్ని వేలు ముట్టాయో ఆ ఇచ్చినవారికి ఆ పుచ్చుకున్నవారికి, వారిని పుట్టించిన బ్రహ్మకే ఎరుక. కనుక ఈ నిషేధ చట్టంవలన ఇలాంటివి జరగకుండా చూసుకోడం ఒక పెద్ద బాధ్యత.

ఇదే కుచేలుని అన్ని విధాలా పోలిన వారిని తీసుకుందాం. సంతానమూ గంపెడు. డబ్బా లేదు. అప్పుడు చేసేదేమిటి. పిల్లలకి పెళ్ళి కాలేదని ఆ కుటుంబాన్ని సంఘంలో తలయెత్తకుండా చేస్తారు, ఆ సంఘంలోనివారు. దాంతో ఆ తండ్రో, లేక తండ్రి బాధ నెరిగిన ఆ పెళ్ళి కెదిగిన పిల్లో ఆత్మహత్య చేసుకుంటారు లేదా, ఆ కుటుంబం అంతా క్షోభకి గురి అవుతారు. ఇలాంటివి వింటూనూ వున్నాము, చూస్తూ వున్నాము కూడా.

వీటన్నిటికీ కారణం కట్నం. కట్నం తీసుకోడము అనేది వేళ్ళు బాగా పారిన మహా వృక్షంగా తయారయింది. దీన్ని నిర్మూలించాలంటే ఒట్టినే కొమ్మల్ని

45-వ పేజీ చూడండి



శ్రీనాథుడు ముందే చెప్పినట్లు, తదియనాటి మధ్యాహ్నమునకు గండమల్లునకు కొండలపెట్టున జ్వరము వచ్చినది. విపరీతముగా ఆవులింతలు, కళ్ళుమంటలు, తలనొప్పి వచ్చినవి. వెంటనే పర్వత మల్లు మధ్యవర్తులకు వార్త పంపెను. వారు చూడగా గండమల్లునొడలు జ్వరముతో వేగిపడుచుండెను. వారు విద్యామల్లునకు కబురంపగా ఆతనిపక్షము వారును వచ్చి చూచి తృప్తిపడి, వీరోచితముగా మల్లయుద్ధమునకు గడువొసంగిరి. అదే పర్వత మల్లునకు తలవంపులుగా నుండెను.

ఆవల మల్లుర పరీక్షాదుల గొడవ శాంతింపగనే, శ్రీనాథుడు గోష్ఠీమందిరమున తోడి విద్వాంసులను చేర్చెను. ముందాతడు శ్రీదేవి స్వహస్తముతో అందముగా వ్రాసి, చిత్రములుకూడ చిత్రించిన మానసోల్లాసకావ్యప్రతిని శ్రద్ధతో వ్యాసపీఠముపైనుంచి లఘువుగా గంధాక్షతలతో పర్చించెను. నృసింహాభట్టుచే నిర్దుష్టముగా వ్రాయించిన ఇంకొక ప్రతిని వేరొక వ్యాసపీఠము నుంచి యట్లే పూజించెను. ఆపిమ్మట నృసింహలిఖిత ప్రతిని అరుణగిరినాథులకు అభిప్రాయార్థము పంపుచు, వినయగౌరవములతో వ్రాసిన పత్రికను చదివి వినిపించెను. వారందరు బాగున్న దనిరి.

"ఈ ప్రతిని లేఖను అరుణగిరినాథులకు అందించుటకు ఎవరు వెళ్ళిన బాగుండును?" అని శ్రీనాథుడడిగెను. ఒకరి ముఖము లొకరు చూచుకొనిరి. తుదకు మహావైయాకరణుడును, కవీశ్వరుడును అగు నృసింహాభట్టు తీసికొనిపోవుట యుక్తముగా నుండునని అందరు సూచించిరి. నృసింహాభట్టు వళ్ళెయని దుగ్గనను తోడుగా తీసికొనిపోవుదు ననెను.

కొద్ది సేపటికే వా రిద్దరు కూర్పాసములు కుల్లాయిలు కోకలు ధరించి అశ్వములెక్కి డిండిముని యింటికి బయలు దేరిరి. అది ఎంతో దూరమ్ము లేదు. గౌడబ్రాహ్మణవీధి మధ్యలో ప్రముఖముగా కనిపించు పెద్ద భవంతి. సంపన్న నాగరకవేషములతో వచ్చిన వారి ద్దరిని వెంటనే డిండిముని

40-వ పేజీ చూడండి

## జరిగిన కథ

సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితుడగు కొండవీటి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథభట్టును కవిసార్వభౌమ బిరుదు పట్టముతో అలంకరించి, సర్వవిద్యానిలయమైన శ్రీ విద్యానగరమునకు విద్యావిజయ ప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. కార్యసిద్ధికై ద్విజులుసూచించిన పౌష్టిక క్రియలు ఆచరించి శ్రీనాథుడు యాత్రకు సంసిద్ధుడవుతాడు. సింగన ప్రధానితోను, కామవభట్ట బాణునితోను ముచ్చటించి, డిండిముని శాస్త్ర పాటవము, లోపాలు తెలుసుకుంటాడు. వేమభూపాలుడు ఆయనకు ఉచితమైన వీడ్కోలు ఇచ్చి పంపుతాడు. విద్యానగరం చేరినతరువాత శ్రీనాథుడు ముమ్మకవి ఆతిథ్యం స్వీకరిస్తాడు. డిండిమభట్టును జయించేందుకే శ్రీనాథుడు వచ్చాడన్నవార్త వ్యాపిస్తుంది. డిండిమునకు ఆవిషయం శిష్యుల ద్వారా తెలిసి, శ్రీనాథుని బెదరగొట్టడానికి, లింగనసోమయాజి క్రతువు చూచేమిషతో యజ్ఞశాలకు వెడతాడు. శ్రీనాథుని వెంట వచ్చిన మల్లవీరుడు పర్వతిమల్లుని శిష్యుడు విద్యానగర మల్లవీరుడు విద్యామల్లు చేతిలో ఓడిపోతాడు. శ్రీనాథుని కవిత్వం దోషభూయిష్ఠమైందని విద్యానగరంలో ప్రవాదు బయల్దేరుతుంది.



ఎన్. ఏ. టి. వారి "గులేబకావళి కథ"లో జమున.




## జరిగిన కథ

హాంబర్గ్ నగర నివాసి ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో దొరికిన ఒకత్వక్పత్రంలో రహస్య సందేశం ఏదో ఉంటుంది. కాని అది ఆయన తమ్ముడు కొడుకైన ఆక్సెల్ మాత్రం తెలుసుకుని భయవిహ్వలుడవుతాడు.

అయినా తన పెదనాన్న దాని విషయమై పడుతున్న బాధ చూడలేక, రహస్యం చెప్పేస్తాడు. 'ఆర్నె సాక్నుస్సెమ్' అనే ప్రాచీన ఐస్‌లాండిక్ శాస్త్రజ్ఞుడు, యాత్రికుడు భూగర్భంలోనికి వెళ్లినట్లు వ్రాసి ఉంటుంది. ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్నిపర్వతం ముఖద్వారంలో నుంచి వెళ్లినట్లు ఉంటుంది. ఆక్సెల్ ఇది నిజం కాదని వాదించినా వినిపించుకోకుండా ప్రొ॥ లిడెన్‌బ్రోక్ డెన్మార్కు మీదుగా ఐస్‌లాండ్ ప్రయాణం కడతాడు. డెన్మార్కులో హెర్ థామ్సన్ సహాయంతో ఐస్‌లాండుకు ఒకపడవ కుదుర్చుకుంటారు. అక్కడ ప్రొఫెసర్ ఫ్రిడరిక్సన్ ఇంట్లో దిగుతారు. స్నాఫెల్స్ పర్వతం వద్దకు దారి చూపేందుకు ఫ్రిడరిక్సన్ వారికొక గైడ్‌ను కుదురుస్తాడు. అతని పేరు హాన్స్.

# 12

బయలుదేరేవేళ కొంచెం మబ్బుపట్టి ఉన్నది. ప్రవమైన ఎండగాని, వానగాని మా ప్రయాణం అడ్డపెట్టలేదు. యాత్రికులకు చాల బాగుంది.

కొత్త ప్రదేశంలో గుర్రపు స్వారీ చేస్తూ వెళ్లడం నాకు బాగా నచ్చింది. నా చికాకు తగ్గిపోయి సంతోషంగా బయలుదేరాను. ఇష్టం వచ్చినచోటుకిపోయి ఇష్టం వచ్చినట్లు చేసే అవకాశం దొరికిన 'టూరిస్టు' వలె సంబరపడిపోయాను. మా ప్రయాణ కారణం తలుచుకుంటే అంత కష్టంగా లేదు.

"నిజానికి నేను గురిఅయ్యే ప్రమాదం ఏమిటి? వింత దేశంతో ప్రయాణమేగా? చిత్రమైన కొండనొక దానిని ఎక్కడమేకదా? అంతగా అయితే ఆరిపోయిన అగ్ని పర్వత ముఖద్వారంలోనికి దిగటమేగా? సాక్నుస్సెమ్ చేసిన పని కూడా ఇంతేననిపిస్తుంది. భూగోళ కేంద్రానికి దారితీసే సొరంగమా—అంతా మిథ్య! వీల్లేదు! సణుగుడు ఆపి సరదాగా కాలం గడుపు!" అనుకున్నాను నాలో నేనే.

రైక్ యావిక్ పరిసరాలు దాటక మునుపే ఈ తీర్మానానికి వచ్చేశాను.

హాన్స్ నడక అటు మరీ తొందరగానూలేదు, ఇటు మరీ నెమ్మదిగానూలేదు. సమానంగా అడుగులు వేసుకుంటూపోయాడు. మా సామాను మోస్తున్న గుర్రాలు అతని వెంబడి వాటంతట వెళ్లాయి. వెనుక మా వాహనాలమీద నేనూ, మా పెదనాన్నా వచ్చాము. ఇవి చిన్నవిగాఉన్నా మా దర్జాకి ఏమాత్రం లోటు రాలేదనుకుంటాను.

ఐస్‌లాండ్ యూరోప్‌లో పెద్ద ద్వీపాలలో ఒకటి. నలభై వేల చదరపుమైళ్ల వైశాల్యం ఉంటుంది. కాని జనసంఖ్య అరవై వేలు మాత్రమే. భూగోళ

45-వ పేజీ చూడండి




"ఓరేఁ, నీకాఁదూ, చెప్పేదీ, యిలా రా, మా బాబువిగా, మాంఛి కథ చెప్తా-అమ్మ నలా ఏడుపించ కూడదు." అంది అవ్వ మనవణ్ణి కేక వేస్తూ.

"మాంఛికథచెప్తినే వస్తా-రోజూ ఏమిటో చెప్తావ్" అన్నాడు ఆరేళ్ళ నటరాజు అమ్మమ్మ మంచంవైపు వెళుతూ.

"నా బాబే, అలా రావాలి. ఇవాళ నీకు ఓ అవ్వ కథ చెప్పుతా" అంటూ ఆవిడ మనవణ్ణి మంచం మీద కూర్చోపెట్టింది. ఇంతలో పెద్దమనవడు రాము వచ్చి "ఇంకోమ్మా నాకేం రాజుకథ చెప్పవూ" అంటూ మంచం ఎక్కాఁడు.

"అవునవును. అవ్వ కథవద్దు. రాజుకథ బావుంటుంది." అన్నాడు నటరాజు ఆనందంతో. ఆ-అయితే బుద్ధిగా కూర్చుని వినండి. అనగా అనగా ఒకవూరు......

"ఊరి పేరివిటింకోమ్మా" అంటూ మనవడు అడ్డుతగిలాడు. అవ్వకి కోపం వచ్చింది.

"అది వద్దన్నాను. కథ మధ్యలో మాట్లాడకూడదు" అంటూ అవ్వ ప్రారంభించింది.

...ఆ...ఆ వూరు పేరు సువర్ణపురం. ఏం ... ఆ సువర్ణపురానికి సుదర్శనుడనేరాజు. ఏం—ఆయనకింద ఇంకా బోల్డు ఊళ్ళుండేవి. ఆ రాజుగారికి వేట, అంటే-పులుల్ని, ఏనుగుల్ని చంపడం అంటె చాలాయిష్ట వన్నమాట...రోజూ వేటకు వెళ్ళేవాడు. అలాగ కొన్నాళ్ళు జరిగింది. ఓనాడు మళ్ళి వేటకి బయల్దేరాడు రాజుగారు. రాజుగదా మరి-అందుకు బోలెడు సిపాయిలూ, ఏనుగులూ, గుర్రాలుతో అడివికి బయల్దేరి— ఓచోట గుడారాలు వేసుకుని...

"గుడారాలంటే ఏవిటి..."

"అదే—అది వద్దన్నా—కథలో ప్రశ్నలు వెయ్యక. చిన్నవాడైనా వాడే నయం నీకన్నా. ఆ గుడారాలంటే...గమ్మున ఇళ్ళల్లా ఎక్కడైనానరే, కట్టెయ్యొచ్చనమాట... ఆ...యిళ్ళన్నమాట" అంటూ అవ్వ మళ్లీ కథలోకి వచ్చింది. "మరి-గూడారాలు వేశారు. ఆ రాత్రికి అక్కడ వంటలు వండారు. అందరూ తిన్నారు. నిద్రపోయారు. తెల్లవారుతూనే లేచి, రాజుగారు, ఎవరెవరు ఏయే పక్కలకు వెళ్ళాలో చెప్పి తను గుర్రం ఎక్కి మరో వైపుకి వెళ్లాడు. అలా ఆయన కొంతదూరం వెళ్లాక ఆయనకి ఒక మంచిలేడి కనపడింది. వెంటనే దాని మీద ఒక బాణం వేశాడు.

"హామ్మో బాణవేఁ! ఆ లేడి చచ్చిపోదూ!" అన్నాడు నటరాజు కళ్లు పెద్దవిచేసుకుని గుండెలు మీద చేతులు వేసుకుంటూ. అవ్వ ముచ్చటగా నవ్వింది.

"హారి వెర్రి నాగన్నా-చావడానికే గదరా బాణం వేసింది. కాని; ఆ లేడికి ఆ బాణం తగల్లేదు. అది రాజుగారికేసిచూసి, భంగున పరుగెత్తింది. రాజుగారికి కోపం వచ్చింది. రాజుగారుకదా మరి, అందుకు, ఆయన దాన్ని వెంబడించి మరో బాణంవేశాడు. ప్చ్—అదీ తగల్లేదు. మరోటి కూడా వేశాడు. ప్చ్చ్-అదికూడా తగల్లేదు. రాజుగారికి ఈసారి భలేకోపంవచ్చి, గుర్రాన్ని ఆ లేడివెంట పరిగెత్తించాడు. ఇలా లేడి ముందూ, రాజుగారు వెనకా అడివంతా పరిగెత్తారు. మధ్యాహ్నం అయిపోయింది. రాజుగారికి విసుగు పుట్టింది. ఆ లేడి చివరికి దొరక్కుండా, కంటికి కనుపించకుండా పోయింది.

"మాయమైపోయిందన్నమాట" అన్నాడు రాము.

"ఆ...అవును"—అన్నాడు నటరాజు.

"హా—మాయవఁవ్వలేదు. పొదల్లోకి పోయింది. ఏం-రాజుగారికి అప్పటికి ఆకలివేసింది. దాహం కూడా వేసింది. చూట్టూ చూశారు. ఎవరూ లేరు సరికదా, ఏయిల్లూ లేదుకూడా. అంతా అడవి. మంచినీళ్ళకోసం అన్నివైపులా చూశారు. ఎక్కడా కనిపించలేదు. అలా కొంతధూరం

వెళ్ళేక ఓ చిన్న పాక కనపడింది. హమ్మయ్య...అనుకుని ఆయన— "ఎవర్లోపల" అన్నారు. లోపలి నుంచి, ఓ అవ్వ వచ్చింది. వస్తూనే రాజుగార్ని చూసి గడగడలాడి పోతూ, "ప్రభూ! మన్నించండి" అంది.....

"ఏం యింకోమ్మా—మన్నించడానికి అవ్వేం చేసిందీ" అన్నాడు రాము. ముసలవ్వ బుర్ర గోక్కుంది.

"హలా అడక్కూడదు—రాజులు కనబడినప్పుడు అలా అనాలి. వాళ్ళు రాజులుకదా మరి? ఏం-అవ్వ అలా అనగానే రాజుగారు గుర్రందిగారు. దిగి, "అవ్వా నాకు దాహం వేస్తోంది—కొంచెం మంచినీళ్ళివ్వగలవా" అన్నారు. "లోపలకు రండి ప్రభూ! బయట ఎండ ఎక్కువగా వుంది" అని అవ్వ రాజుగార్ని లోపలకు పిలిచింది. కానీ, కూర్చోపెట్టడానికి కుర్చీలూ అవీ లేవు. ఎలా వుంటాయి మరి? బీదవాళ్ళుగా... ఏం-అందుకు ఓ గడ్డిమేటు విప్పి, దాని మీద బొంతపరిచి ఆయన్ని కూర్చోపెమంది. రాజుగారు కూర్చున్నారు. అవ్వవెళ్ళి మంచినీళ్ళు-ఓ కుండతో తెచ్చియిచ్చింది. రాజుగారు ఆ కుండ కేసి చూసి నవ్వేరు. రాజులు బంగారం గ్లాసుల్లోతప్ప తాగరు కదామరి,అందుకు-ఏం-కానీ-దాహం వేయడంవల్ల తాగేశారు. మరి కొంచెం కావాలని అడిగి తాగారు. తర్వాత "అవ్వా! వేటకని వచ్చి, ఓ లేడిని తరుముకుని, యిలా వచ్చేశాను. భోజనం వేళ అయ్యింది, ఆకలి వేస్తోంది." అన్నారు. అవ్వ గుండెల్లో రాయిపడింది. మహారాజు ఆకలంటే, బీదవాళ్లు ఏం పెట్తారు. గంజి, వాళ్లుతాగే గంజి యిస్తే, ఆయన తాగరుకదా, మరి, ఏవీ యివ్వకపోతే—కోపం వచ్చి చంపేస్తారు. అవ్వకి ఏం చెయ్యాలో తోచక, వంటింట్లోకి వెళ్లింది. తన కోసం వండుకున్న అన్నం, గంజి వున్నాయి. కాని ఎలా? కూర, పచ్చడి, ఏవీలేవాయె! అని లోపల కూర్చుని అవ్వ ఏడుపు ప్రారంభించింది-రాజుగారు "ఏం అవ్వా" అని కేకేశారు. అవ్వకి ఏం చెయ్యాలో తోచలేదు. భయంతో అటూయిటూ దిక్కులు చూసింది. అవ్వకంటికి పెరట్లో పచ్చగడ్డి కనపడింది. పరుగున పెరట్లోకి వెళ్లి లేతగరిక చిగుళ్లుతుంపి, పచ్చడి చేసి, భయపడుతూ, ఆపచ్చడి వేసి, రాజుగారికి ఆ కాస్త అన్నం పెట్టింది. అసలే ఆకలిమీద వున్నారేమో రాజుగారు వంచిన తల ఎత్తకుండా ఆ పచ్చడితో తిని, "అవ్వా, పచ్చడి చాలా బావుంది. ఇంకా కొంచెంతే" అన్నారు. అవ్వ మళ్లీ వేసింది. రాజుగారు

48-వ పేజీ చూడండి






దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

5-1-1962 శుక్రవారము మొదలు
11-1-1962 గురువారము వరకు

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రస్తుతం బాహ్యవిషయాలలోకన్నా మీ కుటుంబంలో జరుగవలసిన పనులను గురించిన ఆలోచనలు అధికం అవుతవి. వృత్తివ్యాపారాలలో స్నేహితుల సలహాలు ముందు మీరు అనుకున్నంతగా లాభించవు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం ఎప్పటికప్పుడు వచ్చేటట్లు కనిపిస్తుందే కాని, ఆలస్యం తప్పదు. మీ బుద్ధిబలంతో సాహసించి ఆరంభించిన వ్యవహారాలలో జయం లభిస్తుంది.

బంధువులవల్ల ఆదరాభిమానాలు లభిస్తవి. వెనుక ముందులు ఆలోచించకుండా క్రొత్తవారిని చేర్చుకొనటంవల్ల కలహాలు, అపవాదులు రాగల అవకాశా లున్నవి. ధనాదాయం మామూలుగా ఉంటుంది. విలువగల వస్తువులు కొంటారు. ప్రయాణాలు చేస్తారు. కాని, ఉత్సాహకరంగా ఉండదు. మీ గొప్పదనాన్ని తెలుసుకొని గౌరవించే వారు ఉంటారు. 9, 10 తేదులలో శుభ కార్యాలు, లాభవార్తలు.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి,
మృగశిర 1, 2 పా.)

మొదట మీ శక్తిని మీరు తెలుసుకొనక పోవటంవల్ల మిత్రులమీద ఆధారపడతారు. ఒకానొక సందర్భంలో ధైర్యంవహించి చేతిలోని ధనం వినియోగించవలసిన అవసరం ఏర్పడుతుంది.

**గ్రహస్థితి**

కర్కాటకంలో రాహువు, ధనుస్సులో సూర్య అంగారక శుక్రులు, మకరంలో బుధ, గురు శని కేతులు, ధను ర్మకర కుంభ మీనాలలో చంద్రుడు.

సాహిత్యరంగంలో మీ శ్రమ ఫలిస్తుంది. గౌరవ పదవులతోబాటు శ్రమ, వ్యయాలను భరించవలసి వస్తుంది. స్నేహితులవద్ద నుంచి లాభవార్తలు తెలుస్తవి. వృత్తిఉద్యోగాలలో క్రమక్రమంగా ఒక అడుగు ముందుకు పోగలుగుతారు. ఆదాయం పెద్దగా పెరుగుతుందని ఆశ పెట్టుకొనతగిన సమయం కాదు. ఉన్నత స్థితియందున్నవారిని కలుసుకొన గలుగుతారు. తలవని తలంపుగా దైవకార్యాలలో ప్రవేశించవలసి వస్తుంది. కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండదు. విలువగల వస్తువులు కొనే సందర్భాలలో మోసం జరిగే అవకాశా లున్నవి. వారంతంలో చికాకు, కోపము అధికం అవుతవి. 7, 8 తేదులలో భయంకర వార్తలు, వృత్తిలో శ్రమ.

**మిథునం :**

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు
1, 2, 3 పా.)

ముందు ఒకటి రెండు సందర్భాలలో మీ ప్రయత్నాలు అనుకూలించకపోవటంవల్ల ప్రతి సమయంలోనూ సందేహాలు వస్తూవుంటవి. మీ ఆరోగ్యం గురించి అశ్రద్ధగా ఉండవద్దు. బంధుమిత్రుల బలవంతంవల్ల వ్యాపారకార్యాలలో శక్తికి మించిన భారం పైన పెట్టుకొంటారు. నౌకరులతో కలహాలు వస్తవి. విద్యా వినోద రంగాలలో శ్రమ, అసంతృప్తి కనుపిస్తవి. అయితే మొత్తంమీద గౌరవం నిలుపుకొంటారు. ఎంత శ్రమపడి పనిచేసినా అధికారులవల్ల మాట పడవలసి వస్తుంది. ముందు ముందు లాభించగల పనులలో ధనం ధారాళంగా వినియోగించవలసి వస్తుంది. భూ, గృహసంబంధమైన వ్యాపార వ్యవహారాలు చక్కగా ఫలితాన్ని ఇస్తవి. ఇతరులు కలహించుకొంటూ మిమ్ములను రంగానికి లాగటానికి చూస్తారు. 5, 6 తేదులలో ధన నష్టము, తెలియని పనులలో ప్రవేశించటం.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

నలుగురి మాటా ఒక్కటే, మీ ఒక్కరి మాటా ఒక్కటే. సాధక బాధకాలు విచారించకుండా ఏ కార్యంలోనూ ప్రవేశించలేకపోతారు. ఆదాయాన్ని మించి ఖర్చులు పైన వేసుకుంటారు. ముందు శ్రమ, చిక్కులు ఎదురువస్తవి. కాని చివరకు మీ ఆలోచనలు ఫలిస్తవి. యంత్రాలు నడపటం వంటి పనులలో జాగ్రత్త అవసరం. బంధువుల వద్దనుంచి బాధాకరమైన వార్తలు తెలుస్తవి. కాంట్రాక్టువంటి పనులలో దేహశ్రమకన్నా మానసిక ఆందోళన అధిక మవుతుంది. ఏ సందర్భములోనూ మాటలలో తొందరపడవద్దు. సంగీత, సాహిత్య రంగాలలో శ్రమకు తగిన ప్రోత్సాహము లభించదు. వృత్తికి సంబంధించిన కార్య కలాపాలలో ముందు పరిశ్రమ చేసి, ఫలితాన్ని ఎదురు చూడవలసిన అవసరం కలుగుతుంది. 7,8 తేదులలో సాహసకార్యాలు, అధికారులతో సమావేశము.

* * *

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ
1, 2, 3 పాదాలు)

ఎవరి మాటను ఆమోదించటం, ఎవరి మాటను త్రోసివేయటం అనే సమస్య మిమ్ములను బాధిస్తుంది. ఆదాయం మామూలుగా ఉన్నా అప్పులు

చేయవలసిన అవసరం కలుగవచ్చు. తీరుబాటులేని పనులు, కాని తగినంత ఫలితం మాత్రం ఉండదు. అనవసరంగా మాటలతో మీ మనస్సును బాధించి సంతోషపడేవా రుంటారు. సాధ్యమైనంతవరకు నిరాడంబరంగానూ, తటస్థభావంతోను ఉండటం వల్ల ఆర్థికంగా ఫలితంమాట ఎలా ఉన్నా సుఖము, శాంతి దక్కుతవి. లాటరీ, చట్టా వ్యాపారమువంటి పనులలో అనుకూలత తక్కువ. పుణ్యకార్యాలు జరుగుతవి. వినోదాలు, విందుల మొదలైనవాటిలో పాల్గొంటారు. పనిలేకుండా ప్రసంగాలకు దిగేవారిని దూరంగా ఉంచటం మంచిది. 9, 10 తేదులలో గౌరవలాభము, వ్యవహారాలలో జయము.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ధనవిషయంలో మీ పరిస్థితి మెరుగు అవుతుంది. శుభకార్యబాధ్యతలు చాలావరకు ఒక మార్గానికి వస్తవి. వృత్తిలో మీకు ప్రతిబంధకంగా ఉన్నవారు ఈ సమయంలో తొలగిపోతారు. మీ ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. ఇండ్లు కొనటం, కట్టటంవంటి కార్యకలాపాలలో ఇతరుల ఆలోచనలవల్ల ప్రతిబంధకాలు రాగలవు. ప్రయాణాలు అనుకూలంగా జరుగుతవి. వృత్తి వ్యాపారాలలో ఇంతకుముందుకన్నా ఆడంబరం పెరగవలసివస్తుంది. మీ సలహా కోసం ఎదురు చూచేవారు ఉంటారు. కుటుంబంలోని వారు మీ మాటను ఆమోదించి ఆదరిస్తారు. ముందు అంచనా తెలుసుకోకుండా ఆరంభించిన పనులవల్ల చికాకు అధికమవుతుంది. 8, 9 లలో సభా గౌరవము, బంధుమిత్రులవలన ఖర్చులు, ధర్మకార్యాలు.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

అన్ని రంగాలలోను మీ శక్తిని చూపగలుగుతారు. మీ మాటను మంచితనంతో సంఘంలో గౌరవం లభిస్తుంది. వ్యాపార విషయాలలో మీరు వినియోగించిన ధనానికి తగినట్లు ఫలితం లభిస్తుంది. అధికారులవల్ల వస్తవని అనుకున్న చిక్కులు వాటంతట అవే తొలగిపోతవి. ఏ సందర్భంలో నైనా మాట పొరపాటు రాగల కారణా లున్నవి. మీముందు పొగడుతూ చాటున చులకనగా మాట్లాడే వారు ఉంటారు. వారం రెండవభాగంలో అకస్మాత్తుగా దేహబాధలు కనుపించగలవు. వస్త్రాలు, అలంకారద్రవ్యాలు మొదలయినవి కొంటారు. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. ఉపయోగంలేని పనులయందు ఆసక్తి అధికం అవుతుంది. ఆత్మబంధువులవల్ల నిష్ఠురాలు వస్తవి. 5, 6 లలో తీరని ఆందోళన, పెద్ద మనుష్యులతో పేచీలు.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఎవరు ఎన్ని మాటలుచెప్పినా మీ శ్రమ మీకు తప్పదు. యధార్థం మాట్లాడి విరోధం తెచ్చుకోవలసి వస్తుంది. వ్యవహారాలలో ఏవిధమైన నిర్ణయాలు జరగకపోవటంవల్ల ఆందోళన అధికమవుతుంది. ఎదురుచూస్తున్న వార్తలు వారం చివరలో వస్తవి. స్నేహితుల మనస్తత్వాన్ని అనుసరించి జాగ్రత్తగా పనులు సాధించుకోవలసిన సమయం. అధికారానికి ఆశపడి, వచ్చినదానిని వదులుకొనటంవల్ల ముందుముందు పశ్చాత్తాపపడతారు. పిల్లలమూలంగా సుఖ సంతోషాలు లభిస్తవి. ఎదటివారి శక్తిసామర్థ్యాలను గ్రహించి తగు విధంగా నడుచుకో గలుగుతారు. సంచారంతో కూడిన పనులు అధికం. మొత్తంమీద ఆర్థికంగా శ్రమకరమైన సమయం. 9, 10 తేదులలో ధనప్రాప్తి, కుటుంబంలో శుభ సంతోషాలు, కార్యసిద్ధి.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఈ వారం ముఖ్యంగా ధైర్యం అవసరం. యధార్థంగా జరిగే కష్టనష్టాలు ఏమీ ఉండవు. కాని మాటలలో మిమ్ములను నిరుత్సాహపరచేవారు ఉంటారు. దైవానుగ్రహంవల్ల సమయంలో చక్కగా యోచించి మీ కర్తవ్యాన్ని నిర్ణయించుకొన గలుగుతారు. బంధువుల రాకపోకలు అధికం కాగలవు. ఆసక్తితో సంపాదించిన వస్తువులు సమయంలో వినియోగించుకొనలేక పోతారు. కుటుంబంలో సాధారణంగా అభిప్రాయ భేదాలు వచ్చి, వెంటనే సర్దుబాటు అవుతవి. పనులు చురుకుగా తెమలకపోవటంవల్ల చిరాకు పెరుగుతుంది. తోటివారిని ఉత్సాహపరచి మీ పనిని సాధించుకొనవలసిన అవసరం కలుగుతుంది. ఆదాయం మందగించగల అవకాశా లున్నవి. 7, 8 తేదులలో స్వల్ప ఆదాయం, కష్టవార్తలు, వృధా ఖర్చు.

## మీనం

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

ఎదటి వ్యక్తియొక్క ఆంతర్యాన్ని సులభంగా తెలుసుకొన గలుగుతారు. మీరు చేసిన ఖర్చుకు తగిన ప్రయోజనం కనిపిస్తుంది. మీ క్రింద పని చేసే మనుష్యులలో అశ్రద్ధ పెరగటంవల్ల కార్యభారం మీపైన పడుతుంది. ధనాదాయం సంతృప్తికరంగా ఉంటుంది. మీ సందేహాలను తీర్చి సహాయపడగల మనుష్యులు లభిస్తారు. వ్యాపార వ్యవహారాలలో మీ ధర్మాన్ని సకాలంలో నిర్వర్తించుకొని విశ్రాంతి పొందగలుగుతారు. బాహ్య ఆడంబరము, సంఘ కార్యాలు, ఇతరుల పనులు పైన వేసుకుని నిర్వహించటం మొదలైనవాటి యందు నిరుత్సాహం కలుగుతుంది. క్రొత్తమార్గాలలో ఆదాయం లభిస్తుంది. మీ మాటలను బట్టి అప్పులు కూడా మిమ్ములను సందేహించగల అవకాశం ఏర్పడుతుంది. సంగీతము, చిత్రలేఖనము మొదలయిన పనులలో యుండే వారికి గౌరవప్రదమయిన కాలము, ఉత్సాహము, ఆదాయము పెరుగుతవి. వ్యవహార రంగంలో జయమే కాని, ఫలితం తక్కువ. 10, 11 లలో పరోపకారము, వాహన సుఖము, వినోద కార్యక్రమాలు.

### ఈ వారము ధరలు

బంగారు ధర కొద్దిగా మందీ అవుతుంది. వెండి ధర వారంచివరలో పెరుగుతుంది. మిర్చి ధర పెరిగే అవకాశా లున్నవి. పసుపు ధర గతవారం మాదిరిగా ఉంటుంది. ధనియాల ధరలో మందీ సూచన లున్నవి. మినుముల ధరలో గిరాకి కనుపిస్తుంది. నెయ్యి, వెన్న ధరలు మొదట పెరిగి వారాంతంలో తగ్గుదలకు రాగలవు. నూనెల రకాల ధరలలో పెద్ద మార్పు ఉండదు. చింతపండు ధర నిలకడగా ఉంటుంది.

* * *

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ధనయోగం బాగుంటుంది. సంతోషము, సుఖము లభిస్తవి. వ్యాపార రంగంలో మీ ఆలోచనలు చురుకుగా జరుగుతున్నట్లే ఉన్నా, మధ్య మధ్య ఆందోళనకరంగా కనుపిస్తూ ఉంటవి. మొత్తమీద చివరవరకు సాగించగలుగుతారు. మొత్తం మీద చివరవరకు సాగించగలుగుతారు. అలంకార వస్తువులు, విలాసవస్తువులు మొదలయినవి కొంటారు. ధనసహాయం నిమిత్తం ఒకరి మాట మీద ఆధారపడతగిన సమయం కాదు. విద్యార్థులకు నిరుత్సాహం కలిగే అవకాశా లున్నవి. భారీ వ్యాపారాలలో ప్రవేశించవలయుననే ఆలోచనలు రావచ్చు. కొన్ని సందర్భాలలో నీచజన స్నేహం చేయవలసి వస్తుంది. మిమ్ములను అప్పులు అడిగే వారు అధికం అవుతారు. కోర్టు కచేరీలలో చిక్కులను ఎదుర్కొనవలసి వస్తుంది. 5, 6 తేదులలో అపవాదులు, వస్తువులు పోగొట్టుకొనుట.

## కన్య

**(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ప్రతి చిన్నవిషయంలోనూ ఆదుర్దా తోస్తూ ఉంటుంది. మీ పెత్తదనాన్ని బట్టి పెత్తనం చెలాయించేవారు ఉంటారు. జాగ్రత్తగా ఉండండి. ఆదాయాన్ని మించిన ఖర్చు. అధికారము, అవకాశము ఉన్నా సమయంలో ఉపయోగించుకొనటానికి వీలుకాదు. డబ్బుకు సంబంధించిన లెక్కలు, అధికారులకు వ్రాసే ఉత్తరాలు మొదలయిన వాటిలో పొరపాట్లు రాగల సూచనలున్నవి. సుఖ సంతోషాల నిమిత్తం ధనవ్యయం పెరుగుతుంది. వృత్తికి సంబంధించిన కార్యకలాపాలలో ఏర్పడిన ప్రతిబంధకాలను మీ బుద్ధిబలం వల్ల తొలగించుకొన గలుగుతారు. ఈ సమయంలో మీరు చాలా వరకు జోక్యం తగ్గించుకొనవలసిన సమయం. మీ వద్దనుంచి మాటను రాబట్టేటందుకు ప్రయత్నించేవారు ఉంటారు. 10, 11 తేదులలో అకస్మాత్తుగా ధనలాభం, బంధం, విరోధం, ప్రయాణాలు.



# డాక్టర్ రాజు

బొమ్మల కథ

దేవిక 6






















## సులభగణితం

మానాన్న (శ్రీరంగం వెంకటరమణయ్య—గణిత శాస్త్రజ్ఞుడు) గారిని ఆయన చిన్నతనంలో లెక్కల టీచరు స్కూలు కుర్రాళ్లందరితో పాటు, ఒకటి నుండి 100 వరకు అంకెలను కూడమన్నాడట. మిగిలిన వాళ్లందరూ పలకల మీద అంకెలువేసి కూడుతూ ఉంటే, మా నాన్న కాస్సేపు ఆకాశం వైపుచూసి "5050" అని నోటినే చెప్పాడట. అదొక్కటే సరి అయిన కూడిక.

ఇంత త్వరగా ఈలెక్క ఎలా చేశావని టీచరు ప్రశ్నించగా "దీనికేదైనా సులువైనమార్గం ఉంటుందా అని ఆలోచిస్తే $100+1=101$, $99+2=101$, $98+3=101$, $97+4=101$; ఈవిధంగా $51+50=101$ వరకూ లెక్క పెడితే 50 నూటఒకట్లు వస్తాయి కాబట్టి $101 \times 50 = 5050$" అన్నారట మా నాన్నగారు!

శ్రీ శ్రీ (మద్రాసు)

* * *

## అహంభావ కవిత్వం

కవిగాను
భావ కవిగాను
అహంభావ కవి నేను

లెక్కన రసహ్యం
ఛందో బాహ్యం
నే చెప్పిందే గ్రాహ్యం
అన్ని వింగాకీ ప్రశస్తం

అన్నీ నాకు కరస్తం
అందె వేసినది నా హస్తం

ఏదో పాతది తీస్తాను
పైపై మెరుగులు పూస్తాను
కొత్తదానిలా చేస్తాను.

తోచినదేదో రాస్తాను
గట్టిగ దానిని కూస్తాను
అందరి నోరులు మూస్తాను.

మంచి కవిత్వాన్ని ముంచేస్తా
భావ కవిత్వాన్ని బాదేస్తా
నాదు కవిత్వాన్ని నడిపిస్తా.

అప్పకవీంద్రుని అణచేస్తా
చిన్నయసూరి చీలుస్తా
భట్టబాణుని పాతేస్తా

నా కవిత్వం చూస్తారా
నా గాటికి జడుస్తారా
నాతో సవాల్ చేస్తారా.
చాలా మీరూ రాస్తారా?
నాతో పోటీకొస్తారా
గాలా కోతలు కోస్తారా

నా గొప్పలు వింటే
నా చేష్టలు కంటే
నా కవిత్వమంటే

పండితులంతా పారాలి
స్నేహితులంతా చేరాలి
శత్రువులంతా జారాలి.

అదే నా మహత్వం
అదే నా పటుత్వం
అదే నా కవిత్వం.

వవంటి నరసింహం, (విశాఖపట్నం) ★



# శేషగిరి



ఇహ లోకంలో ఒక వూళ్లో పి కాలేజీ హాస్టలు పన్నెండో నెంబరు రూములోంచి, నిప్పు ప్రాతో కూడిన మూడుబారల మూల్గు వచ్చింది.

"ప్ప" అంటూ కుర్చీలో నిటారుగా కూర్చోలేక శేషగిరి వెనక్కి వాలిపోయాడు.

"అల రాముడు ఏకపత్నీ వ్రతుడెందుకు అయ్యాడో నీకు తెలుసటోయ్ ఆచారీ" అన్నాడు పాపరావు చదువుతున్న నవలని ఒళ్లో పడేసుకుంటూ!

"నాకు తెలీదు. నాపేరు ఆచారికాదు. నువ్వు చెప్పనక్కరలేదు—నా బాధ. నీకు—నీకేకాదు ఈ ఇహలోకంలో ఎవ్వరికీ తెలీదు—ప్ప—ప్ప" అన్నాడు శేషగిరి కుర్చీలో యింకొంచెం వెనక్కి వాలిపోతూ.

వికసిత, స్మితవదనుడై, పాపారావు నోరు తెరిచి మాట్లాడేలంతలో, వరండాలో—"సిగరెట్స్ప్లీచ్ఛ" అన్న కేక వినపడింది. వెనువెంట ఆ కేక వోనరు అదే రూములోకి వచ్చేశాడు. "నాకోచ్ఛ" అన్నాడు పాపారావు రివ్వునలేచి నించుంటూ.

"నీ ముఖం—అర్భకుడా, నేననేది సిగరెట్లు నా కివరిస్తారోచ్ఛ అని—కూర్చో కూర్చో" అంటూ నరసింహం పాపారావుని యథాస్థానంలోకి నెట్టి తను పెట్టెమీద కూర్చున్నాడు. కూర్చుంటూ, "అవునూ—నేనూళ్లో లేకుండా చూసి, శేషగిరికి సంపతం తగిలిందట్లే—" అన్నాడు.

శేషగిరి నిట్టూర్పు వదిలాడు.

"రెండుంపావు మూరలు" అన్నాడు నరసింహం వెంటనే.

"ఛీ—ఛాదస్తుడా—వేళాకోళానికి, వేళాపాళాలేదు. వాడు వో మూల చస్తూవుంటే" అంటూ పాపారావు మందలించాడు.

"ఆ—క్షంతవ్యుణ్ణి—అసలేం జరిగింది" అన్నాడు నరసింహం.

"నలవరంలేదూ, తీపరంలేదు—వెర్రి వెధవాయ్, లవ్—లవ్ స్టోరీ—ప్రథమాంకంలో వున్నా డంతే—" అన్నాడు పాపారావు తన జేబులోంచి సిగరెట్లు బయటికి తీస్తూ.

"హాలాగా! అవ్వా! ఎవ్వర్నీ—" అంటూ నరసింహం ఛటిక్కున ఆ సిగరెట్లు లాక్కుని, "ఆ—లవ్వాన్నావుకదూ—ఎవర్నన్నావ్" అన్నాడు అగ్గిపెట్టె వెతుకుతూ.

"జడ్డి వెధవ" అన్నాడు పాపారావు విసుగ్గా.

"ఓయ్—జడ్డి వెధవనా—వీడు ప్రేమించింది—పోన్లే" అంటూ నరసింహం—గూట్లోవున్న అగ్గిపెట్టె, దాని పక్కనున్న చిల్లర డబ్బులూ స్వాధీన పరచుకున్నాడు.

"ఛీ. లక్ష్మీదేవిరా" అన్నాడు శేషగిరి.

నరసింహం ఎగిరి, అదిరిపడ్డాడు. "ఏస్టి—సాక్షాత్తూ లక్ష్మీదేవినే" అన్నాడు కిందపడ్డ సిగరెట్లు తీసుకుంటూ.

"హావును" అన్నాడు శేషగిరి.

"అఘోరించావులే—ఆ పిల్ల జేరి మూణ్ణెల్లి పొద్దుయితే, యిదేం జబ్బు నీకూ!—నీ పేరు ఆలస్యంగా ప్రేమించిన అమాయక భగ్నప్రేమికుల జాబితాలో అట్టడుగున వస్తుంది" అన్నాడు సిగరెట్లు పొగ వదులుతూ.

"నాకు—చకాబికి ప్రేమించడాలు కుదర్వు—ఎంచి, యోచించి, ఆలోచించి, విచారించి. . . ."

"సర్లే—అన్ని చేస్తే చేశావ్‌గానీ, విచారించక" అన్నాడు పాపారావు అడ్డొస్తూ.

"—విను-మొన్న శనివారం—ఆమె తలంటుకుని లేత గులాబీరంగుచీరా, అదేరంగు రవికా, ప్ప్‌ప్—ప్ అనాడు సరిగ్గా చూశాను—.

"—అంతే ప్రేమించావు"

"అవునుగాని, నర్రీ—యింకా ఎవరైనా నా లక్ష్మీదేవిని ప్రేమించారా—చెప్పరా—ఇందాక గూట్లోంచి తీసుకున్న డబ్బులు అచ్చంగా తీసుకోలే—ఏం—" అన్నాడు శేషగిరి కుర్చీలోంచి లేచి వరసింహం దగ్గిర కెళుతూ.

"బావుంది—గూడు నీదిగానీ, డబ్బులు నీవని అజ ఏవుంది. నావే—నావి నా కివ్వటం గొప్పేనా, పోన్లే—విషయం చెప్తా నాగు" అంటూ తుర్రున పారిపోయి, సర్రున లిప్తలో ఓ పుస్తకంతో వచ్చాడు వరసింహం.

"నిన్ను తగలేసిరి" అన్నాడు పాపారావు విసుగ్గా. వరసింహం సిగ్గుతో, దాంతో వచ్చిన గర్వంతో సింహం అయిపోయి, నిభాయించుకుని, "ఆ—ఆ ట్టే పొగడకు. అసలే వానాకాలం—కాలుజారగలదు" అన్నాడు. వెనువెంట ఆ పుస్తకంలో పుటలు తిరగేస్తూ, "సుబ్బారావు—వీడు ఆమెని అందరి కన్నా ముందే ప్రేమించినా, వాళ్ళమేనమామ కూకలెయ్యడంవల్ల వూరుకున్నాడు—ప్రసాదరావు—వీడు తెగించి ప్రేమించినా, ఆ పిల్ల అన్నయ్యా అని పిలిచినందువల్ల అన్నయ్యగా మారిపోయాడు. ఇక—వెన్కట్రావూ, ముకుందరావు, గోకర్ణ—గజకర్ణేశ్వ్రరావూ—వీళ్ళు" అంటూ అందరి వృత్తాంతాలూ చదివి, "ప్రస్తుతం నీకు విలువ లేదు. ఆ—అన్నట్టు తొలి చూపెప్పుడు? మలి చూపెప్పుడు" అన్నాడు పుస్తకాన్ని మూసేస్తూ.

"తొలిచూపు తెలీదు—మలిచూపు మాత్రం మొన్న పొద్దున్న" అన్నాడు పాపారావు శేషగిరికి బదులు.

"ఏవన్నావ్—మొన్నా—అంటే శనివారంకదూ! ఆరోజు—లేత గులాబీచీర—అదే రంగు రవికా, వదులుపాటివంటి జడా—తలలో ఎర్రముద్ద మందారా—చేతిలో మూడు పుస్తకాలూ—చెవులకు బాతులూ—అవే — బాతుల్లాటి దుద్దులూ—" అన్నాడు, అదే పుస్తకంలో మరో పేజీ చూస్తూ.

"హవున్రా" అన్నాడు శేషగిరి.

"హవునవును — భోజనానికి టైమయ్యింది—అవతల కాలేజికి టైమవుతోంది" అన్నాడు నరసింహం లేచి నించుంటూ.

* * *

కాలేజీలో గంట గణగణగణలాడి, "విద్యార్థిలోకంలో పదికాని గడియారాలున్నవాళ్ళు—టైము సిద్దుకొండోవ్" అంది. విద్యార్థిలోకం శిరసావహించింది. జనం కోలాహలంగా, వరద బాధితుల గుంపుల్లా, సంపూర్ణ యాత్రా స్పెషల్‌రైలు దిగిన భక్తబృందాల్లా, మొయ్యలేని శరీరాలతో, అంతకు మించిపోని పుస్తకాల బరువులతో, లేని ఉత్సాహంతో చకచక తిరుగాడుతున్నారు.

# జాకోబాసన ప్రేమోపాసన

వెనుకచూపు ఎక్కువయిన కుర్రాళ్ళు—చూపు బొత్తిగా ముందులేక, ముందు నడుస్తూ, వెనక్కు చూస్తున్న మరోజత కాళ్ళను తొక్కేస్తూ, "సారీ" అనడానికి బదులు ఏవేవో వాడుక పదాలు అనేస్తున్నారు. అదే పనిచేస్తున్న ఆ ముందు జతకాళ్ళ వోనర్లు సమయోచితంగామాట్లాడడానికిబదులు "దానికేంలెండి" లాటి మాటలు అంటూ, వెనక్కి, పక్కలకూ జాగ్రత్తగా చూసుకుంటూ పోతున్నారు.

ఇవన్నీ చూస్తున్న (ఆడ) లేడీ కన్నులు తమ జాతికళ్ళతో, అవే సంగతులు చెప్పుకుంటూ, రుమాళ్ళ పైటచెంగులో, పెన్నులో, పెన్సిళ్ళో, ఏవిలేని వాళ్ళు చేతులో, అవీ దగ్గరసాలేనివాళ్ళు బాహాటంగావో నవ్వుకుంటూ పరస్పరం చేతులతో పొడుచుకుంటూ పోతున్నారు. ఇన్నిటినీ చూస్తూ, నడుస్తున్న వుపాధ్యాయులు, రాయో, రప్పో తగిలి, తూలిపడిపోయి, నిభాయించుకుని, "అదేపాయె" అనుకుని పోతున్నారు.

---

"తిక్కనగారి పుస్తకాలు ఈ షాపులో చాలా ఉన్నాయి. ఎందుకిన్ని 'స్టాక్' చేస్తున్నారంటావ్?" అని అడిగాడు ఒక లెఖాధికారి పుస్తకాలషాపుకి తనతోబాటు వచ్చిన రాజుగారితో.

"అంగడి యజమాని చుట్టమేమో!" అన్నాడు రాజుగారు.

కె. పద్మ (గుంటూరు)

---

ఇవన్నీ మనకెందుకులే, అన్నట్టుగా సైకిలు షెడ్డులో బల్లమీద వో విద్యార్థి కూర్చుని, వచ్చేపోయే జనాన్ని చూసుకుంటూ చడా మడా, ఏదో రాసిపారేస్తున్నాడు. అది చూస్తూ పక్కన నించున్న మరో వ్యక్తి, "ఏం ఉపయోగంరా నర్రీ" అన్నాడు రెపరెపలాడుతూ. నరసింహం నవ్వేశాడు. ఈలోగా శేషగిరి అపురావురుమంటూవచ్చి, "ఇవ్వాళే......" అన్నాడు నరసింహం చెయ్యి పైకి ఎత్తాడు. చేతిలో ఫీజు పడింది.

"నల్లశాటినుమీద—నీలం, ఎరుపూ, పువ్వుల పరికిణీ, నీలంక్రేపు జాకట్టూ, రెండు జడలూ, ఎడం జడలో వో మందార పువ్వూ—ఆకు చెప్పులూ, ఆరు పుస్తకాలూ అన్నట్టు వోణీ—గులాబిరంగు వోణీ—"

నరసింహం చెప్పినది వర్ణించుకుంటూ, "ఇప్పుడే వస్తా" అంటూ శేషగిరి వెళ్ళిపోయాడు. నరసింహం రాతలో పడిపోయాడు. మరో రెండు నిముషాలు వోపికపట్టిన పాపారావు, "ఏరోయ్ గంటయి గంటన్నరయ్యింది—తెవిలిరా—" అన్నాడు నరసింహం జబ్బ పట్టుకుని గుంజాయిస్తూ. నరసింహం తొణకలేదు సరికదా, బెణకలేదు కూడా. తల ఎత్తకుండానే, "ఆహా! అయితే నువ్వెళ్ళు—ఆఖరునుంచి ఆరో బెంచీలో అటుపక్కగా కూర్చుని, నీ అటెండెన్సుతో పాటు, నాదీ పలికెయ్యి—నెంబరు తెలుసుగా—నా శృతి నాలుగున్నర—ఏం ఫో" అన్నాడు.

"ఆ—ఆ" అంటూ పాపారావు పరుగెట్టాడు.

* * * *

ఆ ఫలానా క్లాసులో వో మేష్టారు పాఠం చెప్పుకుపోతున్నాడు. "పర" ధ్యాహ్నంలోవున్న శేషగిరి ఎందుకో నవ్వుకున్నాడు. అంతలో వులిక్కిపడ్డాడు. వెనువెంట ఎగిరిపడుతూ, "కోడ్కోడి" అంటూ గావు కేకలు వేశాడు. అతన్ని అనుసరించి, తోటి విద్యార్థులు "కోడి కోడో" అని బృందగానంపాడి, తమ ఐకమత్యాన్ని తెలియజేశారు.

"కోడేవిటోయ్" అన్నారు లెక్చరరుగారు.

"కోడికాదు—తేలు—తేలుసార్" అన్నాడో కుర్రారావు. ఈలోగా శేషగిరి గమ్మునలేచి, లక్ష్మీదేవి కాలుకి ఆరంగుళాల దూరంలోవున్న ఆతేలుమీద విరుచుకుపడ్డాడు. ఆడాళ్ళంతా పుల్లోమని లేచి, వీరునివంక చూశారు. శేషగిరిలో వీర రక్తం విజృంభించింది. చట్టుమని ఆ తేలుని మట్టేశాడు.

"ఆఁ! జాగ్రత్త" అంది నేపథ్యం.

తేలుని తొక్కినవాడు తొక్కినట్టే, అట్టే వుండిపోయి, కాలు కదపలేక, వంగి తనకాలుకేసి చూసుకుని, "తేలుని తొక్కిన కాలుకి రక్షలేదు కదా, వంగిచూడా" లనుకున్నాడు బాధతో.

"తేలు కరిచిందేవిటోయ్!" అంటూ తేలు చావడం నిర్ధారణ చేసుకున్న లెక్చరరుగారు కుర్చీ దిగారు. "హ్హా—తేలు కరుస్తుందేవిటి? కుడుతుందికానీ, హెహె హే" అన్నాడో కంఠారావు.

"కరవలేదండబ్బా" అన్నాడు శేషగిరి పళ్ళు బిగించి, బింకంగా వుండ ప్రయత్నిస్తూ. విషయపాకం గ్రహించిన పాపారావు సద్దుమణిగేలోగా, శేషగిరి రెక్క పుచ్చుకుని, పక్క ఖాళీ రూములోకి లాక్కుపోయాడు. అప్పుడే లోపలకు రాబోతున్న నరసింహం వాళ్ళని వెంబడించాడు.

* * *

"దున్నపోతుల్లా వున్నారు తేలుమంత్రం రాదర్రా" అన్నాడు శేషగిరి బాధగా కాలు జాడిస్తూ. నరసింహం "రాదు" అన్నాడు చప్పగా. ఈలోగా చిన్నప్పుడెప్పుడో నాయనమ్మ వైద్యం గుర్తొచ్చి—"హ—తెలిసెన్—గుడ్డ—పొగవేస్తే తగ్గుతుంది" అన్నాడు ఎగిరిగంతేస్తూ.

"రైట్—కానీ అవి ఏవీ" అన్నాడు పాపారావు చొక్కా చూసుకుంటూ.

"రుమాళ్ళు" అన్నాడు నరసింహం.

"తగలెట్టండి" అన్నాడు శేషగిరి విసుగ్గా.

"ఇక్కడ పెడితే—మనని కాలేజీ పెడుతుంది—అల్లా మైదానంలోకి రా" అంటూ పాపారావు రెక్క పట్టుకున్నాడు. మిగిలిన రెండో రెక్కా నరసింహం లంకించుకుని, యిద్దరూ కలిసి శేషగిరిని ఆ రూమ్ము

వెనకవక్క ఖాళీస్థలంలో జేర్చి, "హిగ" వేసి బాధ కొంచెం తగ్గించదనిపించారు. ఇంతలో గంట గణ గణ లాడింది. "జనవాక్య సేకరణ" అంటూ నరసింహం ఎగిరి గంతేసి పరిగెట్టుకెళ్ళి, వో పది నిముషాల్లో ఏడుపు ముఖంతో తిరిగొచ్చాడు.

"ఏమనుకుంటున్నార్రా, నర్రీ" అన్నాడు శేషగిరి అంత బాధలోనూ, బాధగా.

"మగా—ఆడా"

"ఆడ—మగందుకు మనకి?" అన్నాడు పాపారావు.

"హు—ఏమని చెప్పను—మా బాగా అయ్యింది. గొప్పగా తొక్కేశాడయ్యా—అంది మీ మందారం—' అని కొంచెం గుటకేసి, "ఆ చివర నాలుగక్షరాలూ నా సొంతంలే" అన్నాడు నరసింహం. శేషగిరికి అంప కంపాలతో కోపంవచ్చి, "ఏడిసిం"దాకా అనేసి, తప్పు గ్రహించి, నాలిక కొరుక్కుని జంటగా బాధ పడ్డాడు.

"హావును—తేలు కుట్టినందువల్ల మనం — అంటే—నువ్వు వెళ్ళిపోయావని, మేం నీవెంట వెళ్ళామని అడాళ్ళిపోయం" అన్నాడు నరసింహం.

"హోయ్ హోయ్—అయితే వచ్చే క్లాసులో మన ముగ్గురం ముందు బెంచీలో కూర్చోవాలి" అంటూ తీర్మానించాడు పాపారావు.

* * *

వచ్చే క్లాసు రానే వచ్చింది. బ్యాంకింగ్ లెక్చరరు గారు తన విద్యుక్తధర్మాన్ని కుర్రాళ్ళమీద పోసి, తలంటుతూ, యింతలో ముందు బెంచీలో కూర్చున్న మూడు ముఖాల్నిచూసి, ముచ్చట పడబోయి, అంతలో ఆ ముఖాల్లో ఒక ముఖం—తన ముఖం చూడ్డానికి బదులు మరో ముఖంవంక చూడ్డం చూసి, ముఖం మూడ్చుకుని, ఆ ముఖాన్ని "వెధవ ముఖం" అని తిట్టుకుని, సరిపెట్టుకుని, పాఠం చెప్పే ప్రయత్నంలోకి వచ్చి, గతవాక్యం మర్చిపోయి, "ఆ—ఎంతవరకు జెప్పా" అన్నారు.

"అందుకని ధర విపరీతంగా పడినంతవరకూ సార్" అన్నాడో సువిశాలకర్ణుడు.

"అవును—పడింది—ఏవిటి పడింది" అని ఆయన తర్కించుకుని, దాన్నే ప్రశ్నగా మార్చి, "ఏయ్, డెబ్బైఏడూ, ఏవిటి పడింది" అన్నారు కచ్చిగా. "పర"—ధ్యాన్నంలోవున్న ఆ ఏడు—తన పక్కనున్న పాపారావు విదిలింపుతో ఎగిరి నించుంటూ—"మందా" అని అరిచి, అంతలోనే, నోరు జారిన వైనాన్ని గుర్తించి, గమ్మునినోరు నొక్కేసుకున్నాడు. లక్ష్మీదేవి ఎడంచెయ్యి అనుకోకుండా తల వెనుక భాగంలో తడివిచూసి, "మందా లేదు. పడిపోయింది' అని తెల్సుకుని, ముందు కొచ్చేసింది. "హోరి వీడి దుంపతెగా" అనుకుంది ఆమె మనస్సు.

ఈలోగా, విషయార్థం గ్రహించిన కుర్రాళ్ళు విరివిగా, సంత సంబరంలా ఆనందంతో గోల చేశారు. "మందా ఏప్పి" అంటూ వేలెడు లెక్చరరు గారూ, బారెడుసాగి, ఆలోగా విషయాన్ని పసిగట్టి—"నాన్సెన్సు—ఇన్ డిసిప్లిన్—యూ—నా క్లాసులోంచి గెటవుట్—క్విక్—మీ రిద్దరూ—మీ ముగ్గురూ—వో—మొత్తం బెంచీ అంతా—" అంటూ తన కోపాన్ని పదిమంది పెట్టు పెంచుకున్నారు. వచ్చిన ఛాన్సు వదులుకోడం మంచిదికాదని గ్రహించిన ఆ పదిమంది కుర్రాళ్ళు ఆనందంతో పులోమంటూ లేచారు. క్లాసులో కూర్చోలేక బాధ పడుతున్న మరో అయిదారుగురు విద్యార్థులు కూడా ఆ గుంపులోజేరి, సంఘీభావమే బలము అని తేల్చారు. ఇది చూసి, వెనక బెంచీల్లో నిద్రపోతున్న కుర్రాళ్ళు "బెల్లయ్యింది గావోల్ను" అనుకుని, ఆవులించుకుంటూ, పుస్తకాలు పుచ్చుకుని వినమ్రులై తల వంచుకుని, సాగిపోసాగారు. "వ్హాట్—ఏవిటిది", అని ముమ్మారు ప్రశ్న వేసుకున్న మేష్టారు అప్పుడే గడపదాటుతున్న వో కుర్రాణ్ణి వుద్దేశించి—"ఎక్కడికి" అని కేకేసారు.

"హే—భెల్లయ్యింది ర్హాన్హోయ్—ర్హామచంద్రా" అని కుర్రాడు ఆవులించుకుంటూ వెనక్కి చూడకుండా, ధీరోదాత్త నాయకుడిలా వెళ్ళిపోయాడు. లెక్చరరుగారు మూడోసారి హడలిపోయారు. ముందు బెంచీల్లో కూర్చుని, చాలా శ్రద్ధగా పాఠం విన బూనిన కుర్రాళ్ళు, తమ తదేక ధ్యానలో బెల్లు విన పడలేదని తలచి, పుస్తకాలు తీసుకుని, లేచి నిలబడ్డారు. ఇదివరకే లేచి నిలవడ్డ లెక్చరరుగారు—"రైట్—మీరు వెళ్ళవచ్చు" అంటూ తన గడియారం సరిదిద్దుకోపోయాడు. గది ఖాళీ అయిన ఉత్తర క్షణంలో గంట గణగణలాడింది. నాలుగో సారి హడలిన లెక్చరరుగారు ఖాళీ బల్లలను చూసి, "ఐ సీ" అని తల పంకించుకున్నారు.

---

"మా వాడికి త్ర్యంబకరావు అని పేరు పెడ్దామనుకున్నాం కాని, మా ఆవిడ ఆ పేరు నోరు తిరగదని, కార్తవీర్యార్జునరావు అని మార్చేసింది." అన్నాడు శంతనరావుగారు స్నేహితులతో.

నాగార్జునరావు (మద్రాసు)

---

* * *

ఆనాడు సాయంత్రమే — నరసింహం—లక్ష్మీదేవి తాలూకు సంపూర్ణ భోగట్టా, పరిపూర్ణ విలాసమూ, సమాచారమూ తెలుసుకొచ్చి శేషగిరికి చెప్పి, తన శ్రమఫలంకింద ఓ అయిదు రూపాయలు జమ కట్టించుకున్నాడు.

"మణ్యం మేష్టారివాటాలోనా — వాళ్ళున్నది" అన్నాడు శేషగిరి అంతా విని.

"హావునా—అయితే గట్టి చిక్కే" అన్నాడు పాపారావు.

"ఓ పని చెయ్యండి" అన్నాడు నరసింహం.

"ఏవిటి? నీ కో రూపాయివ్వడమేనా" అన్నాడు శేషగిరి విసుగ్గా.

"ఓ—యిస్తానంటే వద్దనను. రేపు ఏకంగా రెండు రూపాయ లిద్దువుగానిలే — కాని నువ్వు రేపటినుంచీ—మణ్యంగారివద్ద ఉదయం—ఆరూ—టూ—ఏడు ప్రయివేటుకి చేరు—మీ మందార అదే లక్ష్మీదేవి కూడా అదే టయిముకి వస్తుందిలే" అన్నాడు నరసింహం.

"హా—మణ్యంగారు అంత తొందరగా చేర్చుకోరు" అన్నాడు పాపారావు అడ్డొస్తూ. నరసింహం తల పంకించాడు.

"అయితే, ఈలోగా ఆయనకి రోజుకి అయిదారు నమస్కారాలు చొప్పున తగల్నియ్యి. దార్లోకి వస్తాడు" అంటూ సలహా యిచ్చాడు నరసింహం.

* * *

నరసింహోపదేశానుసారం శేషగిరి ఎగబడి మణ్యంగారికి, దఫ దఫాలుగా వూపిరి సలుపకుండా నమస్కారాలు పెట్టసాగాడు. వారం తిరిగేసరికల్లా "ఏవోయ్! బాగా చదువుతున్నావా!" అని మణ్యం మేష్టారి చేత అనిపించుకునేవరకూ వచ్చాడు. (అదృష్టం కొద్దీ) ఒకనాడాయనవద్ద చిల్లరలేకపోయేసరికి, చంగున గంతేస్తూ, శేషగిరి రిక్షావాడికి పావలా యిచ్చి, అది తిరిగి మణ్యంగారివద్ద పుచ్చుకోక, వాడికగా బియ్యం కొలిచిన యినపసేరులా తళతళా మెరవసాగాడు.

* * *

ఆరోజు మరీ మంచిదవడంవల్ల, శేషగిరి ప్రయివేటులో చేరాడు. అదృష్టంకొద్దీ అనుకున్నవేళలోనే కుదిరింది. రోజులుదొర్లినకొద్దీ అత్యధికానందోత్సాహాల డోలికల్లో తేలుతూ, మరీ తెల్లవారుజామునలేచి, స్నానాదులు ముగించుకుని పరుగున 'మణ్యం' గారింటికి వెళ్ళి, టైము అయ్యేదాకా దిక్కులు చూస్తూ కూర్చోడం అలవర్చుకొన్నాడు. అలా, రివాజుగా వెళ్ళి, ఒక రోజున పక్కవాటాకేసి చూస్తూ, "మే" అంటూ మేష్టారి తలుపుతట్టాడు. తీమున్న తలుపు తెరుచుకుంది. ఉలిక్కిపడి, యింకో సారి "మే" అనబోయి, శేషగిరి అట్టే వుండిపోయాడు. ఎదురుగా చాపమీద కూర్చుని, చదువుకుంటున్న లక్ష్మీదేవిని "క్రేన్వ్యూ"తో చూసి, "నా జన్మ తరించింది" అని మహా సంబరపడ్డాడు. ఈలోగా, నరవానన పసిగట్టిన లక్ష్మీదేవి, తలెత్తి చూసి, శేషగిరి వైఖరి చూసి, ఫక్కున నవ్వబోయి, గమ్మున మూతి బిడాయించుకుంది. అప్పుడే 'ఇహలోకం' లోకి వచ్చిన శేషగిరి, "యిక కూర్చోవచ్చు" అనుకుంటూ చాపమీద కూర్చోబోయి, తిన్నగా కూర్చోడంరాక, పేరుకుపోగిన సిగ్గు నలుచుకుంటూ, చాపంతా వదిలి, వోమూల ఒదిగి కూర్చున్నాడు. అది చూసిన లక్ష్మీదేవి చెంపలు ఎరుపెక్కాయి. శేషగిరి గుండెల్ని ఎగసందోసుకుంటూ, "ఆహా" అనుకున్నాడు. ఇంతలో మరో గాజుకంఠం తలుపు దగ్గిర "మే" అనేసి, లోపలకొస్తూ, "ఏవోయ్యబ్బా—అప్పుడే వచ్చేశావా—నీకేం—పక్కనేగా యిల్లు" అంటూ లక్ష్మీదేవి పక్కన కూర్చుంది.

"రెండు రెళ్ళు నాలుగు జడలు" అనుకున్నాడు శేషగిరి యింకొంచెం గోడవారికి జరుగుతూ.

నాలుగు జడలూ కబుర్లలోకి దిగాయి. అక్కడనుంచి నవ్వుల్లోకి వెళ్ళాయి. ఆ నవ్వులు మహా విపరీతం అవడంవల్ల, రుమాలుతీసి, ముఖం తుడుచుకుంటూ, "కిల, కిలా నవ్వులా—కురిసే తువ్వర్లూ" అనుకున్నాడు శేషగిరి. అది తెలుసుకున్న జడలు

## జాకోబాసన ప్రేమోపాసన

నవ్వబోయి, ఆ నవ్వుని ఆపుకోబోయి, వంకాయి బుడగలు పేలినట్లు నవ్వాయి. పైనుంచి యిదంతా చూస్తున్న వో బల్లి ఆనందంతో వుబ్బి, తబ్బిబ్బయి, ఎగిరి, దుమికి శేషగిరి నెత్తిన పడింది. "య్యవ్వే" అని కేకేస్తూ, శేషగిరి ఎగిరి, తిరిగి, యథాస్థానంలో పడ్డాడు. ఆడపిల్లలిద్దరూ, ఆరేసి అంగుళాలు ఎగిరి, తమ తమ స్థానాల్లో పడ్డారు. ఈలోగా ఆ బల్లి—తిరిగి గోడమీదికి గంతేంసిది.

"హిహిహి" అంది లక్ష్మీదేవి రుమాలు చాటు నుంచి.

"తేలుని వుత్తి కాలితో మట్టేవాళ్ళకూడా బల్లంటే భయవేనోయబ్బా" అంది రెండో దేవి.

"య్యయ్యో" అనుకున్నాడు శేషగిరి కోపంగా.

"ఏవోయ్—అన్నట్టు నీ కోసం ఏవిటి తెచ్చానో తెలుసా" అంటూ ఆ దేవి, జామిట్రీబాక్సు తెరిచి, అందులోంచి ఏవిటో తీసి లక్ష్మీ దేవి చేతిలో పోసింది. అవేవిటో క్రీగంట చూసిన శేషగిరి, "బాదంపప్పులు బలేబలే" అనుకున్నాడు నోరు చప్పరిస్తూ.

"ఏవో—నీకేవేం చెట్లంటే ఎక్కువిష్టం?—తినేవిస్మా" అంది ఆ దేవి మిగిలిన పప్పులు నోట్లో వేసుకుంటూ.

"తినేచెట్లా" అంది లక్ష్మీదేవి నవులుస్తూ.

"అదేలోవో" అందా దేవి అదే పని చేస్తూ.

"మరేం—జామా, కొబ్బరి—బాదం సపోటా నారింజా—"

శేషగిరి టకాల్న ఆ అయిదుపేర్లూ తన నోట్సులో రాసేసుకున్నాడు. ఇంతలో సంధ్యావార్చు పూర్తి చేసుకున్న మేష్టార్లొచ్చారు.

* * *

దీపా లెట్టారు!

"పెట్టి గంటన్నర దాటింది!"

హాస్టల్లో అన్ని రూముల్లోనూ దీపాలు వెలుగుతున్నాయి. బాగా చదువుకుని, బాగుపడదామనే దురాశకల విద్యార్థులు, పుస్తకాలముందర కునికి పాట్లు పడుతూ, "అబ్బా—ఎంత సేపు చదివామే" అనుకుని, నిద్రకు ఉపక్రమించబోతున్నారు. అప్పటికప్పుడే వో గంట నిద్రపోయిన విద్యార్థులు, ముసుగులు తొలగించి, చిరాగ్గా చూస్తూ, "అబ్బ—ఏవిటి రాత్రి తెల్లవార్లూ చదువులూ, దీపాలూ, కొరివి దెయ్యాల్లా" అని తిట్టుకుంటున్నారు.

పన్నెండో నెంబరు రూములో వో మంచంమీద ఒక వ్యక్తి పడుకుని, ధూమపానంచేస్తూ, అవ్యక్తమయిన బాధ పడుతున్నాడు. దాని కొంచెం అసింటా మరో వ్యక్తి పెట్టెమీద కూర్చుని అదే పని చేస్తున్నాడు. బోర్లించిన బక్కెటుమీద కూర్చున్న వ్యక్తి మాత్రం వీలైనన్నిసార్లు బుర్ర గోక్కుంటున్నాడు.

క్షణం నిశబ్దం రాజ్యం చేసింది.

"హతవిధీ—కటకటా, కష్టకాలం వచ్చెకదటా

ఒక మగ పురుషుణ్ణి—ఓ అబల—ఒక్క రోజులో అనగా ఏడు గంటల వ్యవధిలో, యింతగా ఏడిపించిందంటే ఇది నా పుస్తకంలో చేరని వింత—దుర్భరం'' అన్నాడు బక్కెట్టుమీద నరసింహం.

''పెట్టే పెట్టారుగానీ, మా చెడ్డ మంచి పేరు పెట్టారురా. వీడి ఖర్మలే. ఆ బల్లి వీడిమీద వాళ్ళంగా పడడం'' అన్నాడు పాపారావు పెట్టెమీంచి లేచి, పచార్లు చేస్తూ.

''వాజమ్మా—దీనికి ప్రతీకారం ఆలోచించేది పోయి వాళ్ళని మెచ్చుకుంటావేం—' అన్నాడు నరసింహం.

మళ్ళా ముగ్గురూ ఆలోచనలో పడ్డారు.

* * *

కాలేజీలో బల్లి గోల బుల్లి బుల్లిగా ప్రారంభమై, వారం తిరిగేసరికల్లా పెట్రేగి, ఏనుగంతలావై కూర్చుంది. సద్దుమణుగుతుందన్న దురుద్దేశంతో శేషగిరి వో వారం శలవు పెట్టి చూశాడు. ''క్ష'' లాభం లేకపోయింది. పైగా, ప్రయివేటు వేళల్లో స్వయాన్న లక్ష్మీదేవే అనడంవల్ల, అని పవ్వుకోడంవల్లా, శేషగిరి మరీ డిలాఅయిపోయి, కర్తవ్యం తోచక నరసింహం చేతులు పట్టుకుని, ''ఇవి కాళ్ళుకావు—వసుదేవుడంతటి వాడే పట్టుకున్నాడు'' అన్నాడు బాధతో.

''పిల్లేదురా''

''మా బాబుగా''

''క్ష—పిల్లేదంటే నీక్కాదూ, నా కవతల డబ్బిచ్చే కేసులు చాలా వున్నాయి.''

''మా బాబుగా, అలా అనక—యిందా యిది వుంచుకో.

''ఏవిటీ—పంచ పాండవుల్ని కూడా చదివించవ్'' అన్నాడు నరసింహం వినుక్కుని డబ్బు లెక్కపెడుతూ. వెనువెంట, ''సరేలే. ఆలోచిస్తాను ఓ కాగితం, పెన్నూ యిలా పట్రా'' అన్నాడు. శేషగిరి నోటు పుస్తకం, పెన్నూ యిచ్చాడు. నోట్సులో తెల్లకాగితంకోసం పర్యవేక్షణ ప్రారంభించిన నరసింహం కళ్ళు దేన్నో చూశాయి.

మళ్ళీ—మళ్ళీ మళ్ళీ— చూశాయి !!

''ఇవేవిట్రా'' అన్నాడు నరసింహం, శేషగిరి మీదపడుతూ. అది చూసిన శేషగిరి ఆనందంతో, సిగ్గుతో, మహాచచ్చిపోయి, చొక్కా, కాలరు నవ్వుతూ, విషయం చెప్పాడు.

''ఏయ్! నా చొక్కా కాలరు నవుల్తా వేవిట్రా'' అంటూ నరసింహం కాలరు లాక్కున్నాడు. తప్పు గ్రహించిన శేషగిరి ఆ కాలరు వదిలేసి, తన కాలరు పట్టుకున్నాడు. నరసింహం, ఆలోచనలో పడిపోయి సిగరెట్టు ముట్టించాడు. ఐదు సిగరెట్లు కాలం ఆలోచించాడు.

''ఆ—ఓ అయిదు రూపాయలిస్తే నీకు ఆ లక్ష్మీదేవి అర్ధాంగి అయ్యేలా చేస్తాను'' అన్నాడు ఆరో సిగరెట్టు అంటిస్తూ. ఆ మాట వింటూనే శేషగిరి పాదాక్రాంతుడై, ''బాబ్బాబు, ఆ పని కనక చేస్తే నీకు మంచి బట్టలు పెడ్తాను. ప్రస్తుతం మాత్రం నా దగ్గర అయిదు లేదు. ఈ రెండూ ఉనుకట్టుకో'' అంటూ జేబులోంచి రెండు రూపాయలు తీసి అందిచ్చాడు.

"ముఖంచూడు—మళ్ళీ లక్ష్మాధికారివి, అంద మైనపిల్లతో వివాహం కుదర్చబోతుంటే రెండు రూపాయలు బజాణా యిస్తావ్రా" అంటూ నరసింహం విసుక్కున్నాడు.

"బాబ్బాబు. ఈ వారంలోపు కట్టేస్తా" అన్నాడు శేషగిరి.

"ఆ—అయితే—మీ మందారం—అదే లక్ష్మీ దేవిని ఈ క్షణంనుంచీ 'జాకో బాసన' అని పిలు" అన్నాడు నరసింహం.

"జాకోబాసనా!—అదేవి(ట్రా" అంటూ శేష గిరి చటుక్కునలేచి నిలబడ్డాడు.

"అది తర్వాత చెప్తా—ఎదురు ప్రశ్నలు వెయ్యక చెప్పినట్టు చెయ్యి" అన్నాడు నరసింహం.

* * *

అదే, నాటి కాలేజీలో శేషగిరి నోరు తడారి, శోష వచ్చేదాకా 'జాకో బాసన' నామపఠనం చేశాడు. ఫలితం పూర్ణానుస్వారం అయినందువల్ల ఆ సంగతి ఇంటర్వెల్లులో నరసింహానికి నివేదించాడు. నరసింహం అర సిగరెట్టుకాలం ఆలోచించి, "నడు" అంటూ సైకిలుషెడ్డుకేసి పరిగెత్తాడు. శేషగిరి కూడా పోద్దాడు. ఆ పక్కనే వేరే వసూళ్ళు చూసు కుంటున్న పాపారావు వెంటవద్దాడు. ముగ్గురూ సైకిలుషెడ్డు చేరారు. నరసింహం మరో సిగ రెట్టు కాల్చ నారంభించాడు.

మొదటి గంట కొట్టారు.

రణగొణ ధ్వని బయలు దేరింది. జనం గుంపులు, గుంపులుగా క్లాసుకు బయలుదేరారు. గరల్సురూము లోంచి గుంపులు బయటికి వచ్చాయి. లక్ష్మీదేవి పరివారంగా బయలుదేరింది.

"రెడీ" అన్నాడు నరసింహం సిగరెట్టు పారేస్తూ.

పరివారం దగ్గిర వడుతోంది. పడంది. గమ్మున నరసింహం వికటాట్టహాసం చేస్తూ, "హరి శేషగిరీ—ఈ కాకినాడనుంచి వచ్చినమ్మాయికి జాకో బాసన అని ఎంత చక్కని పేరు పెట్టావురా—" అంటూ శేషగిరి భుజం విరిగి ముక్కలయ్యేలా కొట్టాడు. శేషగిరి ఆశ్చర్యంతో రెపరెపలాడాడు. ఆ పేరు పొద్దున్నుంచీ ఓ మాదిరిగా వినడంవల్ల లక్ష్మీదేవికి తననిగురించి అన్న అనుమానం ధ్రువపడింది. పరివారం వెనక్కిచూసి, ఆమెకేసి చూశారు. కాకినాడ లక్ష్మి తలవంచుకుంది. బృందం నడిచి వెళ్ళిపోయింది. "ఆఁ ఫరవాలే"అన్నాడు. నరసింహం. అదేనాటి సాయంత్రం నరసింహం మరో కొన్ని విషయాలు చెప్పి, "వెర్రి వెధవాయ్! ప్రయివేటులో ఆ పిల్ల నిన్ను బల్లి అన్నప్పుడే అను, యాగీ మాత్రం చెయ్యకు పాపం" అన్నాడు. శేషగిరి తల ఆడించాడు.

ఆ మర్నాడు రివాజు వేళకి ప్రయివేటుకి వెళ్లే సరికల్లా లక్ష్మీదేవితల్లి వీథి గుమ్మంలో ఎదురు అయ్యింది. వెంటనే 'నమస్కారం అత్తయ్యగారూ' అనేద్దామనుకుని, బాగుండదులే అని అట్టే పూరు కున్నాడు శేషగిరి. ఆవిడే పలకరించింది.

"నాయినా, అల్లి కూరలవాణ్ణి కుంచెం యిలా కేకేయగలవా" అందావిడ.

ఆనందంతో శేషగిరి దిగ్విజ పరిగెట్టుకెళ్ళి,

# జాకో బాసన
# ప్రేమోపాసన

కూరలవాణ్ణి పిలిచి, పట్టుకొచ్చి, వంకాయలు బేరం చేసి, పుచ్చులు ఏరి మరీ సహాయం చేశాడు.

మరోనాటి ప్రాతఃకాలసమయంలో ప్రయివేటు కని వచ్చి, అంతకన్నా అలవాటు చొప్పున అవతలి వాటాకేసి చూస్తూ, నడుస్తున్న శేషగిరి కాలికి ఏదో తగిలింది. "ఏస్టి" అని వంగి చూశాడు.

"లక్ష్మీదేవి తమ్ముడు!"

"బ్రాబే—నా నోము ఫలం" అనుకున్నాడు వెంటనే. ఆ పిల్లాడు వీలైనంతమట్టిని తిని, మిగ తాది వళ్ళో దాచుకుని, నవ్వుకుంటున్నాడు. చప్పున శేషగిరి బుర్ర మెరిసింది. "యాయ్—బెబ్బే—తూతూతూ" అని అరుస్తూ, పిల్లాడిమీదున్న మట్టిని, దులిపి, అతన్ని ఎత్తుకున్నాడు. కుర్రాడు జాపురుమన్నాడు. అది విని పిల్లాడితల్లి యివతల

"అవును నాకు డబ్బు ఖర్చు పెట్టడమంటే ఇష్టమేనని ఒప్పు కుంటాను! కాని నేను చేసే దుబారా ఇంకొక్కటి చెప్పండి!" అన్నది రామారావుగారి భార్య కోపంగా.

ఎ. ఇ. శర్మ (కోలవెకుంట్ల)

కొచ్చి, "ఏవయ్యింది నాయినా" అంది. శేషగిరి బుర్ర చురుగ్గా పని చేసింది.

"చూడండి! మన బాబు! నే నొచ్చేసరికల్లా రోకలిబండను నోట్లో పెట్టుకోబోతున్నాడు. సమ యానికొచ్చాను గాబట్టి సరిపోయింది. ఆ రోకలి బండను బైట పారేశాననుకోండి—అది వేరే విషయం' అన్నాడు దూరం ఆలోచించి. పిల్లాడి తల్లి బోలెడు ఆనందించి, "బాబోయ్! సమయానికి దేవుళ్ళా వచ్చావు గాబట్టి సరిపోయిందికాని—లేకపోతే పిల్లాడిపాటికి ఏమయ్యేవాడో—నాయిన్నాయినా— వాణ్ణి కొంచెం అలా అరుగుమీద కూర్చోపెడుదూ— నాది మడిబట్ట" అందావిడ. శేషగిరి దూరం ఆలోచించి, "ఎబ్బే—సావిట్లో కూర్చోపెడ్తాను. అరుగుమీద అయితే—కింద పడిపోవచ్చు" అంటూ ఆవిడ ననుసరించి లోపలికి వెళ్ళాడు.

"అలా కూర్చోపెట్టు నాయినా" అందావిడ.

శేషగిరి కుర్రాణ్ణి దించి, చుట్టూచూసి, "చ్చ్" అనుకుని, బయటికి వచ్చేసరికి నేలమీద లక్కపిడత కనబడింది. అది పుచ్చుకుని, ద్విగుణో త్సాహంతో—మళ్ళీ లోపలి కెళ్ళాడు. ఈసారి కుర్రాడు వంటరిగాలేడు. వాళ్ళక్క పక్కనున్నాడు! శేషగిరి గుండె దడదడలాడింది. లక్ష్మీదేవి చంగున లేచి, నించుంది. "లక్కపిడత" అంటూ శేషగిరి—

దాన్ని నేలమీదపెట్టి కుమ్మంకేసి రెండడుగులు వేశాడు.

"బల్లి" అంది లక్ష్మీదేవి చిన్నగా నవ్వుకుంటూ. శేషగిరి క్రాపులో వెంట్రుకలన్నీ కోపంతో నిల బడ్డాయి. "జాకో బాసన—జాకోబాసన" అన్నాడు ధైర్యంచేసి. లక్ష్మీదేవి ముఖం లక్కపిడతంత అయిపోయింది. ఇంకోసారి కూడా 'జాకో బాసన' అనేసి, యింతలో యింటావిడ రావడంతో విత ముడ్చై వెళ్ళిపోయాడు.

* * *

మరోనాటి వుదయం ప్రయివేటుకి వెళ్ళాక, పక్కింటి పిన్నిగారి—కాదు—అత్తయ్యగారి కొడుక్కి కుంచెం అనారోగ్యం చేసినట్టు తెలిసింది. ఆనాడు లక్ష్మీదేవి ప్రయివేటుకి రాలేదు. శేషగిరి మనస్సు అయినవాణ్ణి వదిలేసి, అవతలివాటాలోకి పరు గెట్టింది. ప్రయివేటు పూర్తిఅయ్యాక, తన మన స్సునూ, దాంతోపాటు మరో మనస్సునూ జమిలిగా తెచ్చుకుందామన్న సదుద్దేశంతో పక్కవాటాలో కెళ్ళాడు. సావిట్లో ఎవ్వరూలేరు. చిన్నగా దగ్గాడు. "హుచ్చ్వాచ్చి" అని తుమ్మాడు. ఆనక బూటుకాలు శబ్దంచేసి, తప్పు గ్రహించి, చప్పున బయటికెళ్ళి బూట్లు వదిలేసి, లోపల కొచ్చాడు. ఇంటావిడ యివతల కొచ్చింది.

"అదే—మన బాబుకి వంట్లో బాగుండలేదట్టో" అన్నాడు శేషగిరి చప్పున. "మరే నాయినా" అందా విడ శేషగిరిని ఆహ్వానిస్తూ. ఇంటావిడతో శేషగిరి పక్కగావున్న రూములోకి ప్రవేశించాడు. ఆ గదిలో కిటికీ వార వేసిన మంచంమీద 'బాబు' వున్నాడు. మంచం పక్కన కుర్చీ—కుర్చీమీద......"హ" అను కున్నాడు శేషగిరి. శేషగిరి రాకనుచూసి, ఆమె చప్పున లేచి నించుంది.

"హార్రె—కుర్రాడికి చలిగాలికాదూ" అంటూ శేషగిరి గమ్మున కిటికీకింద రెక్కలు వేశేశాడు. ఇంటావిడ శేషగిరి తెలివికి అబ్బురపడింది. "కూర్చో నాయినా" అంది. నాయన కూర్చున్నాడు. కాస్సేపు యోగ, క్షేమ రామాయణాలు మాట్లాడి హాయిగా, శలవు తీసుకుని, రూముకు చేరుకుని కులాసాగా ఆనందించాడు.

* * *

శేషగిరి అదృష్టంకొద్దీ ఆ 'బాబు'కి జ్వరం వో వారం వుంది. ఈవారం శేషగిరి బాహాటంగా నాళ్ళిం టికివెళ్ళి అలవాటు చేసుకున్నాడు.

మరోవాడు ఆదివారం అన్న విచక్షణాజ్ఞానం లేకుండా శేషగిరి ప్రయివేటు మేస్టారి పక్కింటికి వెళ్ళాడు. అరుగుమీద కూర్చుని, పేపరు చదువు తున్న ఒకాయన, "ఎవరు కావాలి—వూ" అన్నాడు. శేషగిరి గుండె టకటకలాడుతూ, "మావగారు కాలోలు" అంది. ఈలోగా ఆయన మరోసారి అదే ప్రశ్నవేసి, కళ్ళజోడు తీసి చూశాడు. 'పారి పోతేనో' అనుకున్నాడు శేషగిరి. ఇంతలో ఆపద్బాంధ విలా యింటావిడ వచ్చింది. వస్తూనే, "రావోయ్! అలా నించున్నావేమిటి" అంటూ ఆహ్వానించి, శేష గిరిని ఆయనకి పరిచయం చేసింది. కబుర్లు రాజు కున్నాయి.

"ఆహా—మీ నాన్నగారి పేరేవిటన్నావ్" అన్నా డాయన. శేషగిరి పేరు చెప్పాడు.

"ఏం ఏవన్నావ్"

పని కూడా చెప్పాడు.

"ఏవూరన్నావ్"

అదీ చెప్పాడు.

"ఆహా. . . . ." అన్నాడాయన తల పంకిస్తూ.

"అయితే—మల్లప్రాజుగారు మీ కేవవుతారు" అంది యింటావిడ. శేషగిరి అదీ చెప్పాడు.

"హా—అలాగా" అంటూ ఆవిడ భర్తకేసి తిరిగి, "విన్నారూ—మీకు గుర్తుందా మల్లప్రాజుగారు ఆ— అలా చూస్తారేవండి—మీసాల మల్లపు రాజండి—ఆయన—గుర్తుందా. ఆ—ఆయన పెద్ద అల్లుడు బుల్లిరాజుగారు—మా మేనమామకి సాక్షాత్తూ ఒక వేలు విడిచిన మేనత్త కొడుకు" అని, మళ్ళీ శేషగిరికేసి చూస్తూ, "అలాగా, చెప్పావుకాదు. మనం మనం కావాల్సినవాళ్ళం" అంది. చుట్టరికానికి బెంబేలయిపోయిన శేషగిరి, గుండె నిబ్బరం చేసుకుని, "హి" అని సకిలించి, "నాక్కావల్సిందీ అదేగా" అనుకున్నాడు. పక్కగదిలోంచి కునంన్కున్న ఆడ నవ్వు వినపడింది.

అలా అలా కబుర్లు ప్రారంభమయ్యి పదకొండును చేరాయి.

"భోంచేసి వెళుదువుగానిలే" అందింటావిడ 'వెళ్తానండి' అని లేచిన శేషగిర్ని వుద్దేశించి.

"పరవాలేదులే. ఆలస్యం ఎలాగా అయ్యిందిగా" అన్నారింటాయన. తత్ఫలితంగా భోంచేసి, శేషగిరి మిట్టమధ్యాహ్నానికల్లా రూముకు చేరి సాయంత్రందాకా ఆనందించాడు.

* * *

ఆనాటినుంచీ మరింత చనువుగా లక్ష్మీదేవీ వాళ్ళింటికి వెళ్ళడం అలవాటు చేసుకుని, అంత కన్నా విరివిగా ఆమెను 'జాకో బాసన' అనడం అలవర్చుకున్నాడు.

మొదట్లో ఏదోలే అనుకుని వూరుకున్నా, లక్ష్మీదేవికి జాకో బాసనంటే ఏవిటో తెలుసుకోవాలని కుతూహలం పుట్టి, అది పెరిగి పెద్దదై, కోర్కెపాటి లావయ్యింది. ఒకనాడు యింటికి వచ్చిన శేషగిరిని అదే విషయం "అడుగుదాం, అడిగేద్దాం" అనుకుంటూ ఆమె సావిట్లోకి వచ్చింది. శేషగిరి తలెత్తిచూసి, "ఏం జాకో బాసనా, ఏవి కథ" అనేసి, చప్పున తనదృష్టి కుర్రాడివైపు తిప్పేశాడు. కుర్రాడు నవ్వేశాడు.

"హన్న జాకోబా. . . ."

"భల్లే" అంది లక్ష్మీదేవి కసిగా.

"భల్లేటల—బల్లే—చ్ఛ జాకో బాసనంటే—ఆ పేరులో ఎంత యిది వుంది" అన్నాడు శేషగిరి స్వగతంగా, ఆ యిది ఏవిటో తనకే తెలియక. లక్ష్మీదేవి చిన్నపుచ్చుకుంది. వచ్చిన పని గుర్తు తెచ్చుకుంది. ఆనక గొంతు సవరించుకుంది.

"అలా నన్ను ఏడిపిస్తే మీకేం వస్తుంది" అంది.

అనుకోని సంఘటనకు శేషగిరికి పలకమారింది. నెత్తిమీద దబదబా బాదుకున్నాడు. కాని, మళక్కి తుడవడంవల్ల వెంటనే తేరుకుంటూ, "నన్ను — ఇల్లి అంటే మీకేం వస్తుంది—నేమా ఏడవగలను"

అనేశాడు. అంతమూడ్‌లోనూ లక్ష్మీదేవి నవ్వేసింది. "బాగుంది" అనుకున్నాడు శేషగిరి.

"నాది తప్పే" అందామె రాజీ కొస్తూ.

"నాదీ తప్పే" అనేశాడు శేషగిరి.

ఓ నిముషం పావు నిశ్శబ్దం.

"జాకోబాసనంటే ఏవిటో చెప్పరూ" అందామె.

"నాకు తెలీ—హ్హా నే జెప్పన్" అన్నాడు శేషగిరి తప్పు దిద్దుకుంటూ.

ఇంతలో యింటావిడ కాఫీ పట్టుకొచ్చియిస్తూ, "తాగు నాయినా" అనేసి వెళ్ళిపోయింది. పక్క గదిలోకి వెళ్ళిపోయిన లక్ష్మీదేవి మళ్ళీ యివతలకొస్తూ "చెప్పరా" అంది. శేషగిరి ఆనందంతో మొగ్గలు వేశాడు.

"చెప్తే నాకేవిస్తారు?" అన్నాడు. లక్ష్మీదేవి సిగ్గుతో మెలమెల్లాడిపోయింది. ఇంతలో యింటావిడ మళ్ళీ వస్తూ,"కాఫీలో పంచదార చాలిం..ఆరే ఇంకా తాగలేదటోయ్. ఏదిలాతే—మళ్ళా వేడిచేసి యిస్తా" అని గ్లాసు పట్టుకెళ్ళిపోయింది.

* * *

ఆనాటి సాయంత్రం నరసింహాన్ని శేషగిరి వాటేసుకుని, "బాబ్బాబు, జాకో బాసనంటే ఏవిటో చెప్పు—నా పరువుపోతోంది" అన్నాడు. నరసింహం క్షణం ఆలోచించి, పరిస్థితుల గతులన్నీ ఆకళింపు చేసుకుని, తల పంకించాడు.

"సుముహూర్తం సమీపిస్తోంది. అది వేరే సంగతి. ముందు పాత బాకీ అయిదూ—ఇప్పుడు అక్కరానికి రూపాయీ కలిపి పది హేనూ, అంటే రెండు పది రూపాయల నోట్లు యివ్వు" అన్నాడు.

"చవ్‌— ఏవిటా వేలంపాట. లెక్కలు బొత్తిగా రావా నీకు. పాత బాకీ మూడూ, యిది అయిదు కలిసి ఎనిమిది అవుతాయి. పది తీసుకో నాకు చెప్పు" అంటూ శేషగిరి పది రూపాయలు యిస్తూ, నరసింహం గెడ్డం పట్టుకున్నాడు.

"ప్రేమికులకు యిథో లెక్క. అందులో వరించిన ఆమెను వివాహం మాడబోతున్నావ్" అంటూ అసలు రహస్యం చెప్పేశాడు.

"హర్రీ—యిదా" అంటూ శేషగిరి తన ఆశ్చర్యాన్ని నరసింహం నడ్డిమీద చూపించాడు.

"తన్నుకి రూపాయి అవుతుంది" అన్నాడు నరసింహం నడుంవంచి. శేషగిరి ఆశ్చె వుండిపోయాడు.

* * *

"చెప్తే చెప్పారు. లేకపోతే మా గడప తొక్కద్దు" అంది లక్ష్మీదేవి పంతంగా.

"నేను తొక్కుతాను. మా మల్లపురాజుగారి అల్లుడు మీ అమ్మగారి మేనల్లుడికి. . . . ."

లక్ష్మీదేవి ఫక్కున నవ్వేసింది.

"హత్తెరీ—నే చెప్పను.చెప్తే—నాకేం యిస్తారు" అన్నాడు శేషగిరి ద్విగుణీకృత వుత్సాహంతో. లక్ష్మీదేవికి సిగ్గు ముంచుకొచ్చి, ఏమీ మాట్లాడలేక, సిగ్గు అభినయించి, వోణీ చెంగు నోట్లో పెట్టుకుని, తర్వాత వేలుకు చుట్టుకునీ, సిగ్గును విరూపించి, నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

* * *

లక్ష్మీదేవి తండ్రి — దశరథరామయ్యగారు ఓ మాదిరి స్థితిపరుడైనా ఆర్థికశాస్త్రం బాగా చదవడంవల్ల ఖర్చువంతుడుకాడు. పైగా దూరదృష్టి కలవాడు. దాన్ని పోగొట్టడానికి డాక్టరు సలహా యిచ్చాడు. కాని, కళ్ళజోడు కొని పెట్టుకున్నా దూరదృష్టి పోలేదు సరికదా, యిటీవల అది ఎక్కువయ్యింది కూడా. ఆయన దానికేవీ చింతించలేదు. రెండురెళ్ళ నాలుగు" అనే లెక్కలు ఆయనకు బాగా తెలుసు.

* * *

కొన్ని రోజులు దొర్లి, ఒకరోజు అడ్డురావడంతో ఆగిపోయాయి. ఆరోజు "మేం వస్తున్నాం" అంటూ శేషగిరి తండ్రివద్దనుంచి ఓ టెలిగ్రాం వచ్చింది.

రానే వచ్చారు.

శేషగిరికి ఎందుకొచ్చారో అర్థంకాక, అడగలేక వూరుకున్నాడు. సాయంత్రం అయ్యింది.

"ఏరా చదువెలా సాగుతోంది" అన్నారాయన.

శేషగిరి వినయ విధేయతలతో, "బానే" అన్నాడు.

"ఆహా" అని, ఆయన, "దశరథ రామారావుగారి యిల్లెక్కడరా" అన్నారు. శేషగిరి వులిక్కిపడ్డాడు. "ఆయన మొన్న మనింటి కొచ్చారులే" అన్నాడాయన.

"ఆ పిల్ల—అదే. వాళ్ళకి అమ్మాయి వుందట. చూద్దామని వచ్చాం. రా—నిన్నూ చూసినట్టు వుంటుంది, అదీ అవుతుందని" అంది శేషగిరి తల్లి.

"హతేభుతం" అని లోపల అనుకోబోయి, పైకే అనేశాడు శేషగిరి. వెనువెంట కుక్కిన పేనులా సిగ్గుతో ఒరిగిపోయాడు.

"వెర్రి బాగుల వెధవ" అనుకుంది యిల్లాలు.

"ప్రయోజకుడయ్యాడు" అనుకున్నా రాయన.

* * *

దరిమిలాను, పెళ్ళి చూపులయ్యాయి. తాంబూలాలు, పుచ్చుకున్నారు. ముహూర్తం పెట్టించారు. రోజులు దొర్లి ముహూర్తంరోజు దగ్గిర కొచ్చింది. ముహూర్తం వచ్చింది.

"పెళ్ళన పెళ్ళయిపోయింది."

"హానందం" అనుకున్నారు నరసింహ, పాపారావులు కొత్త బట్టలు చూసుకుని.

* * *

"జాకోబాసనంటే యిప్పుడు చెప్పకుండా, ఎలా తప్పించుకుంటారు?" అంటూ లక్ష్మీదేవి శేషగిరి కాలరు సాగదీసింది. "జన్మ తరించింది" అనుకున్నాడు శేషగిరి. వెనువెంట, "పి కిష్టవయిన తినే చెట్లు పేర్లు చెప్పు" అన్నాడు నవ్వుతూ, ఆమె చెప్పింది.

"అన్నిటి మొదటక్షరాలూ కలుపుకుంటే— జాకోబాసన వస్తుంది జాకోబాసనా—" అని, "దీర్ఘాలు సమయోచితాలు" అన్నాడు. లక్ష్మీదేవి ఆశ్చర్యపోయింది. ఆశ్చర్యంనుంచి తేరుకుంటూ, "హలాగాండి, బల్లిగారూ" అంటూ పారిపోబోయి, శేషగిరి చేతిలో చిక్కిన తన జడకోసం ఆగిపోయింది.

జడ వూడిరాకుండా మనిషే దగ్గిరకు వచ్చినందువల్ల, "హా—నిర్భుం జడ" అనుకున్నాడు శేషగిరి. లక్ష్మీదేవినవ్వుతూ—"ఏవండీ—బ. . . . ."అంది.

"ఆ—ఏవండీ జాకో బాసనగారూ" అన్నాడతను ఆమెను దగ్గరగా తీసుకుంటూ. ఇద్దరూ కిలకిల్లాడారు.

గగనాన్న నెలరేడు గగనం చాటుకుపోయాడు.★

# కవిసార్వభౌముడు

23-వ పేజీ తరువాయి

పరివారకులు వినయవిధేయతలతో ఆయన సన్నిధికి కొనిపోయిరి.

డిండిము డంతకుముందే, మధ్యాహ్న విశ్రాంతి చాలించి లేచి వచ్చి, గోష్ఠీశాలలో తనముందు వ్యాసపీఠమున గ్రంథముంచుకొని విప్పబోవుచుండెను. వచ్చినవారిని చూడగానే ఆయన మర్యాదచేసి చక్కని రత్నకంబళముపై కూర్చుండజేసి ఆదరముతో 'మీ దేయూ'రని ప్రశ్నించెను.

నృసింహభట్టు కొంచెము వడకుచున్న కంఠముతో "కొండవీడు" అనెను.

ఈ వేషములో శ్రీనాథుని జూడనందున శ్రీనాథుడే తన దర్శనమునకై వచ్చెనని భావించి డిండిమభట్టు వికసించిన వదనముతో "మీ నామధేయము శ్రీనాథులా?" యని ప్రశ్నించెను.

"కాదు. నృసింహభట్టు."

"ఏమి పనిమీద దయచేసినారు?"

"ఏదో వ్యాకరణశాస్త్రము కొంత అధ్యయనము చేసితిని. ఏదో కొంత కవిత్వము కూడ చెప్పెదను. విద్వత్కవీశ్వరులగు తమ దర్శనార్థము వచ్చితిమి."

"మీ రాజ్యములో మహాభాష్యము అధ్యయనము చేసిన విద్వాంసులెవరైన నున్నారా?"

నృసింహభట్టు : "ఇప్పు డెక్కువమంది లేరు. ఇప్పటి కొండవీటిరాజ్యములో నూటయేబది మందియే ఈ మధ్య లెక్కవేయగా తేలిరి!

డిండిముడు నమ్మజాలక కన్నులు పెద్దవిచేసి కొంచెము తలయెత్తి, "అంత మంది యున్నారా?— మీ రెంతవరకు అధ్యయనము చేసితిరి?" అనెను.

"ఆ, ఎంత? నేనూ వారిలోని వాడనే."

"మీకు ఉపశ్రుతిలో ప్రవేశమున్నదా?"

నృ. భ. : "పెద్దల ఆశీర్వచనముచేత నా భాగ్యవశమున, తీయకుండ పదిమంది శిష్యులైనా ఇంతవరకు చెప్పుకొనుచున్నారు. మరపు రాలేదు."

డిండిమభట్టారకునకు విశ్వాసము కలుగక, ఆపైన సంభాషణము సంస్కృతభాషలో నారంభించి, వ్యాకరణశాస్త్రములో సూక్ష్మ విషయములపై ప్రసరింపజేసెను. నృసింహభట్టును అట్లే చేసెను. సందర్భవశముగా ప్రశంసలు చేయుచున్నట్లే, వారిద్దరు సగర్వముగా ఒకరి నొకరు పరీక్షించుకొనిరి. తుదకు డిండిముడు తృప్తిపడి, "సంతోషమైనది. మీ రేమి కావ్యములు రచించితిరి" అని, కాదంబరీనాటకమునుండి కొన్ని ఘట్టములు వినిపించుకొనెను.

డిండిమభట్టు అనుగ్రహబుద్ధితో నృసింహుని కవిత్వము బాగున్నదని శ్లాఘించి, "మా దర్శనమునకు మీబోటి కవిపండితులు వచ్చినందుకు సంతోషము. మాతో స్పర్థపెట్టుకొని శ్రీనాథుడను శ్రోత్రి కొండవీటినుండి వచ్చినాడట. ఆయనను ఎరుగుదురా?" అని ప్రశ్నించెను.

"ఎరుగకేమి! వారే తమ దర్శనమునకై తన బావమరదియైన ఈ కుఱ్ఱవానిని తోడిచ్చి పంపినారు."

అంతవరకు కనబరచిన ఆదరము పోయి, ఆ మాటలు వినగానే డిండిమభట్టు ముఖము చిట్లించి, "మావద్దకా, ఏమి పనిమీద?" అని గర్జించెను.

నృ. భ : "చిత్తము. వారు మాసపోల్లాసమని క్రొత్తగా సంస్కృతకావ్యము వ్రాసినారు. తమరి అభిప్రాయ మర్థించుచు, దాని ప్రతిని ఈ పత్రముతో పంపినారు."

కవులు తమ కావ్యములను అభిప్రాయార్థము స్వయముగావచ్చి వినిపించుటేకాని, ఇట్లింకొకరి కిచ్చి పంపుట డిండిము డెరుగడు. అందుచేత చిరాకు ఎక్కువై ఇట్లనెను: "ఈమధ్య తప్పులతడక కావ్యమొకటి బాలకవులకు వినిపించినాడని విన్నాము. అదేనా, ఇది?"

"ఆ బాలకవుల మాటల కేమిగాని, తమరుకూడ చిత్తగించండి!"

ఆ మాటలచే అది కొంచెము వినవలెనని డిండిమభట్టుకు కోరిక కలిగి, కొన్నిభాగములు వినిపింపుమనెను. గోష్ఠిలో శ్రీనాథుడు వినిపించినట్లు, సంగీతమిశ్రముగా నృసింహభట్టు కొన్ని శ్లోకములు వినిపించెను. అలవోకగా డిండిము డాలకించి వికృతముగా నవ్వుచు, "నృసింహభట్టా, మీబోటి పండితులకు ఇటువంటి తప్పుల తడకను తెచ్చుట అగౌరవముగా తోచలేదా?" అనెను.

నృసింహభట్టు ఆవేగము డచుకొనుచు, వినయముతో, "ఇది వారి ప్రథమ సంస్కృతకృతికదా! లోపము లేమైనా నున్నచో చూపిన సరిచేసుకొందునని తమకు మనవిచేయుమని చెప్పి పంపిరి. తమరు గ్రంథము తీరికగా చిత్తగించి అభిప్రాయమిప్పింపుడు. మరల వారమునాటికి తమ దర్శనార్థము వత్తుము" అని గ్రంథము డిండిమునిచేతి కిచ్చెను. డిండిముడు విసుగులో దుగ్గనను పిలిచి, కోశ పంచయములున్న దారుఫలకములలో నొకదానినిజూపి దాని నక్కడ పెట్టించెను.

శ్రీనాథున కిప్పుడేమియు పనిలేదు. డిండిముని జవాబుకు వారమురోజులు గడువున్నది. ఈమధ్య తానేమి చేయవలె! అంతరంగములో డిండిముని యుత్తరమునకై ఆరాటమున్నది. అసలు వచ్చునా, రాదా? ఏమని వచ్చును? ఎట్లు వచ్చిన తానేమి చేయవలె? రాకున్న నేమి చేయవలె? ఆ సాయంకాల మాతడిట్లు మథనపడ నారంభించెను. అర్థరాత్రమున మెలకువవచ్చి ఆలోచనలతో నిద్దుర పట్టలేదు. మరునాటి యుదయమున నతడు చిరాకుపడసాగెను. శ్రీదేవి వెంటనే గ్రహించి యిట్లు చెప్పెను.

"వృథా మథనవలన శక్తి క్షీణించును. ప్రొద్దుపోవుటకై విద్యానగరము నాలుగుమూలల చూచిరండి. శ్రీ గురువుల పాదసేవచేసిరండు. శ్రీ విరూపాక్ష స్వామిని సేవించండి. పెద్దలను చూచిరండి. బలవంతులతో మైత్రి చేయండి—ఏదో ఒక వ్యాసంగము పెట్టుకోండి!"

శ్రీనాథున కామె మాచన వచ్చినది. ఒకనాడాతడు శ్రీ శంకరానందభారతీస్వాముల చరణసన్నిధి కరిగి, వందన మాచరించెను. శ్రీవిరూపాక్షస్వామి నర్చించెను. లింగవచయనులను దర్శించి ఆయన యిష్టులు సరిగా జరుగుచున్నవిగదాయని ప్రశ్నించి, యజ్ఞయాగాదిక గోష్ఠితో ప్రొద్దుపుచ్చి వచ్చెను. సంపన్న నాగరకవేషము ధరించి అశ్వారూఢుడై శ్రీ విద్యానగర రాజవీధులలో నిరంతర భ్రమణ మొనర్చుచు, చూడదగిన వింతలు చూచుచు, నానాదేశాగతులగు స్త్రీ పురుషులను, వారి వేష భాషలను చేష్టలను గమనించుచుండెను. నగరమందలి దేవాయతనములను దర్శించుచు, దేవరాయల సేనా విన్యాసములను తిలకించుచు, నగర ప్రాకారాదుల బలాబలాదుల పరీక్షించుచు తిరుగసాగెను. ఒకనాడు తుంగభద్రానదిని సంతెనమీద దాటి ఆనెగొందివరకు పోయిపంపా సరోవరమును ఋష్యమూకాద్రిని అక్కడి గోష్ఠములను అంజనాద్రిని చూచివచ్చెను. ముమ్మకవి యింటి చాయలకు గూడ పోకుండ తప్పించెను.

అతనివెంట తరుచుగా నెవరో ఒకరు నృసింహభట్టో, దుగ్గనయో, పోతనయో అనుసరించుచుండిరి. ఎన్నడూ ఒక్కరివికంటె నెక్కువ తీసికొని పోలేదు. అతనిని రాత్రింబవళ్లు పసికట్టుచున్న రక్షకభటులు మాత్రము ఒకరో యిద్దరో, తప్పక అతని ననుసరించుచు, పై యధికారులకు ఏనాటి సమాచార మానా డందించుచుండిరి. ముఖ్యముగా రాజప్రాసాద సమీపమునను, ప్రాకార రేఖల ప్రాంతములను, అతని సంచారము లెక్కువైనకొలది రాజభటుల సంశయమును ఎక్కువైనది. వారి గునగునలవలన తాను గూఢచారుడను నిశ్చయభావము వారికి కలిగినదని యాతడు గమనించెను. అది తుంచివేయక సాగనిచ్చినచో, తన్ను నిశ్శంకముగా రాజపురుషులు బంధింప నాజ్ఞాపింతురు. రాజద్రోహులని సందేహము కలిగినమాత్రముననే కఠినబుద్ధి వహింతురుగదా! తాను తలపెట్టిన కార్యము సాధించుట దుర్ఘటమగును. తానట్టి ప్రమాదావస్థలో పడకుండ వెంటనే జాగ్రత్తపడవలెను.

శ్రీనాథుడు తీవ్రముగా నాలోచించి వెంటనే కటకపాలుని దర్శింప నిశ్చయించెను. అతడు సాహిత్యాభిమానియు, కవి పండిత పక్షపాతియనియు, ఉద్యోగధర్మ నిర్వహణములో ఎంత సునిశితకఠినుడో తక్కిన విషయములలో నంత సరసుడని సహృదయుడని కర్ణాకర్ణిగా తెలియవచ్చినది. రక్షకభటుల నడిగి కటకపాలుని ఊరు పేరు వంశాదికములు స్వభావాదికములు తెలిసికొనెను. తాను వారిని దర్శించుటకు యోగ్యమగువేళ యేదోకూడ విచారించెను. ఉదయమున ఆరు గడియల ప్రొద్దెక్కినప్పటినుండి పదిగడియల ప్రొద్దువరకు దర్శింపవచ్చునని వారెరిగించిరి. అంతేకాదు. "కటకపాలురే మిమ్ము చూడవలె ననుకొనుచున్నా'రని కూడ వారు తెలిపిరి:

డిండిములకు పత్రిక పంపి సరిగా వారము రోజులైనది. ఈరోజే వారి యభిప్రాయము తెలిసికొనవలసియున్నది. ఆనాటి యుదయమున ఐదు గడియలు ప్రొద్దెక్కినదని శ్రీ గురువుల దివాణములో గడియారము (గడియలు తెల్పు ఘంటలు కొట్టు ప్రదేశము—ఘటికాగారము.) నుండి ఘంటా ఘణాత్కారములు వినబడువేళకే శ్రీనాథుడుముస్తాబై యుండెను. ఈనాడు మిక్కిలివిలువగల వేషము ధరించెను. కట్టిన ధోవతి బంగారుజరీతో నిండియుండెను. కూర్పాసము దట్టమైన మెత్తని కౌశేయములో చేయబడి జరీకుట్టుచిత్రములతో ధగధగలాడుచుండెను. నడుమున చుట్టిన కోకకు రత్నములు



పొదిగియుండెను. మెడలో తారహారములేకాక, రత్న హారముకూడ వేసికొనెను. చేతుల సింహతలాటములు, దండల కడియములు ధరించెను. చెవుల పచ్చలకుండలములు మెరయుచుండెను. నొసట కస్తూరిబొట్టు పరిమళించుచున్నది. శిరస్సుపై నవరత్నములు పొదిగిన కలికితురాయిగల కుచ్చుల కుళ్లాయి పెట్టుకొనెను. పైని ఎర్రని కాశ్మీర శాలువ వేసెను. శ్రీనాథు డీ వేషముతో ఐదవ ఘంటానాదము మ్రోగుచుండగానే అశ్వారూఢు డయ్యెను. ఆ యశ్వము చీనా పట్టాంశుకముతో నలంకృతమై యుండెను. ఆతడు కటకపాలుని మందిరమునకు దారితీయుమన్నంతనే, నగర రక్షకుడు భయ భక్తులతో దారి తీసెను.

కొండవీటి విడిదికి కటకపాలుని మందిర మెంతోదూరములేదు. తలారి గట్టుమీదనే మహా విస్తృత స్థానమున నదియుండెను. విలాసముగా, నెమ్మదిగా తన యశ్వమును నడిపించుకొనుచు ఆరు గడియలు కొట్టుచున్నవేళకు సరిగా నాత డక్కడికి చేరికొనెను. కటకపాలుని దర్శనార్థమై శ్రీనాథ భట్టు వచ్చియున్నాడని తెలిపినవెంటనే లోనికి రమ్మని యనుజ్ఞ వచ్చెను. వెళ్లుచునే శ్రీనాథ భట్టు మణికంకణవిరాజితమగు దక్షిణహస్తము నెత్తి కటకపాలుని నిట్లాశీర్వదించెను :

"ధాటీ ఘోటక రత్న ఘట్టన మిళ
ద్ద్రాఘిష్ఠ పల్యాణ ఘం
టా టంకార విలుంఠలుంఠన
మదోన్మత్తాహిత క్షోణి భృ
త్కోటీరాంకిత కుంభినీధర సమి
త్క్రూటాటవిఝాట, క
ర్ణాటాంధ్రాధిప, సాంపరాయని
తెలుంగా, నీకు బ్రహ్మాయువౌ!"

ఆ పద్యమును విన్నదే తడవుగా కటకపాలుడు నిలువున నిలుచుండిలేచివచ్చి వంగి శ్రీనాథుని రెండు పాదములు భక్తితోనంటి నమస్కరించి, సగౌరవముగా సుఖాసనాసీనునిగావించి ఆయన అనుమతితో తాను తన యాసనమున నాసీనుడయ్యెను.

కటకపాలుని పేరు తెలుగురాయడు, సాంపరాయని కుమారుడు. శ్రీ విద్యానగర రాజ్యములో ఉదయగిరి సీమ, పెనుగొండసీమ ఇత్యాది ప్రదేశములలో దుర్గాధిపత్యపదవి, మండలాధిపత్యమువంటి ఉన్నతోద్యోగములు నిర్వహించి, ఆతడు కొంతకాలము నుండి శ్రీవిద్యానగర కటకపాలక పదవి నధిష్ఠించి, శ్రీవిద్యానగర రాజ్య పక్షమున త్వరలో విజయయాత్రలు చేయుటకు రహస్యముగా సన్నాహములుచేయుచున్నాడు. ఆతడు కర్ణాటాంధ్ర మధ్యస్థ సంధి దేశములో జన్మించినందున, సంస్కృతముతోపాటు, ఆ రెండు భాషలయందును విశేషాదరము కలిగినవాడు. శ్రీనాథునియెడ ఒకవంక భక్తిప్రపత్తులు కలుగుచున్నను, తన చారులు తెచ్చిన వార్తలనుబట్టి మరియొకవంక గూఢచారుడేమో అను సందేహముగూడ హృదయాంతరమున వేధించుచుండెను. ఈనా డది తన సంభాషణములో ఉపాయముగా కొంతవరకైనా తేల్చుకొనదలచెను. భక్తిభావము కలిగించు మూర్తికల శ్రీనాథుడు వచ్చుచునే, తనకు సంగ్రామవిజయముతోబాటు దీర్ఘాయువు నాశీర్వదించుటచేత ముగ్ధుడై, తా నాతని మంచిమాటల వలలో పడిపోవుచున్నానాయని సందేహించుచుండెను. కుశలప్రశ్నాదికము కావించిన పిమ్మట శ్రీనాథుని యాశీర్వచనపద్యమును లీలా పరిహాసము చేయుచున్నవానివలెనే, "స్వామీ, మీ యాశీర్వచనముచే నే కృతార్థుడనైతిని. సరేగాని, అది యేమిభాష, కవీంద్రా?" అని చిరునవ్వుతో ప్రశ్నించెను.

శ్రీనాథుడు హేలగా మాటాడుచున్నట్లే ఈ పద్యము చదివెను.

"ప్రౌఢి బలికింప సంస్కృతభాషయంద్రు
పలుకు నుడికారమున నంధ్ర భాష యందు
రెవ్వరేమన్న నంద్రుడుగా కేమి కొరత!"
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష!"

సద్యస్స్ఫూర్తితో చెప్పిన యా పద్యము విన్నంతనే, రాజనీతిధురంధరుడగు తెలుగురాయడు తికమకపడెను. ఆ పద్యములో వాచ్యముగా చెప్పకుండగనే, తన యభిమానములే ఈ కవి తనకుగూడ గలవన్నట్లు ప్రకటముచేయుచు, సూచనగా పొగడినాడు. ఇతడు కేవల కవికాడు. మహా సామ్రాజ్యమునకు ప్రధాని పదవి నిర్వహింపగల సామర్థ్యము కలవాడు. ఇట్లను కొనుచు, ఈమధ్య శ్రీనాథుడు శ్రీవిద్యానగర వీధులలో సంచారముచేయుచుండెనని చారుల వలన విన్నందున, ఇతడు రాజధానిని కవి దృష్టితో చూచుచున్నాడో, చారదృష్టితో పరికించుచున్నాడో ఎరుగదలచి యుక్తిగా నిట్లడిగెను :

"కవీశ్వరా, మా విద్యానగరములో మీకు కన్నులవిందు కావించిన దృశ్యములు వర్ణించిన పద్యములేవైన నున్నవా?"

శ్రీనాథుడు : "అయ్యో, లేకేమి? ఎన్నెన్నో ఉన్నవి" అనుచు చిరునవ్వుతో ముందీపద్యము చదివెను.

"పువ్వులు కొప్పునం దురిమి, ముందుగ
గొనసియాడుచుండగా
జివ్వన జంగ సాచి యొకచేతను
రోకలిబూని యొయ్యనన్
నవ్వుమొగంబుతోడ దననందను
బాడుచు, నాథు జూచుచున్
నువ్వియనువ్వియంచు నొక సుందరి
దియ్యముదంచె ముంగిటన్."

# కవిసార్వభౌముడు

తెలుగురాయడు సంప్రీతుడై, వెంటనే ఆ పద్యము నోటబట్టి ఆనందపారవశ్యముతో దానిని రెండు మూడు మారులు రెండు మూడు తీరులలో కవికి వినిపించి యగ్గించెను.

ఇట్లే శ్రీనాథుడు తాను నగరములో చూచిన విచిత్రవేషభాషలను, స్త్రీల అందచందములను వర్ణించుపద్యములు వినిపించెను. తెలుగురాయ డా పద్యవృత్తములను విని విని, "మరి కవీంద్రా, మీ సీస పద్యములు ప్రత్యేకప్రౌఢితో నుండునని జనశ్రుతి వింటిని. మా నగరములో సీసపద్యమేమియు చెప్ప లేదా?" అనెను.

"అయ్యో, చెప్పకేమి, ఒకటి వినండి!
"శ్రీరస్తు, భవదంఘ్రి చికురంబులకు మహా
భూర్యబ్దములు సితాంభోజనయన!
వరకాంతిరస్తు, తావక ముఖనఖముల
కాచంద్రతారకం బబ్జవదన !
మహిమాస్తు, నీ కటి మధ్యంబులకు మన్ను
మిన్నుగలన్నాళ్లు మించుబోడి!
విజయోస్తు, నీ గానవీక్షల కా నీల
కంఠ హరిస్థాయిగా లతాంగి!
కుశలమస్తు, లసచ్ఛాత కుంభకుంభ
జంభభిత్కుంభి కుంభాభిజృంభమాణ
భూరి భవదీయ వక్షోజములకు మేరు
మందరము లుండుపర్యంత మిందువదన!"

విని విని తెలుగురాయడు, "మీ కీ మహానగర ములో భక్తురాండ్రగు సతివలె కనిపించలేదా?" అని యడిగెను.

శ్రీనాథు డీ పద్యము చదివెను :
"అభిషేక మొనరించు నలినీలకుంతల
శంభు దుంగాసరిత్సలిలధార,
కలిత యభ్యర్చించు నీలోత్పలంబుల
దరుణ నిర్మల సుధాధామమౌళి,
గరళకూటగ్రాస కల్మాష కంధరు
మేన గందమలందు మీననేత్ర,
యర్పించు దివ్యోపహారంబు లెలనాగ
కుటిల కుండల రాజకుండలునకు
సలిప తిరుగు ప్రదక్షిణం బభవుగుడికి
గుచభరంబున నరగౌను గూనుగిలగ
రవల మట్టెల మ్రోతతో రాయిడింప
జరణ నూపుర ఝుళఝుళం ఝుళరవంబు"

తెలుగు రాయడు : "ఋష్యమూకములో నేమే వాకర్షించినదా?"

శ్రీనాథు డీపద్యము చదివెను :
"ఆనందంబున ద్రుళ్లు బుచ్ఛములు
పెల్లల్లార్చుచున్ లేగ ల
క్కానన్ గోకులగోష్ఠ దేశమున
జంఘాలాఘువంబొప్ప హా
మానుష్మాన విధప్రకార పరతంత్రాత్మ
ప్రసూ కామధు
గ్ధ్వానాదస్య సుధాప్రవాహాలహరీ
తృప్తాంతరంగంబులై"

తెలుగురాయ డావర్ణనముచే అమృతాప్లావి తుడై, పొగడుచు, ఆకస్మికముగా, "కవిసత్తమా, మా దేవరాయప్రభుస్వాములపై ఒక పద్యమైనా చెప్పలేదా?" అని యడిగి శ్రీనాథుని ముఖవైఖరి క్రీగంట పరీక్షించుచుండెను.

శ్రీనాథుడు పద్యము చదువుటా వద్దా యని క్షణకాల మాలోచించి, విచార సూచకమగు ముఖ వైఖరితో, "ప్రభూ, ఆ మహాసార్వభౌముల దర్శించు మహాభాగ్య మింకను నాకు ప్రాప్తించలేదుగదా!" అనెను.

దానివలన శ్రీనాథుడు రాజ సందర్శనాకాంక్షియై యున్నాడని నిశ్చయించుకొని, తెలుగురాయడు, పరీక్షింపవలెనని, "అయితే నావలన మీకు కావలసిన పని యేమిటి?" అని చప్పున నడిగెను.

వెంటనే శ్రీ నాథు డిట్లర్థించెను :
"అక్షయ్యంబుగ సాంపరాయని
తెలుంగాధీశ, కస్తూరికా
భిక్షాదానము చేయురా, సుకవి
రాడ్బృందారక స్వామికిన్
దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై
వాసించు దద్వాసనల్!"

అది విని తెలుగురాయడు తెల్లవోయెను. తనకు కస్తూరియందుగల అభిమాన మీ కవి ముందుగా తెలిసికొనియే వచ్చినాడు. ఇంత ధీమగా తన్ను కస్తూరి అర్థించుకవి ఎక్కడ నుండును? ఆతనిపై అంత రంగములో ప్రేమ ఉప్పొంగినది. ఇట్టివానిని ఆద రింపకుండు టెట్లు? ఆతడు వెంటనే బంగారు పళ్లెరము నిండ ఆకులు పోకలు తెప్పించి, తన సమీ పముననే గట్టి చందనపుపెట్టెలో గుప్తమై యున్న ఉత్తమ కస్తూరిలో రెండు తులములు తీసి, రెండు చక్కని దంతపు బరిణలలోనుంచి, పళ్లెములోపెట్టి లేచివచ్చి శ్రీనాథునకు పాదాభి వందన పూర్వకముగా సమర్పించెను. "ధన్యోస్మి, శ్రీరస్తు!" అని శ్రీనాథుడు ప్రతిగ్రహించెను.

కస్తూరీదాన ప్రతిగ్రహణములు గాఢమైత్రికి చిహ్నములు! వారికి పరస్పరానురాగములో నిక నెన్న టికి భంగము వాటిల్లరాదు. కస్తూరి మంగళ ద్రవ్యము!

అంత కొంతవడికి తెలుగురాయలు గంభీర ముద్ర వదలి "శ్రీనాథభట్టా, ఇది ఎక్కడినుండి తెప్పించిన కస్తూరియో చెప్పగలరా?" అని యడి గెను.

ఆ మాటలు వినగానే శ్రీనాథునకు అప్రయత్న ముగా కన్ను లొక్కించుక చెమరించినట్లయ్యెను. ప్రీతిగద్గదమైన కంఠముతో, "ఇప్పటికి పాతి కేళ్ళనాడు చవిచూచిన కస్తూరీపరిమళముతో మిళితమైన స్నేహార్ద్ర పరిమళము స్మరణకు వచ్చి నది. ఇది స్వచ్ఛముగా చోడంగి కస్తూరి—సందే హము లేదు!" అనెను.

తెలుగురాయడు మరింత ఆశ్చర్యపడుచు, "మీ రెట్లు గుర్తించితిరి?" అని యడిగెను.

ఇంకను శ్రీనాథుడు పూర్వస్మృతులతో పర ధ్యానముగానే, "తెలుగురాయా, నాకు సువాస నలును, ఆప్తుల ప్రేమార్ద్రవచనములును స్థిర ముగా స్మృతిలో నిలిచి యుండును. ఈ కస్తూరి తన పరిమళముతోపాటు, నా బాల్యసఖుడైన అవచి తిప్పయశ్రేష్ఠి మైత్రీస్మృతిని పరిమళింపజేసినది. ఆహా, ఆతనిని చూచి ఎంత కాలమైనది!" అనెను.

"శ్రీనాథభట్టా, అవచి తిప్పయశ్రేష్ఠిని చూడ వలెనని ఉన్నదా?—త్వరలో నాత డిక్కడికి రాను న్నాడు. మా రాజ్యములోని ప్రాచీనముద్రవు రేవుల వ్యాపార మెక్కువ భాగము ఆయన కుటుం బమువారే చేయుచున్నారు. ఏదో పెద్ద వ్యాపార వ్యవహారముమీద దయచేయనున్నారు."

"ఎంతటి శుభవేళ మీ దర్శనమునకు వచ్చితిని! ఎంతటి కల్యాణ వార్త వింటిని! ధన్యుడను—అత డెప్పుడు వచ్చునో తెలుపవచ్చునా?"

"అదేమీ రాజరహస్యముకాదు. వారు పరిపూర్ణ పరిభవముతో యాత్ర చేయుచున్నారు. వైశాఖ పూర్ణిమకు వారిని సగౌరవముగా నెదుర్కొని తెచ్చుటకు రాజపురుషులు నియుక్తులైనారు— మీ కింకొక శుభవార్తకూడ చెప్పగలను. రేయిం బవళ్లు మీ పద్యములే మననము చేయుచుండు వినుకొండ వల్లభరాయలును, కందుకూరు మండ లాధిపతి పంటమైలారరెడ్డియు గూడ నప్పటికి రానున్నారు."

శ్రీనాథుడు మరింత ప్రీతితో మైలారరెడ్డి విశేషములు తెలిసికొనెను. మరికొంత సేపటికి తెలుగురాయడు తన గొంతు బాగుగా తగ్గించి, "కొండ వీటి ప్రభువులుగాని, ప్రధానులుగాని శ్రీరాయలవారికి ఏమైన రహస్య సందేశము మీ ద్వారా పంపియున్నచో, రాజదర్శనమునకు అవకాశము కల్పింపగలను." అనెను.

శ్రీనాథుడు చిరునవ్వు నవ్వుచు, "అట్టి రాజ కార్యములేవైన నున్నచో ఆపని కొండవీటి స్థానాపతు లది. విద్యాధికారికి రాజకార్యభార మప్పగించుట అక్కడి యాచారముకాదు" అని సెలవు తీసికొని వెళ్ళిపోయెను.

శ్రీనాథుడు తన వసతికి వచ్చుచు, తాను కటక పాలుని దర్శింపబోయిన పని సఫలమైనట్లా కాదా యని తరచికొని చూచెను. అట్లే తెలుగురాయ డును తన సంభాషణవలన శ్రీనాథుడు రహస్య చరుడవునో కాదో గ్రహించితినాలేదా యని తన్ను దాను మరల మరల ప్రశ్నించుకొనెను.

ఇద్దరికిని సంపూర్ణముగా సందేహములు తీర లేదు. అయినను వారిద్దరిమధ్య ఆనాడు దాన ప్రతిగ్రహణము జరిగిన చోడంగి కస్తూరి గాఢ పరి మళము పరస్పరయోగమునొంది వారి హృదయ ములకు హత్తుకొనెను. (సశేషం)

# సహనశీలి

17-వ పేజీ తరువాయి

"ఒరేయ్ మోహన్! నీతో కొన్ని మాట్లాడాలి. తీరిక చూసుకొని నా గదికి రా. . . ." అని చెప్తూ పోయాడు ప్రసాదరావు.

ఆ మాటలువిన్న సరళ గుండెలు నీరయ్యాయి. ఆమెలో ఓ విధమైన భయం ప్రవేశించింది. భర్త నెనకాలే నడిచి, "ఏమిటండీ, మీ నాన్నగారు మాట్లాడాలంటున్నారు? నాకు యెందుకో భయంగా వుంది" అంది మెల్లగా రహస్యం చెప్తున్న దానిలా.

మోహన్ మాత్రం చెక్కు చెదరలేదు. "అదిగో నేను చెప్పానుగా, నువ్వు వట్టి పిరికిదానివని. నీకు తెలీదు సరళా! మా నాన్నగారిలాంటి సహృదయులు, సౌమ్యులు మరొకరు జన్మించాలేగాని, ప్రస్తుతం ఈ విశ్వంలో యెవరూ లేరేమో ననిపిస్తుంది. మనం వచ్చి కొద్ది గంటలే అయినా, "నువ్వు ఆయన మనస్తత్వాన్ని ఆకళింపు చేసుకుంటావనుకున్నాను" నవ్వుతూ అన్నాడు.

"ఆయన మనస్తత్వం అర్థం చేసుకోక కాదండీ! ఆయన నిర్లిప్తత, గంభీరత చూస్తే నాకు యెందుకో భయంగావుంది. అగ్నిపర్వతం యెప్పుడు బద్దలవుతుందో యెలా చెప్పలేమో, యిటువంటి మనుషుల మనస్తత్వమూ అలానే చప్పున గ్రహించలేం" తన మనసులో అణగివున్న అనుమానాన్ని వెల్లడి చేసింది సరళ.

"నీ ఉపమానం బాగానేవుందిగాని, మా నాన్న విషయంలో నువ్వు పొరబడుతున్నావనే చెప్పాలి. ఆయన సంగతి నీకు బాగా తెలీదు. శాంత స్వరూపుడు. పైగా నేనంటే పంచప్రాణాలు. అందుకే, మనం, అంటే నేను ఆడిందంతా ఆటగా వుంది. నువ్వేమీ ఆదోళపడి, అధైర్యం పెంచుకోకు. . . వస్తానుండు" అంటూ తండ్రివున్న గదిలోనికి త్రోవ తీశాడు మోహన్. సరళ భారంగా అడుగులు వేసుకుంటూ, వంట గదివేపు నడిచింది.

"కూచో" అన్నాడు ప్రసాదరావు గంభీరంగా.

మోహన్‌రావు యాంత్రికంగా తండ్రి యెదురుగావున్న కుర్చీలో కూలబడ్డాడు.

కాస్సేపు యిద్దరి మధ్య, మౌనం స్థావరం యేర్పరచుకుంది.

"నీ చదువు యెలా సాగుతుందోయ్?" ప్రశ్నించాడు ప్రసాదరావు.

మోహన్ చప్పున జవాబియ్యలేదు. ఇంత ధైర్యంగల మనిషి, యేం చెప్పడమా అని తికమక పడ్డాడు.

"మాట్లాడవేంరా?" మళ్ళీ అన్నాడు ప్రసాదరావు. ఆ గొంతులో అధికారంలేదు. . . .కోపం అంతకంటే లేదు.

"నాకింక చదవాలని లేదు నాన్నా!" అన్నాడు మోహన్‌రావు తలదించుకుంటూ.

ప్రసాదరావు తలపై పిడుగు పడినట్లయ్యింది. తను యేవిటి వింటున్నాడు? అన్న కలవరపాటులో, కాస్సేపు మాట్లాడలేకపోయాడు. అతని కనుబొమలు అప్రయత్నంగా ముడిపడ్డాయి. ఫాల భాగం స్వేదంతో నిండిపోయింది.

"ఏవిట్రా నువ్వంటున్నది? చదవాలన్న ఆసక్తి లేకపోవడమేవిటి? ఎందులో నీకు లోటు కలిగింది? నువ్వు కోరినప్పుడంతా డబ్బు పంపిస్తున్నానే. ఎందుకు? నీకు అసంతృప్తి కలిగించడం నాకు యిష్టంలేదు. నిన్ను ప్రయోజకుణ్ణి చేయాలనే నా తాపత్రయమంతాను. బి. ఇ. పూర్తవుతే, నువ్వు ఆఫీసరు హోదాకి పోతావని యెంత ఆశతో వున్నానో నీకేం తెలుసు? నా ఆశలన్నీ చెదరగొడుతున్నావా? ఇన్నేళ్ళ శ్రమా వృథా చేసుకుంటున్నావా? ఆ అమ్మాయిని ప్రేమించావని, నేను విసుక్కోను అనను. కాని, అంతకంటె ముఖ్యమైనది నీ చదువన్న విషయం విస్మరిస్తున్నావు. ఆమెను నువ్వు పెళ్ళి చేసుకున్నా, నాకు అభ్యంతరం వుండదు. నీ ఆనందంకంటె నాకు కావల్సింది యేముంది గనుక. కాని, నా ఆశయం నెరవేరాలి. నువ్వు చదువుకుని ప్రయోజకుడి వవ్వాలి. నేను నిర్మించుకున్న వూహా సౌధాలు నిజం కావాలి. . . .అదే నా వాంఛ" సౌమ్యంగా, చిన్న ఉపన్యాసం యిచ్చాడు. అతని గొంతులో బాధ ధ్వనించింది.

తండ్రి సహనం, మోహన్‌రావుకి తెలియందేమీ కాదు. తను చేసిన తప్పుకి ఆయన చిందులు త్రొక్కడంలేదు సరిగదా! సౌమ్యంగా చెప్తున్నారు. అవుతే యేం లాభం? తనకి చదువుకోవాలన్న ఆసక్తి లేదు. సరళను విడిచి ఒక్క క్షణం వుండలేడు. పుస్తకం విప్పితే చాలు, సరళే లీలగా అగుపిస్తుంటుంది. ఆమె ప్రేమలో తను పూర్తిగా యిరుక్కున్నాడు. ఇంక, తను చదివేదేవిటి? తన భావం యెలా వ్యక్తం చెయ్యడం ? . . .అయినా తప్పదు.

"చదువుమీదికి ధ్యాస పోవడంలేదు నాన్నా! ఏంచెయ్యను?" అని మాత్రమే అనగలిగాడు.

ప్రసాదరావు హతాశుడై పోయాడు. కొడుకు, ఆ అమ్మాయి ప్రేమలో కొట్టుమిట్టాడుతూ చదువులో ఆసక్తి కనబర్చలేకండా వున్నాడన్న విషయం గ్రహించడానికి అతనికి అట్టే సమయం పట్టలేదు. ఇక తను బలవంతం చేసినా, ఫలితం మాత్రం శూన్యం. వాడింక చదువు సాగించలేడు. తన స్వప్నం ఒక రూపానికిరాదు. తన ఆశయం నెరవేరదు. వాడు ప్రథమంలోనే తప్పుడటుగు వేశాడు. ఆ అడుగును యింక వెనక్కి తీసుకోలేడు. తీసుకున్నా, ప్రమాదం తథ్యం. అప్పుడు యెవరికీ ఆనందం లభ్యంకాదు. ఇంతకీ, కొడుకుని ప్రయోజకుణ్ణి చేశాడన్న మాట దక్కించుకునేందుకు తనకి అదృష్టంలేదు.

ఏనాడూ కోపం యెరుగని ప్రసాదరావుకి, ఆ రోజు కూడా కోపం రాలేదు. బాధ మాత్రం గుండెల్ని రగిల్చేసింది. కళ్ళు చెమ్మగిల్లాయి. తండ్రి ఆవేదన అర్థం చేసుకోలేకపోయాడు మోహన్. అతడు ప్రేమికుడు. ఆ ప్రేమ పిచ్చిలో, ఆ ఆనందంలో మరొకరి ఆవేదన అర్థంకాకపోవడం సహజం. మౌనంగా నుంచున్నాడు మోహన్.

"సరేలేరా! నీకు యిష్టం లేనిది, నేనేం చెయ్యగలను? నిన్ను వున్నతస్థాయికి తీసుకుపోవాలని నేను ప్రయత్నించాను. కాని నా ప్రయత్నం సఫలీకృతం కాలేదు. అది నా దురదృష్టమో, నీ దురదృష్టమో యెవ్వరూ చెప్పలేరు. వెళ్ళిక. . . .నీ ఆనందవాహినికి ఆనకట్ట కట్టడం నాకు యిష్టంలేదు. మీ యిరువురికీ దైవ సాన్నిధ్యంలో వివాహం యేర్పాటు చేస్తాను" అన్నాడు మెల్లగా.

మోహన్‌రావు ఆనందంతో వుక్కిరి బిక్కిరయ్యాడు. అసలు ఆ ప్రయత్నమే అతనిలోలేదు. బాధంటే యేవిటో అనుభవించని వాడికి, యితరుల బాధ యెలా తెలుస్తుంది?

"మీరు బాలా మంచివారు నాన్నా!" ఉత్సాహంగా అంటూ, సరళకి ఈ శుభవార్త అందించాలన్న ఆతృతతో గది బైటికి నడిచాడు.

ప్రసాదరావు కుర్చీలో వెనక్కి చేరబడిపోయాడు. అతనికి నడుం విరిగిపోయినట్లయ్యింది. తను జీవితంలో యెవరికీ అన్యాయం చెయ్యలేదు. అయినా సరే, తను చేసే ప్రతి ప్రయత్నమూ విఫలమవ్వడానికి కారణం యేవిటి? విధి వైపరీత్యమే!

ప్రసాదరావు మళ్ళీ ఆలోచనకు గురిఅయ్యాడు. మోహన్ ఈ విధంగా తయారవ్వడానికి, వాడి భవిష్యత్తు నాశనమవ్వడానికి బాధ్యులెవరు? తనా? మోహనా? లేక సరళా? అతని కళ్ళెదుట ఈ ప్రశ్నలు వికృతరూపంలో నిల్చున్నాయి. అసలు యెవరు బాధ్యులు? సరళ యేవిధంగానూ బాధ్యురాలుకాదనిపించింది. ఆమెను తన ప్రేమ వలలోకి లాగినవాడు మోహన్. పాపం, ఆమె అసహాయురాలు. అమాయకురాలు. ప్రేమ మైకంలో పడిపోయింది. అందులో ఆమె తప్పేముంది ? . . . .అవుతే వాడి తప్పా?. . . .వాడు యువకుడు. . . .మొదట్నుంచి జల్సాగా కాలం గడుపుకొచ్చాడు. తన కళ్ళముందు వున్నంతకాలం ఫరవాలేకపోయింది. తనకి దూరం పోయాడు. . . .వాడేం చేస్తున్నదీ, తను చూశ్లేడు గదా! జల్సాలు అధికమయ్యాయి. ఈ జల్సాలో చదువు విస్మరించి, సరసాలు ప్రారంభించాడు. వాడి తప్పేముంది? కష్టం, బాధ, లేమి, అంటే వాడికి నిర్వచనం తెలీదు. డబ్బు లేకపోతే మనిషి యెంతగా కృంగిపోతాడో, ఒక్క క్షణం కూడా ఆ అనుభూతిని అనుభవించలేదు వాడు. పాతిక రూపాయలు చేతిలో వుండగానే, డబ్బు పంపమని టెలిగ్రామ్ యివ్వడమే వాడి పని. ఇక వాడికి డబ్బు విలువగాని, లేమి వికృత రూపంగాని యెలా తెలుస్తాయి? అందుకే ప్రేమలో పడ్డాడు. అదే జీవిత మాధుర్యమని నమ్మాడు. సరళ అందాన్ని చూసి చదువు విస్మరించాడంటే, వాడి తప్పుకాదు. . .పైసా చేతిలోవుండి, ప్రక్కను చక్కని చుక్కవుంటే వాడింక యేం చదువుతాడు?

'మరవుతే 'తప్పు' యెవరిది?' అని మళ్ళీ తనలో తనే ప్రశ్నించుకున్నాడు ప్రసాదరావు. తప్పు తనదేనా? కోరినప్పుడంతా డబ్బు పంపించి, అతి గారాబంగా చూసుకొచ్చి, వాడి జల్సా తిరుగుళ్ళకు దోహదమిచ్చింది తనేనా! వాడు చెడిపోవడానికి కారకుడు తనేనా? తను అంత గారాబంగా చూడకండావుంటే బాగుపడేవాడేమో! అయినా లేక లేక పుట్టినవాడు, తల్లిలేనివాడని ప్రేమతో చూడ్డం తన తప్పా? తన వాత్సల్యాన్ని వాడు అర్థం చేసుకోపోతే, తనదా తప్పు?. . . .ఎలాగవుతేనేం, యెవరి తప్పవుతేనేం— వాడి భవిష్యత్తు పాడయ్యింది. తన ఆశయం అడుగంటింది. తనలానే వాడూ యే గుమస్తాగిరీయో వెలిగించవల్సిందే. తలచింది ఒకటే, జరిగింది ఒకటే అయ్యింది. వాడి నుదుట అంతే రాసిపెట్టివుంది

## తెలుగు పత్రికలన్నిటిలో 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' సర్క్యులేషన్ అధికమైనది



## సహనశీలి

గామోను. లేకపోతే, యిలా యెందుకు జరుగుతుంది. అనుకుంటూ నిస్పృహతో నిట్టూర్చాడు.

తమ పెళ్ళి విషయం, ప్రియుని ద్వారా విన్న సరళ మురిసిపోయింది. ఆమె హృదయం పురివిప్పిన వన మయూరంమల్లే నాట్యమాడింది. ముసలాయన తమ వివాహానికి అనుమతిని తెలియజేస్తాడేమో నన్న ఆమె అంతర్గత భీతి పటాపంచలయింది.

"ఎలాగైనా, మీనాన్నగారు చాలా మంచివారండీ" అంది.

"నేను మొదటే చెప్పానుగా? నిజంగా మనం చాలా అదృష్టవంతులం" అన్నాడు మోహన్.

*  *  *

మోహన్, సరళల వివాహం దైవసాన్నిధ్యంలో స్వయంగా జరిపించాడు, ప్రసాదరావు. కొద్దిపాటి బంధువులు వచ్చారు వివాహానికి. మోహన్, సరళన్ని చూసి, అంతా యీడూ, జోడూ బావుం దన్నారు. మోహన్ చదువు ఆగిపోయినందుకు యెవరూ యెక్కువగా బాధపడలేదు. "ఇంత వరకైనా చదివాడు. . . సంతోషం" అన్నట్టుగా అందరూ అభిప్రాయం వెలిబుచ్చారు. కాని ప్రసాదరావు మనోవేదన యెవరికీ తెలీదు. అతని సహనాన్ని యెవరూ గుర్తించరు.

కొడుకుమనసుకి కష్టం కలిగించడం ప్రసాదరావుకి యెప్పుడూ మనస్కరించదు. అందుకే అతడు చదువు చాలించినా, బాధ పడ్డాడేగాని, వుద్రేకం తెచ్చుకోలేదు. ప్రేమలోపడి ప్రియురాల్ని వెంట బెట్టుకువస్తే పెళ్ళి చేశాడేగాని, తిరస్కరించలేదు. అటువంటి సహనశీలి ప్రసాదరావు. ఇప్పుడు ఒక్క బాధ్యతే అతని తలమీదుంది......కొడుక్కి వుద్యోగం వేయించడం!

ఎంతో ప్రయత్నమ్మీద రైల్వేలో కమర్షియల్ క్లార్కుగా వుద్యోగం వేయించి, విజయనగరంలోనే పోస్టింగ్ చేయించాడు మోహనరావును. తండ్రిగా తన బాధ్యత తీర్చుకున్నాననుకొన్నాడు. కాని, అతనిలో తృప్తిలేదు. ఉన్న బాధను యెవరూ అర్థం చేసుకోరు....

మోహన్‌రావు ఉద్యోగంలో చేరాడు. మొట్ట మొదటిరోజు ఉత్సాహంగా ఉద్యోగానికివెళ్ళి, సాయంత్రం ఉత్సాహంగానే తిరిగి వచ్చాడు. ఆనాడు తిరిగి వస్తున్న కొడుకును చూసి ప్రసాదరావు అనుభవించిన వ్యధ వర్ణనాతీతం! టిప్‌టాప్‌గా తయారై, కారులోనో, మోటారు సైకిలోనో యింటికి తిరిగి రావల్సిన మోహన్ సామాన్యుడిగా కాలినడకను తిరిగి వచ్చాడు. ప్రసాదరావు గుండెలు కలచివేసినై. కళ్ళు నీళ్ళ పర్యంతమయ్యాయి.

"ఏమిటినాన్నా! కన్నీరు పెట్టుకుంటున్నారు?" ఆశ్చర్యంగా అడిగాడు లోపలికి వచ్చిన మోహన్ తండ్రి కన్నీరు చూసి.

"ఏమీ లేదురా! ఆనందబాష్పాలు" అని మాత్రం అనేసి, చిరునవ్వు పెదాలపై చిందులాడిస్తూ, కళ్ళు ఒత్తుకున్నాడు ప్రసాదరావు. మోహన్ నవ్వుకుంటూ లోపలికి పోయాడు.

కొడుకును యేవిధంగానూ గాయపర్చడం ప్రసాదరావుకి యిష్టంలేదు. ★

# వరకట్నాలూ

22వ పేజీ తరువాయి

కొమ్మల్ని కొట్టితే చాలదు. కొమ్మని కొట్టితే మొక్క తిరిగి చిగిర్చే అవకాశముంది. అందువల్ల మూలాన్నుంచి, చిన్న చిన్న వేళ్ళతో సహా పెకలించివేయాలి.

పెళ్ళి అవని ఆడపిల్లల్లో వంకలెన్నడం మానాలి. ఇది ఆడవారు చేసేపని. ఆడవారే ముందర పెళ్ళికాని ఆడపిల్లలకి వంకలు పెట్టుతారు. ఆడవారి లాగానే కొంతమంది మగవారు కూడా ప్రతీ ఆడపిల్లనీ వేళాకోళంచేసి, పెళ్ళికాలేదనడానికి వంకలెన్నేవారుంటారు. వారంతా కూడా తమకీ ఆడపిల్లల్లో, చెల్లెళ్ళో, వదినలో, మరదళ్ళో వున్నారనీ, వాళ్ళి మిగతావారు ఏమైనాలంటే వారికెంత కష్టంగా వుంటుందో ఆలోచించుకొని, మిగతావారికి కూడా తాటాకులు కట్టడం, ఫ్లేట్లు ఫిరాయించడం మానుకోవాలి.

రెండోది ఆడపిల్లలకి వారి తల్లి తండ్రులు పెళ్ళవకంతమాత్రం, వారిలో ఏదో లోపం వుందని, ఆ పిల్లలు అనుకుని వ్యథ పడకుండా చూసుకోవాలి. ఇది తల్లి తండ్రులపైనివున్న పెద్ద బాధ్యత. నలుగురైదుగురు చూసుకుని వద్దనగానే అభిమానం వున్న ఆడపిల్ల క్రుంగిపోతుంది. అలా క్రుంగిపోకుండా చూసుకునే బాధ్యత ఆ కుటుంబంవారిది. అలా క్రుంగిపోతే ఒక్కొక్కప్పుడు అనేక అనర్థాలకు దారితీస్తుంది.

ఆడపిల్లలకు చదువో, మరేదైనా చిత్రలేఖనమైనా నేర్పించి వారు దానిపై మనస్సు లగ్నము చేసుకునేటట్టు చేయాలి. తమంతట తామే పోషించుకోగలిగే దారి చూపాలి. ఆ దారి ఏమిటి అనేది వ్యక్తి ననుసరించి వుంటుంది. చదువుకు ఉద్యోగమూ, మరేదైనా నేర్చుకుని నలుగుర్ని పోగుచేసి నేర్పడమా, లేదా మరింకేదైనానా అనేది వ్యక్తిగతాభిప్రాయానుసరంగా నిర్ణయించుకోవాలి. కానీ కొంతమంది ఇలాగా వుండటం కాలే పెనంలోంచి నిప్పులోకి పడ్డట్టు అనుకుంటారు. కన్యలలాగా వుండిపోకూడదు. కానీ ఆ పరిస్థితి దైవ లిఖితమై వస్తే మానవమాత్రులం ఏం చేస్తాం చెప్పండి. అందుకే కాలేపెనంలాంటి కట్నాల బాధ తప్పుకోడానికిగాను, కన్యలలాగానే వుంటామనేది నిప్పులో దూకడమవుతుందని అంటారు కొందరు. మరి ఈ రెండింటిలో ఏది ఎక్కువ విషమైనది, ఏది ఎక్కువ కష్ట నష్టాలిస్తాయనేది ఎవరికి వారే నిర్ణయించుకోవాలి.

ప్రభుత్వం కట్న నిషేధాలకోసం చాలా పాటుపడుతోంది. అందులో ఎంతవరకు కృతకృత్యులౌతారనేది చూడాల్సిన విషయం. నిజంగా కట్నాల బాధని అరికట్టాలంటే యువకులు, యువతులు అందరూ శ్రమ పడాలి. మగవారు కట్నాలు తీసుకోకూడదని నిర్ణయించుకోవాలి. సంఘంలోనివారందరూ మారాలి. ఇది ఐకమత్యంతో చెయ్యాల్సిన పని. అందరూ శ్రమ పడితేనేగాని, శ్రమకి తగిన ఫలం దక్కదు. పిల్లల్ని కన్న తల్లిదండ్రులు కూడా ఈ విషయమై శ్రద్ధ తీసుకోకుంటేనేగానీ, ఇది నిర్మూలించనేరము. ప్రభుత్వం కట్న నిషేధంలో విజయం సాధించాలంటే పిల్లని కన్నవారూ పిల్లవానిని కన్నవారూ, పిల్లవాడూ కూడా కట్నం ఇవ్వకూడదని కట్నం పుచ్చుకోమని నిర్ణయించుకోవాలి.

అయితే ఇంతకీ ఇది చదివిన వారైనా ఈ దిగువ రెండు ప్రశ్నలు వేసుకుని, ఆలోచించుకొని, లేదు అని జవాబు చెప్పుకుని ఆచరణలో పెట్టాలి! అవి ఈ రెండునూ. ఇంతకీ మీరు కట్నం ఇస్తారా? పుచ్చుకుంటారా? ★

---

# భూగర్భంలోనికి సాహసయాత్ర

25–వ పేజీ తిరువాయి

శాస్త్రజ్ఞులు దేశాన్ని నాలుగుభాగాలుగా విభజించారు. మేము అప్పటికి 'సుడ్ వెస్టర్ ఫ్యోర్డుంగ్ర్' ప్రదేశం మీదుగా ప్రయాణం చేస్తున్నాము. ఇది ద్వీపానికి నైఋతి దిక్కుగా ఉన్నది.

హాన్స్, రైక్ యావిక్ దాటగానే సముద్రతీరం మీదుగా వెళ్లే దారి తీశాడు. అక్కడ పైరు కూడా కుష్కించి ఉన్నది. తూర్పున అగ్ని పర్వత శిఖరాలు మసకగా కనిపిస్తున్నాయి. కొన్నిటిమీద మంచు మెరుస్తున్నది. మరికొన్ని శిఖరాలు మేఘాలలో నుంచి చొచ్చుకుపోయి సముద్రంపైన కనిపించే రాయి ద్వీపాలు పొడుచుకువచ్చినట్లు పొగమంచు మసకమీదకి పొడుచుకు వచ్చాయి.

సముద్రంలోనికి ఉన్న రాతి గుట్టలు చాలా అగుపించినా మా దారికి అడ్డురాలేదు. మా అశ్వాలు కూడా తప్పటడుగు వేయకుండా ముందుకు సాగిపోయాయి. పాపం మా పెదనాన్నకు తన గుర్రాన్ని కొరడాతో గాని, అరుపులతోగాని తొందరపెట్టే అవకాశమయినా లేకపోయింది. అంత పొడుగాటి మనిషి ఒక చిన్న గుర్రం ఎక్కటంచూసి నాకు నవ్వు వచ్చింది. కాళ్ళు భూమినీ రాసుకుని ఆరుకాళ్ల 'సెంటార్' (కింపురుషుల వంటివి) లాగ ఉన్నాడు.

"బలే జంతువు! బలే జంతువు!" అన్నాడు. "చూడు ఆక్సెల్ అయిస్‌లాండ్ గుర్రం చాలా తెలివి కల మృగం. మంచు తుఫానులు, గాలివాన, దుర్భరమైన రోడ్లు, గుట్టలు—ఇవన్నీ దాన్నేమీ చెయ్యలేవు. ధైర్యం కలవి. నెమ్మదిగా ఉంటాయి. మనం వాటిని నమ్ముకోవచ్చు. ఒక్క తప్పటడుగు వెయ్యదు. దేనినిచూసీ బెదరదు. ఏదైనా వాగు అడ్డంవస్తే వెనుకాడకుండా అవతల గట్టుకి ఈదుకుంటూ పోతుంది. కాని తొందర పెట్టకు. దాని సంగతి అదే చూసుకుంటుంది. మనం రోజుకి ముప్పై మైళ్ళు ప్రయాణం తప్పదు."

"అయితే అవచ్చుగాని మన గైడ్ సంగతేమిటి?"

"అతన్నిగురించి బాధపడనక్కరలేదు. ఎంత సునాయాసంగా నడుస్తాడో చూడు. అసలు అలిసిపోయే అవకాశమేలేదు. కాని కావాలంటే నా గుర్రం ఎక్కమంటాను. ఇలా వూరికే కూర్చుంటే నా ఒళ్ళు పట్టుకుపోయేట్లుంది. చేతులు పర్వాలేదు కానికాళ్లే!"

చకచక ముందుకు సాగిపోతున్నాము. మా పరిసరాలు అప్పటికే ఇంచు మించు నిర్మానుష్యంగా తయారయిపోతున్నాయి. ఎక్కడో ఒక 'బూర్' (Boer) — అంటే వ్యవసాయాదారుని ఇల్లు— కనిపించేది. మ్రాను, మట్టి, కొండరాయి వాటితో కట్టబడిఉన్నదేమో పల్లెటూరు పోయేదారిలో హఠాత్తుగా ఎదురయ్యే ముష్టివాడివలె కనిపించేవి. అట వెళ్లేవారిని యాచిస్తున్నట్లు ఉండేవి. ఎక్కడ రోడ్డుకాని, బాటకాని లేదు. అంతకుముందు అటు ఎవరైనా వెళ్ళిన జాడ తెలియులేదు.

రాజధానికి దగ్గరగాఉన్న ఈ ప్రదేశం అయిస్‌లాండ్‌లో జనాభా అధికంగాకల వాటిలో ఒకటి అని ప్రసిద్ధి. ఈ ఎడారికన్నా తక్కువజనంఉండే ప్రాంతాలు ఇంక ఎలాఉంటాయో? అరమైలు ప్రయాణం చేసినా ఒక కర్షకుడు కనిపించలేదు. గొర్రెలమంద కాసే గొల్లవాడిని చూడలేదు. అక్కడక్కడ కొన్ని మందలు వాటంతట అవే మేస్తున్నాయి. అగ్ని పర్వతాల పరిసరాలు ఎలాఉంటాయో?

మాదగ్గరవున్న ఓల్సెన్ మాప్ (Map)నుబట్టి వీటికి దూరంగా, సముద్రతీరం వెంబడే వెడుతున్నామని గ్రహించాను.

రైక్ యావిక్ వదిలిన రెండు గంటల తర్వాత 'గుఫ్యూనెస్' అనే ఊరుచేరుకున్నాము. దీనికే 'అవోల్ కిర్క్యా' (Head church) అనే పేరు కూడా ఉన్నది. చూడటానికి విశేషంగాలేదు. జర్మనీలో ఒక పల్లెటూరుకంటే చిన్నది.

హాన్స్ ఇక్కడ అరగంట ఆగిపోయాడు. మాతో బాటు భోజనం చేశాడు. మా పెదనాన్న అడిగిన ప్రశ్నలకు, 'అవును', 'కాదు' అన్న రెండు మాటలతో జవాబులు ఇచ్చాడు. రాత్రి ఎక్కడ మకాము వేసేదీ తెలుసుకొనటానికి మా పెదనాన్న వేసిన ప్రశ్నకు, "గర్డార్" అని మాత్రం అన్నాడు.

గర్డార్ ఏమిటా అని మాప్ చూసాను.

రైక్‌యావిక్‌కి నాలుగు మైళ్ళ దూరంలోఉన్న ఒక చిన్న వూరు అని తెలిసింది.

"నాలుగు మైళ్లేనా! ఇరవై రెండులో నాలుగు మైళ్లా! ఆహా ఏమి షికారు!" అన్నాడు మా పెదనాన్న.

తన అసంతృప్తి ఈవిధంగా ప్రదర్శించబోయాడుకాని మా 'గైడ్' మాట లేకుండా ప్రయాణం తిరిగి ప్రారంభించాడు.

మూడు గంటలు గడిచాయి. మేము ఇంకా 'కొల్లా ఫ్యోర్డ్" (Kolla Fjord) అంచుల మీదుగా చుట్టి చుట్టి వెడుతున్నాము. మాకాలి క్రింది గడ్డి పచ్చగా లేదు. దారిలో 'ఎయుల్‌బర్గ్' అనే వూరిలో 'సింగ్‌స్టావర్" అనే కట్టడం చూశాము ఇది ఒక రకమయిన న్యాయస్థానము. అయిస్‌లాండ్‌లో చర్చిలకు గడియారాలు ఉండవు. ప్రజలు కూడా చాలా మట్టుకు ఇవి లేనట్టే కనిపిస్తారు.

ఇక్కడ గుర్రాలకు విశ్రాంతి ఇచ్చాము. ఆపైన నాలుగు గంటలకు 'సావర్‌బూర్" అనే చోటు చేరుకున్నాము. సరిగ్గా నాలుగు డానిష్ మైళ్ళ ప్రయాణం చేశామన్నమాట.

ఈప్రదేశంలో 'హ్వాల్ ఫ్యోర్డ్ (Hoal Fjoru) విశాలంగా ఉంటుంది కనీసం అరమైలు; తీరంమీద రాళ్లకి అలలు కొట్టుకుని పెద్ద శబ్దం చేస్తాయి. సముద్రం భూభాగంలోనికి బాగా చొచ్చుకుపోయి ఉన్నది. వీటికి ఇరువైపులా కొండలు మూడువేల అడుగుల ఎత్తు ఉన్నాయి. నా అశ్వం తెలివైనదే కావచ్చుకాని వీటినిదాటి పోవటం వూహించలేకపోయాను.

# భూగర్భంలోనికి సాహసయాత్ర

"ఏమాత్రం వివేకంఉన్నా దాటే ప్రయత్నం చెయ్యడు. అయినా, మా ఇద్దరి తరఫునా నేనే ఆలోచిస్తాను!" అనుకున్నాను.

మా పెదనాన్న క్షణం ఆలస్యానికి ఒప్పుకొనలేదు. గుర్రాన్ని ముందుకు తీసుకుపోయాడు. అది నీటి వరకూవెళ్ళి, వాసనచూసి ఆగిపోయింది. మా పెదనాన్న దానిని ఇంకా ముందుకు పంప ప్రయత్నం చేశాడు. అది తల విదిలించి కదల నన్నది. తిట్టు కున్నాడు. కొరడా ఉపయోగించాడు. చివరకు ఆ చిన్న అశ్వం కూర్చుని ప్రొఫెసర్‌గారి కాళ్ళక్రిందనుంచి జారుకుంది. ఆయన 'బీచ్'మీద చెరొక కాలి క్రిందా ఒక రాతితో అలాగే నుంచునిపోయాడు.

"బుద్ధిమాలిన మృగం!" అని అరిచాడు అకస్మాత్తుగా పాంధికుడుగా మారిపోయిన ఈ అశ్వికుడు; కాలి బంటుల దళానికి బదిలీ అయిన అశ్వదళాధికారిలాగ సిగ్గుపడిపోయాడు.

"ఫెర్గా!" అన్నాడు హాన్స్ ఆయన భుజం తడుతూ.

"ఏమిటీ! బల్లకట్టా?"

"డర్ (అదుగో)" అని హాన్స్ జవాబు యిచ్చాడు. ఒక పడవ చూపించాడు.

"అవును!" అని నేను అరిచాను. "బల్లకట్టు అదుగో!"

"ఆ సంగతి ముందే చెప్పకపోయావా! వెడదాం పద!"

"టిడ్‌వాట్టెన్" అన్నాడు మా గైడ్.

"ఏమిటంటున్నాడు?" అని నేను అడిగాను.

"సముద్రంపోటు......" అన్నాడు మా పెదనాన్న.

"అంతవరకూ ఆగిపోవాలంటాడా?"

"ఫొర్‌బిడా?" అని మా పెదనాన్న అడిగాడు.

"యా" అని హాన్స్.

మా పెదనాన్న తొందరలో కాలు విదిలించాడు. గుర్రాలు పడవ దగ్గరకు నడిచిపోయాయి.

సాయంత్రం ఆరు గంటలకుకాని కదలలేకపోయాము. మా పెదనాన్నా, మా గైడ్, నేనూ, ఇద్దరు సరంగులు. నాలుగు గుర్రాలూ అందరం పడవ ఎక్కాము. అది అసలు గట్టిగానే కనిపించలేదు. ఎల్బెమీద స్టీమ్ లాంచిలకు అలవాటు పడిన నాకు ఆ తెడ్ల పడవనుచూస్తే జాలి కలిగింది. ఏ ప్రమాదం లేకుండా, గంటలో దాటాము.

మరొక అరగంటలో "గర్డర్" చేరుకున్నాము.

## 13

అప్పటికి చికటిపడి ఉండాలి కాని ధ్రువ ప్రాంతాలలో సంధ్యాకాలం గురించి తెలుసు కాబట్టి నాకు ఆశ్చర్యం కలుగలేదు. ఐస్‌లాండ్‌లో జూన్ జూలై నెలలో అసలు సూర్యుడు అస్తమించడు.

అయినా శీతోష్ణస్థితి తగ్గింది. నాకు ఆకలితో బాటు చలి కూడా వేసింది. ఏ 'బూర్' (Boer)

మమ్ములను లోపలకు ఆహ్వానిస్తుందా అని ఎదురు చూశాను.

"అది ఒక రైతు యిల్లు. కాని ఒక రాజు లాగ సత్కరించాడు. మేము రావటంతోనే ఇంటి పెద్ద బయటకు వచ్చి మాతో కరచాలనం చేశాడు. లోపలకు రావచ్చునని సంజ్ఞచేశాడు.

చీకటిగా, ఇరుకుగా ఉన్న ద్వారం ఒక్కొక్కరూ ప్రవేశించాము. లోపల గదులన్నీ కొయ్యతో నిర్మించినవే. ఇవి మొత్తం నాలుగు ఉన్నాయి. వంటగది, మగ్గం ఉన్న గది, కుటుంబం అంతా పడుకునే 'బాడ్ స్టోఫా' గది, తక్కినవాటితో పోల్చి చూస్తే చక్కగా అలంకరించి ఉన్న అతిథుల గది. ఇల్లు కట్టినవారు మా పెదనాన్న వంటి పొడుగాటి మనుష్యులసంగతి ఆలోచించలేదు. మూడు, నాలుగు పర్యాయాలు ఇంటి దూలాలకు ఈయన తల కొట్టుకొన్నది.

మా గది ప్రవేశించాము. మట్టినేల కిటికీలకు గాజుబదులు గొర్రె చర్మం వాడారు. లోపల అంత వెలుతురుగా లేదు. రెండు కొయ్య మంచాల మీద ఎండుగడ్డి పరచి ఉంచారు. ఇవే మా పాన్పులు. వీటికి ఎర్రరంగు పూసి, ఐస్‌లాండిక్ సామెతలు వ్రాసి ఉంచారు. ఇటువంటి మంచి ఏర్పాట్లు సిద్ధంగా ఉంటాయని నేను ఎదురు చూడలేదు. నాకు నచ్చినది, ఇంటినిండా ఉన్న వాసన—ఎండబెట్టిన చేపలు, మాంసం, పులిసిన పాలు వీటివి.

మా సామాను దించగానే ఇంటి యజమాని వంటగదిలోకి రమ్మని పిలిచాడు. ఇంటిలోకల్లా ఇక్కడే నిప్పు రాజేసి ఉంటుంది. మా పెదనాన్న వెంట నేనూ వెళ్ళాను.

మంటవేసేచోటు అతి పురాతనపద్ధతిలో నిర్మించారు. గది మధ్య ఒక పెద్ద రాయి, దానికి సరిగ్గా పైన పొగ బయటకు పోయేందుకు కప్పులో ఒక చిల్లు. భోజనం కూడా ఈ గదిలోనే.

మేము ప్రవేశించగానే ఇంటి పెద్ద, "సాల్ ఫెర్టు" అని పలకరించాడు. ('సంతోషంగా ఉండు!' అని దీని అర్థం). తర్వాత మమ్మల్ని బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు.

ఆయన వెంట ఆయన భార్య కూడా అదే మాట పలికి, ఆయనను అనుసరించింది. ఆపైన ఇద్దరూ తమ గౌరవం తెలపటానికి ముందుకు వంగి తిరిగి నేరుగా నుంచున్నారు.

ఇంటావిడకు పందొమ్మిదిమంది పిల్లలు. గది నిండా మునురుకొని ఉన్నారు. మంటలనుంచి వస్తున్న పొగలో వారు మొదట సరిగ్గా కనిపించ లేదు. మసక తగ్గిన తర్వాత ఒక్కొక్కరూ మావంక గంభీరంగా చూడటం గమనించాను.

వీరు ముందు మమ్మల్ని వినయంగానే పలకరించారు. ఇంతలో ముగ్గురు, నలుగురు చిన్న పిల్లలు మా భుజాల మీదకి ఎక్కి కూర్చున్నారు. మిగిలినవారు మోకాళ్లమీదా, మధ్యా ఇరికారు. మాటలు వచ్చినవారు, "సాల్ ఫెర్టు" అని పదే పదే అన్నారు. ఇంకా మాటలురానివారు గట్టిగాఅరిచారు.

భోజనం రాగానే ఈ గందరగోళం తగ్గిపోయింది. సరిగ్గా ఈ సమయానికి మా వేటగాడు లోనికి వచ్చాడు. గుర్రాల గ్రాసం విషయం గమనించి తిరిగి వస్తున్నాడు—వాటిని పొలాలు వదిలి వస్తున్నాడన్నమాట. రాళ్ళ, రప్పల మధ్య వాటికి దొరికిన గడ్డి మేయాలి పాపం, ఈ మృగాలు. కాని మర్నాటికి తమంతట తామే పనికి తిరిగి వస్తాయి.

"సాల్ ఫెర్టు" అన్నాడు హన్స్.

తర్వాత సావకాశంగా, ప్రయత్నం లేకుండా ఇంటి యజమాని, ఆయన భార్య, వారి పందొమ్మిది మంది పిల్లలూ అందరినీ ముద్దుపెట్టుకున్నాడు.

ఈ కార్యక్రమం పూర్తి అవగానే ఇరవైనాలుగు మందీ బల్లచుట్టూ ఇరికి కూర్చున్నాము. మాలో అదృష్టవంతులైన వారికి ఒక్కొక్కరి ఒళ్లో ఇద్దరు పిల్లలకు మించి లేరు.

'సూప్' రావడంతోటే మా ఈ చిన్న ప్రపంచం మవునంగా తయారు అయినది. అయిస్‌లాండ్‌లో చిన్న పిల్లలు కూడా ఎప్పుడో గాని అధికంగా మాట్లాడరు. ఈ సూప్ 'మాస్' గడ్డితో చేసినది. నా గొంతుక దిగలేదు. దానివెంట ఇరవై సంవత్సరాలు మురగబెట్టిన వెన్నలో తేలుతున్న ఎండు చేపలు వడ్డించారు. అయిస్‌లాండ్‌లో ఈ వెన్న తాజాగా తీసిన వెన్నకన్నా రుచికరమైన దనుకుంటారు. విరిగిన పాలకు 'బెర్రీ' పళ్లరసం కలిపి తయారుచేసిన 'స్కైర్' అనే వంటకం, తాగేటానికి 'బ్లాండా' (విరిగిన పాలకు నీళ్లు కలిపి తయారు చేసినది) రుచి చూశాము. ఈ వింత భోజనం మంచిదో కాదో చెప్పలేను కాని తీవ్రమయిన ఆకలిమీద ఉన్న నేను ఆఖరున వడ్డించిన గోధుమ జావ కూడా వదిలిపెట్టలేదు.

భోజనం అవగానే పిల్లలు మాయమయ్యారు. పెద్దవారు చలిమంట చుట్టూ కొంతసేపు కూర్చుని ఎవరికి వారు తమ పడక గదికి వెళ్లిపోయారు. ఇంటి యజమాని భార్య మా కాలిమేజోళ్ళు పూడదీయటానికి సహాయపడతానన్నది. ఇది అక్కడ 'మర్యాద'లలో ఒకటి. కాని మేము పిల్లైపంత శాక్యంగా అక్కరలేదని చెప్పేసరికి ఆమె పట్టింపు లేకుండా వెళ్లిపోయింది.

మర్నాడు పొద్దున అయిదు గంటలకు మా అయిస్‌లాండు రైతువద్ద సెలవు పుచ్చుకున్నాము. అతి కష్టంమీద మా పెదనాన్న డబ్బు పుచ్చుకొనటానికి ఒప్పించాడు. హాన్స్ ఇక బయలుదేరా అన్నట్లు సంజ్ఞ చేశాడు.'

గర్టెర్‌కు మూరు అంగలకు అవతల నేల మారిపోవటం మొదలుపెట్టింది. కొంచెం పూబిగా తయారయింది. ముందుకు వెళ్లటం కొంచెం కష్టం అయింది. మా కుడివైపు కొండలు కోట గోడలవలె ఉన్నాయి. ఈ గోడ వెంటనే అంతం లేకుండా ప్రయాణం చేస్తున్నట్లున్నది. అక్కడక్కడ తటస్థించిన వాగులు మా సామాను తడిసిపోకుండా దాడగలిగాము. ఎక్కడా నరసంచారమే కనిపించలేదు. మా కాళ్లక్రింద గడ్డి కూడా తగ్గిపోయి రాతినేల ప్రారంభ మయినది. అక్కడక్కడ పొదలు తప్ప వృక్షాలు కనిపించలేదు. తిండి పెట్టలేక వదిలివేసిన గుర్రాలు మేతకోసం తిరుగుతున్నాయి. ఇవి తప్ప వేరే జంతువులు లేవు. ఎప్పుడయినా ఒక గ్రద్దపైన బూడిదరంగు మేఘాలలో దక్షిణం వైపుకు ఎగురుతూ వెళ్లేది. మనస్సు ఉల్లాస పరచేది ఒక్కటి కూడా లేని ఆ ప్రాంతంలో కొంత ప్రయాణం చేసేసరికి మా స్వంత దేశానికి తిరిగిపోవా లనిపించింది.

కొన్ని చిన్న 'ఫ్యోర్డ్' (Fjord) లు, ఒక ఖాతం దాటి త్వరలోనే 'ఆల్ఫటాన్స్' అనే పల్లెటూరు చేరుకున్నాము.

ఆ రాత్రి, ఆల్ఫా, హెటా అనే రెండు నదులు దాటాము. ఒక పాత గుడిసెలో గడప వలసి వచ్చింది. 'నార్స్' (Norse) కథలలో దెయ్యాలన్నీ మాతోనే ఆ రాత్రి గడిపాయా అనిపింపించేటట్లున్నది ఆ గుడిసె. దెయ్యాల మాట అట్లా ఉంచి 'చలిదేవత' అక్కడ నివాసము ఏర్పరచు కున్నది.

మరునటి దినం, విశేషి లేమీ లేకుండా సాయంకాలానికి 'క్రూసోల్స్' అనేచోటు చేరాము.

జూన్ 19 వ తేదీ ప్రయాణం తిరిగి ప్రారంభించాము. లావా (Lava) తో కప్పబడిన భూమి ఒక మైలు వరకు ఉన్నది. అయిస్‌లాండ్‌లో ఈ రకమయిన నేలను 'హ్రవున్'(Hraun) అంటారు. ఎప్పుడో ఆరిపోయిన అగ్నిపర్వతాలలో నుంచి పారి ఘనీభవించిన ఈ రాతి పదార్థం చిత్ర విచిత్రా అయిన ఆకారాలను దాల్చి ఉన్నది. కొన్నిచోట్ల బారులు బారులుగా పరచిన త్రాళ్లవలె, మరికొన్ని చోట్ల చుట్టబెట్టిన వాటివలె కనిపించింది. అక్కడక్కడ ఆవిరి వచ్చే వేడినీటి వూటలు చూశాము.

ఇవన్నీ పరిశీలించే వ్యవధి మాకు లేకపోయినది. ముందుకు సాగిపోయాము. త్వరలో పూబినేల తిరిగి ప్రారంభమయింది. చిన్న సరస్సులు ఎటువైపు చూసినా కనిపించేవి. ప్రస్తుతం పడమటి వైపుగా ప్రయాణం చేస్తున్నాము. ఫాక్సాబే చుట్టి వెళ్లిపోయాము. అయిదు మైళ్లకు ఇవతలే స్నాఫెల్స్ పర్వతం ద్వంద్వ శిఖరాలు మేఘాలను అంటుతూ కనిపించాయి.

నేల ప్రయాణానికి కష్టంగానే ఉన్నా గుర్రాల వేగం ఏమాత్రం తగ్గలేదు. నేను బాగా అలిసిపోయాను. కాని మా పెదనాన్న ముందు రోజు ఎంత ధీమాగా, నిటారుగా ఉన్నాడో ఇప్పుడూ అలాగే ఉన్నాడు. ఆయననూ, మా వేటగాడినీ చూస్తే కావలసినంత అభిమానం పుట్టుకు వచ్చింది. హన్స్‌కు ఇదిఒక షికారులాగ ఉన్నట్లున్నది.

శనివారం, జూన్ 20 వ తారీఖు సాయంత్రం ఆరు గంటలకు 'బుడిర్' అనే వూరు చేరుకున్నాము. ఇది సముద్రతీరం దగ్గరగా ఉంటుంది. సంతలు జరుగుతూ ఉంటాయి. మా గైడ్ తన 'వేతనం' ఇమ్మని అడిగాడు. మా పెదనాన్న అతనికి ఇవ్వవలసినది ఇచ్చేశాడు. హన్స్‌కి ఈ వూరిలో చుట్టాలు ఉన్నారు. వారు తమ ఆతిథ్యం స్వీకరించమని బలవంతం చేశారు. నాకు బడలికమీద కొన్ని రోజులు అక్కడే ఆగిపోదామని అనిపించినా మా పెదనాన్న ఒప్పుకొనలేదు. మర్నాడు మళ్లీ మా అశ్వాలను ఆరోహించాము.

నేలను చూస్తే పర్వతప్రదేశమని తెలిసిపోతున్నది. పెద్ద చెట్ల వేరు నేలపైకి పొడుచుకు వచ్చినట్లు రాతి 'వేళ్ళు' అక్కడక్కడ కనిపించాయి. అగ్నిపర్వతం చుట్టి వెడుతున్నామని గ్రహించాను. ప్రొఫెసర్‌గారు ఎప్పుడూ దానివంక దీక్షగా చూస్తూ ఉండేవాడు. ఏవో సంజ్ఞలు చేసేవాడు. "నేను జయించబోయే రాక్షసుడిదిగో !" అని సవాలు చేస్తున్నాడా అనిపించేది. నాలుగు గంటల గమనం తర్వాత గుర్రాలు వాటంత టవే 'స్టాపీ' (అనే వూరు) లో 'ఫాదరీ' ఇంటిముందు వెళ్ళి నుంచున్నాయి.

(సశేషం)

## పాప పిలుపు

మానేపల్లి సత్యనారాయణ

వెల్లగా సూర్యుడు
అస్తమించాడు!
చల్లగా చంద్రుడు
ఉదయించినాడు!
చెరువులో కలువలు
వికసించినాయి!
చంద్రుణ్ణి చూచాయి
సంతసించాయి!
కలువ రేకులు విచ్చి
కలకలా నవ్వాయి!!
పాపాయి చూచింది
దూరంగ చంద్రుణ్ణి-
ఆడుకుంటా నీతో
రమ్మురమ్మన్నది!
అమ్మకు తెలీకుండ
అరువబోకుండ
పాపాయి తనదరికి
పిలిచింది రమ్మని!
వచ్చేటప్పుడు కూడ
వెన్నెలల తెమ్మంది
వెన్నెలలలో వెలుగు
నింపుకొని రమ్మంది
విన్నాడు జాబిల్లి
ఆ పాప పిలుపు,
పకాపకా నవ్వాడు
పరచాడు వెన్నెల
విరిసింది వెలుగు!

## గడ్డి పచ్చడి

27వ పేజీ తరువాయి

మళ్ళీ పచ్చడితిని, గంజి పోసుకుని, తినిలేచి త్రేవున తేన్చి, "అవ్వా-భుక్తాయాసంగా వుంది. కొంచెం విశ్రాంతి తీసుకుంటాను" అన్నారు. "అలాగే బాబూ" అంటూ అవ్వ వంటింట్లోకి వెళ్ళి-తనకి అన్నంలేనందుకు మంచినీళ్ళు త్రాగి, కూర్చుంది.

ఓగంట పోయాక రాజుగారు నిద్ర లేచారు. లేచి అవ్వను పిలిచి, "అవ్వా నువ్వు నాకు చాలా సహాయం చేశావు. అన్నంపెట్టి, విశ్రాంతికి అవకాశం యిచ్చావు. నీకేం కావాలో కోరుకో-అన్నట్టు-ఆ పచ్చడి పేరు ఏవిటీ-చాలా బ్రహ్మాండంగా వుందిస్మా" అన్నారు. అవ్వ గజగజలాడిపోయింది. "గడ్డి పెట్టాను బాబూ" అని ఎలా చెప్తుంది మరి...

"అవును-గడ్డి పెట్టేనంటే-రాజుగారికి కోపంరాదూ-చంపేస్తారు." అన్నాడు నటరాజు.

"అవును" అంటూ అవ్వ మళ్ళీ ఆరంభించింది "...అవునుకదా-మరి చెప్పకపోతే - కోపంవచ్చి చంపేస్తాడేమో" సరే-ఏవయితే అయ్యిందని ధైర్యంచేసి చేతులు జోడించి, "ప్రభూ-మన్నించాలి. బీదదాన్ని-ఏవీ లేనిదాన్ని-తమరు ఆకలి అంటే-యింట్లో ఏవీ లేక, పెరట్లో లేత గరికకోసి పచ్చడిచేసి పెట్టాను" అంది రాజుగారికి ఆశ్చర్యం వేసింది. "ఏవిటి గడ్డి-గడ్డా-ఏదీ, ఆ పచ్చడి యిలాతే" అన్నారు. అవ్వ కుండలో వున్న కొంచెం పచ్చడియిచ్చి చేతులు కట్టుకునించుంది. రాజుగారు ఆ పచ్చడినితిని పక్కున నవ్వారు. "ఆహా-అవ్వా నీ చేతిలో అమృతం వుంది. గడ్డిపచ్చడీతోనూ, గడ్డి కరువుంకోనూ నన్నింత ఆనందపెట్టావు గనుక నీకేం కావాలో కోరుకో" అన్నారు రాజుగారు ఆనందంతో. అవ్వ నమస్కారం పెడుతూ, "ప్రభూ, నాకేంకావాలి, మమ్మల్ని పాలించే మీరు చల్లగా వుంటే అదేచాలు" అంది. అవ్వ గొప్పగుణానికి రాజుగారు చాలా ఆనందించారు. "అవ్వా, నీ యుక్తికి, భక్తికి మెచ్చుకున్నాము. గరికతో మాకు యింతఆనందాన్ని యిచ్చావు గనుక యీవూరు నీపేర రాసి, యీవూరికి గరికపాడు అనే పేరు పెడుతున్నాము. నాలా ఆకలి అని వచ్చిన వారికి కాస్త అన్నం పెడుతూ, నువ్వు హాయిగా వుండు. నీకు యిక్కడ పెద్ద మేడకట్టించి యిప్పిస్తాం" అని అవ్వకి నమస్కరించి వెళ్ళిపోయారు. తర్వాత అవ్వకి మంచి మేడ కట్టించి, ఆ వూరుకు గరికపాడు అని పేరుపెట్టి అవ్వకి యిచ్చారు. చూశారా—మరి గడ్డి అవ్వకు ఎంత మేలుచేసిందో-" అంటూ అవ్వ కథఆపి, నిద్రపోతున్న మనవలకేసి చూసి, ఆనందంగా నవ్వుకుంది. ★

---

"పంథొమ్మిదివందల ఇరవై నాలుగు నుంచి నాకొక కోరిక ఉండేది. అది ఇవాళ తీరింది!" అన్నాడు రాజుగారు.

"ఏమిటది!"

"1924 మోడలు కారు కొన్నాను!" అని రాజుగారు సంబర పడ్డారు.

జి. యస్. రెడ్డి, (కర్నూలు)

---



అన్నపూర్ణావారి 'ఇద్దరు మిత్రులు'లో నాగేశ్వరరావు, జ్యోతి.

చిత్ర సమీక్ష:

# సరసాల విరసాల సరదాల సరదారులు "ఇద్దరు మిత్రులు"

చిత్రనిర్మాణ ప్రత్యేకత, చిత్రీకరణ నిపుణుల (డైరెక్షన్, కెమెరా, సంగీతం వగైరా) విశిష్టత నటీనటుల ప్రతిభ, సాహితీపరుల (కథ, మాటలు, పాటలు) సిద్ధహస్తం చక్కగా మేళవించిన సరికొత్త వినోద చిత్రం—అన్నపూర్ణా పిక్చర్స్‌వారి "ఇద్దరు మిత్రులు."

నిర్మాతకు తన చిత్రానికి సంబంధించిన నిర్దిష్టమైన ప్లాన్ చిత్రం ఉండడం కష్టం. ఉన్నా అందుకు అనువైన సన్నివేశాలతో, అందమైన సంఘటనలతో, ఆకర్షణీయమైన పాటలతో, మాటలతో, నృత్యాలతో కథ కట్టి, ఇవ్వడం కష్టం. ఇచ్చినా ఆ కథలోని పాత్రలకు జీవం పోయగల నటీనట వర్గం లభించడం, లభించినా వారిని దివ్యంగా చిత్రీకరించడం సులభంకాదు. కాని అన్నపూర్ణా పిక్చర్సువారు మాత్రం తెలుగులో తమ అయిదవ చిత్రం ద్వారా, ఇది కూడా సులభసాధ్యమేనని నిరూపించారు. తెలుగు వటన చిత్ర చరిత్రలో కొత్త ఘట్టాన్ని సృష్టించారు, అందుకు అన్నపూర్ణ విజయసారథి శ్రీ డి. మధుసూదనరావుగారిని ముందుగా అభినందించాలి.

"ఇద్దరు మిత్రుల" చిత్రంలో చెప్పుకోనదగిన కొత్త అంశాలు చాలా ఉన్నాయి. అందులో మొదటిది. నటీనటులకు సంబంధించినది. మన నటీనటులు ప్రేక్షకుల మనస్సులో కొన్ని రకాల నటన తమదిగా, అది తమ ప్రత్యేకతగా ముద్ర వేసి ఉంచారు. కాని ఇప్పుడా ముద్రను తొలగించింది "ఇద్దరు మిత్రులు". తమ అభిమాన నటీనటులను పూర్తిగా విభిన్నమైన పాత్రలలో ప్రేక్షకులు ఈ చిత్రంలో చూడగలరు. ఆనందించగలరు. హర్షించగలరు.

ముఖ్యంగా శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం ఈ చిత్రానికి తలమానికం. ఒకే పాత్రలో కథాగమనంలో వచ్చే పరిణామాలకు నటనారూపమివ్వడానికి, ఒకే సమయంలో రెండు విభిన్న మనస్తత్వాల వ్యక్తీకరణకు చాలా తేడా ఉంది. ఆయా సన్నివేశాలు నటుణ్ణి సరిబిరి చేస్తాయి. కాని పరిణతి చెందిన నటుడు ఇలాంటి సదవకాశాలను కోరతాడు. తన ప్రతిభ చూపదలుస్తాడు. శ్రీ నాగేశ్వరరావు ఈ చిత్రంలో తన ప్రతిభను చూపడమే కాదు. నటుడుగా సిద్ధహస్తుడని నిరూపించుకున్నాడు.

ఇలాంటి మరొక మహదవకాశం మరొక ఉత్తమ నటుడు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుకు లభించింది ఇదే చిత్రంలో. మాట విరుపులో, కంటి చూపులో, నడకలో, ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో, చేతికర్ర వూతంలో, కళ్లజోడు పట్టుతో "తేనెపూసిన కత్తి" లాగా ప్రవర్తించేవారిని కళ్లకు కట్టినట్టు చూపిన ప్రత్యేకత శ్రీ గుమ్మడిది. ఇలాంటి నటనలో ఆయనకు ఆయనే సాటి అనిపించా డీ చిత్రంలో.

ఇక శ్రీ రేలంగి రంగేలీరాయుడు కాదు. రంకెలు వేసే బ్రహ్మసాల పరంధామయ్య. సూర్యాకాంతం గయ్యాళి గవరమ్మ కాదు. భర్త ఆగడాలకు సమాధానంగా తన పెడసరితనాన్ని "ఫిట్సు" గా మార్చి పంతం నెగ్గించుకునే పల్లెటూరి ఇల్లాలు. శ్రీ రమణారెడ్డి ముమ్మూర్తులా పట్టి రామభజన రామదాసు. పద్మనాభం "కండలు తిరిగిన కొండ చిలువ" రూపంలో ఉన్న సుపుత్రుడు. ఇలా ఈ నలుగురు హాస్యనటులు సరికొత్త రూపంలో కనిపించడం ఈ చిత్రానికి కొత్తదనం ఇచ్చింది. పల్లె జీవితంలోని హాస్యం, దాని ఆయువుపట్టు వీరు చక్కగా చూపుతారు. పట్టె విస్సు దగ్గర నుంచి వేడివేడిగారెల విందు భోజనం, వియ్యంకుల సరసాలు, విరసాలతో ఈ చిత్రంలో కల్పించిన సన్నివేశాలు కడుపుబ్బ నవ్విస్తాయి. అన్నపూర్ణావారి ప్రత్యేకతను నిరూపిస్తాయి.

కెమెరాకు కొత్తవారు కాకపోయినా, కొత్త నటులుగా చెప్పుకోనదగిన శ్రీయుతులు కె. వెంకటేశ్వరరావు, నండూరి మురళీకృష్ణ, శ్రీమతి శారద ఈ చిత్రంలో ప్రముఖ పాత్రలు నిర్వహించారు. పేదింట పుట్టిన ఆడపిల్లగా శారద, గొప్పవారింట మూగ నౌకరుగా శ్రీ వెంకటేశ్వరరావు ప్రేక్షకుల మన్ననలు పొందారు. అవకాశాలు లభించే ఉత్తమ నటులు కాగలరని నిరూపించుకున్నారు.

కథానాయికలని చెప్పుకోదగిన రాజసులోచన, ఇ. వి. సరోజ విద్యావంతురాలైన, అభ్యుదయ భావాలు ఉన్న సతి—విలాసినులకు కట్టుబడి ఉండాలనే దీక్ష గల, ఆదర్శ యువతులుగా నటించారు. కన్నుల పండువుగా నృత్యాలు చేశారు. తమ పాత్రలను చక్కగా పోషించారు. గుమ్మడి మేనత్తగా శ్రీమతి ఋ. వరలక్ష్మి నటనలో కొత్తదనం చూపింది.

ఇలా నటీనటు లందరూ తమ తమ ప్రత్యేకతలతో, వైవిధ్యంతో చక్కగా నటించి పాత్రలుగా ఈ చిత్రంలో కనుపించడానికి కారణం—ఇద్దరు మిత్రుల కథలోను, సన్నివేశాల కూర్పులోను ఉంది.

ఈ కథలో మూడు రకాల తండ్రులు ఉన్నారు. ఒకరు. జమీందారు మేనేజరు. తన కూతురును ఆ జమీందారు బిడ్డకు ఇచ్చి సంబంధం కలుపుకోవాలనుకునే కుట్రదారు. రెండవవారు పట్టి డబ్బు మనిషి, కోడలు నగలతో వస్తేనే ఇంటిలో కాలు పెట్టాలని రంకెలువేసే పెంకి. మూడవవారు నిస్సహాయుడైన పట్టి రామభజన రామదాసు.

ఈ చిత్రంలో ముగ్గురు చెల్లెళ్లు ఉన్నారు. ఒకరు ధనికుల బిడ్డ. కాని మనస్సులో ధనిక తత్వం లేదు. రెండవవారు మధ్యమ తరగతి ఆడబిడ్డ, విద్యావతి, నీతికి నిలయం. మూడు. పేదింటి ముద్దుబిడ్డ. కుటుంబ గౌరవ, ప్రతిష్ఠలకు ప్రాణమిచ్చే ఆడబడుచు.

ఈ ఫిల్ములో ముగ్గురు కుమారులు ఉన్నారు. ఒకరు. జమీందారు కొడుకు. [illegible] లోతుపాతులు తెలియువు. రెండవవారు. పేద బిడ్డ, విద్యావంతుడు. నిరుద్యోగి. జీవితంలో కష్ట నష్టాలు చవిచూచినవాడు. మూడవవాడు. పట్టి వాజమ్మ. తండ్రిచేతి కీలుబొమ్మ. అమ్మచేతి ఆటబొమ్మ.

విభిన్న మనస్తత్వాలు కల ఇలాంటి పాత్రలతో కూడిన "ఇద్దరు మిత్రుల" కథకు మూలం "ఠాషేర్‌ఫుర్" అనే బెంగాలీ సినిమా కథ అయినా దానికి గమనాల మెరుగులు పెట్టి, కొత్త

## చిత్ర సమీక్ష

దనం తెచ్చిన "సినిమా అనుకరణ" దారులు శ్రీయుతులు డి. మధుసూదనరావు, (నిర్మాత) ఆదుర్తి, (దర్శకుడు) గో.రా. శాస్త్రి, కె. విశ్వనాథ్.

కథకు తగిన మాటలు కూర్పు: డాక్టరు. కొర్రపాటి గంగాధరరావు. చక్కని, చిక్కని తొమ్మిది పాటలు గుదిగుచ్చింది శ్రీయుతులు ఆరుద్ర (4), శ్రీ శ్రీ (2), దాశరధి (2), కొసరాజు (1). వీనిని కమ్మని సంగీతంతో నింపింది శ్రీ ఎస్. రాజేశ్వరరావు. వాటిని వీనుల విందుగా వినిపించింది సుశీల, ఘంటసాల, మాధవ పెద్ది, పి. బి. శ్రీనివాస్. ఆయా సన్నివేశాలను కన్నుల పండువుగా అమర్చింది (కళ) శ్రీ జి. సుబ్బా రావు. నృత్యంతో నింపింది శ్రీ హీరాలాల్ (కవాలీ నృత్యం సరోజ (గూపుడ్యాన్సు), శ్రీ వెంపటి.

పోతే ఈ కథను చిత్రీకరించడంలో దర్శకుడ్ని శ్రీ ఆదుర్తి సుబ్బారావు, అసిస్టెంటు శ్రీ కె. విశ్వనాథ్, కెమెరా శ్రీ పి. ఎస్. సెల్వరాజ్ చూపిన ప్రత్యేకతలు చిత్రానికి నిండుతనం తెచ్చాయి. శ్రీ నాగేశ్వరరావు ద్విపాత్రాభినయానికి ప్రాణం పోసింది శ్రీ శెల్వరాజ్ కెమెరా, చూస్తున్నంతసేపు ప్రేక్షకుణ్ణి గిలిగింతలు పెట్టించింది శ్రీ ఆదుర్తి దర్శకత్వం. ప్రతి పది నిముషాలకు ఒకమాటో, ఒక పాటో, ఒక నృత్యమో, ఒక హాస్య సన్నివేశమో ప్రత్యక్షమై, ప్రేక్షకుణ్ణి జిల్—జిల్ అనిపించే ఈ చిత్రం అన్నపూర్ణావారికి "గల్—గల్" చిత్రం. (ఎవ్)



విక్రం ప్రొడక్షన్స్ 'పెళ్ళితాంబూలం'లో జమున, రమణమూర్తి.

# సినీ విహారం

15–వ పేజీ తరువాయి

లోజు. ఆనాడే ఆమెకు కన్నెచర వదిలి స్త్రీ అయింది. కళ్యాణం జరిగిన శుభదినం, అదే దంపతుల ఏకాంతజీవనానికి తొలిరేయి. పందిరి మంచం, పూలపాన్పు, మధురమైన తినుబండారాలూ ఏమీ ఆమెకు కించిత్తయినా ఉషారివ్వలేక పోయాయి.

ఏదో సమస్య ఆమెతలను తొలిచేస్తున్నట్లున్నది. అదేమిటో ఆ అబ్బాయికి తెలిసినట్టే ఉంది, కాని, ఏమీ ఎరగనట్టు అమాయకుడిలా నటిస్తున్నాడు.

ఆమె రాగానే "సరోజా! సిగరెట్లేవి?" అని ప్రశ్నించాడు అబ్బాయి రాజా.

"లేవు" అని దీనంగా సమాధాన మిచ్చిందామె.

"లేవా? కోటుజేబుల్లో వెతికావా?" అని ఆమెవైపు చూశాడు. ఆమె "ఊ" అనగానే ఏదో జ్ఞాపకం వచ్చినట్లు తన జుబ్బా జేబుల్ని తడుముకోగానే సిగరెట్లు, అగ్గిపెట్టె చేతికి అందాయి. "అరెరె! నా జేబులోనే ఉన్నాయే! మర్చిపోయాను" అంటూ ఆమెవైపు చూశాడు రాజా. తన సరోజముఖారవిందంలో మచ్చుకైన ఉత్సాహము కనబడకపోవడం గమనించి రాజా "ఏం? అలా ఉన్నావేం? ఒంట్లో బాగాలేదా?" అని అని అడిగాడు ఆమెను.

"మైకం వస్తోంది" అని మాటలో స్వరంలా జవాబిచ్చింది ఆమె. అంతే .... ఆమె వెంటనే కళ్ళు తిరిగి పడిపోబోతూంటే రాజా ఆమెను పట్టుకుని "ఇప్పుడు మైకంగానే ఉంటుంది. ఆనందం ఎక్కువైతే ఆరోగ్యం కొంచెం అటూ ఇటూగానే ఉంటుంది" అని ఓదారుస్తూ ఆమెను పడకగది లోనికి తీసుకువెళ్ళాడు.

ఇది విజయా చిత్రం "గుండమ్మ కథ" కు చెందిన సన్నివేశం. రాజా సరోజలుగా నాగేశ్వరరావు, జమునలు చక్కగా నటించారు. ఈ చిత్రానికి నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణి. కథకుడు : చక్రపాణి, కవి : పింగళి నాగేంద్రరావు, మాటలు: డి. నరసరాజు, కళ : గోఖలే మరియు కళాధర్, సంగీతం : ఘంటసాల.

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావులు అన్నదమ్ముళ్ళుగాను, సావిత్రి, జమునలు అక్కచెల్లెళ్ళుగాను నటిస్తున్నారు. వీరుగాక ఎస్. వి.

అన్నపూర్ణావారి 'ఇద్దరు మిత్రులు'లో నాగేశ్వరరావు, ఇ. వి. సరోజ.

శ్రీ కృష్ణబాలాజీ ప్రొడక్షన్స్‌వారి 'ఆదర్శవీరులు'లో పద్మినీ ప్రియదర్శిని.

## సినీ విహారం

రంగారావు, రమణారెడ్డి, సూర్యకాంతం, హర నాథ్, విజయలక్ష్మి, మిక్కిలినేని, ఛాయాదేవి నటిస్తున్నారు.

### అక్కినేని కళాశాల భవనాలు

డిసెంబరు 20 వ తేదీన గుడివాడలో వెలిసిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావు కళాశాల నూతన భవనా లను మన విద్యామంత్రి శ్రీ పట్టాభి రామారావు తెరవబోతున్నారనీ, ఆ మహాసభకు మంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు అధ్యక్షత వహిస్తా రనీ, ఆ కళాశాలభవనం త్రైబరీహాలులో చిత్ర కారుడు చామకూర్ రచించిన అక్కినేని తైల వర్ణ చిత్రాన్ని విజయా వాహినీ అధిపతి శ్రీ నాగి రెడ్డి ఆవిష్కరిస్తారనీ ముందుగానే నిర్ణీతమైన కార్యక్రమం వివరాలు నాకు అందినవి. దానితో పాటు నాగేశ్వరరావు నన్ను గుడివాడకు రమ్మని ఆహ్వానించగా, అంగీకరించాను.

ఒకరోజు ముందుగానే నాగేశ్వరరావు గుడి వాడకు చేరుకున్నాడు. నేం ఆయన్ని సభావేదిక ముందు పోగైన అభిమానుల మధ్య కలుసుకుని పలకరించాం. ఒకసారి ఆ స్థితిలో ఆయన్ని జూమ్ లెన్స్ షాట్‌తో చూడగలిగినట్లు ఏవేవో భావాలు మాలో పరుగెత్తినవి.

నాగేశ్వరరావూ నేనూ మిత్రులూ కలిసి కళా

జగపతివారి 'అంతస్తులు'లో నాగేశ్వరరావు, సావిత్రి.

కాలనుంచి వారి స్వగృహానికి వెళ్లాం. అక్కడ ఆయన విందు ఏర్పాటు చేశారు. చెన్నపురి నుంచి వచ్చిన పెద్దలు, విజయవాడ నుండి సవ యుగా, విజయా డిస్ట్రిబ్యూటర్ల అధిపతులు పెద్దలు విందుకు ఏతెంచారు. విందు అనంతరం మధ్యాహ్నం మూడు గంటలకు మహాసభ ప్రారంభ మైంది. వేలాది సంఖ్యలో సభికులు హాజరయ్యారు.

మంత్రు లిద్దరూ ఏతెంచగానే కార్యక్రమం ఆరంభమైంది. మంత్రి శ్రీ పట్టాభి రామారావు కళాశాల భవనాల రిబ్బన్ కత్తిరించి ప్రవేశ మహోత్సవం జరిపారు. లైబ్రరీ హాలులోకి అంతా వచ్చారు. విజయా వాహినీ అధిపతి నాగి రెడ్డి నాగేశ్వరరావు తైలవర్ణ చిత్రాన్ని ఆవిష్క రించారు. ఆ చిత్రాన్ని జీవకళతో ఉట్టిపడేటట్లు ఎస్. ఎన్. చామకూర్ వ్రాశారు.

## సినీ విహారం

వేదికమీద రాజకీయ రంగానికి చెందిన పెద్ద లిద్దరు, చిత్ర పరిశ్రమకు చెందిన పెద్దలు, అల్లూరి, పట్టాభి రామారావు, నాగిరెడ్డి, నాగేశ్వర రావుగార్లు ఆసీనులయ్యారు.

మంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణకు ఈ సభకు విచ్చేసిన చలనచిత్ర పరిశ్రమలోని పెద్దల్ని చూడగానే చలనచిత్రాల కథనం గురించి ఆయనలో చిరకాలంనుంచి పెరుగుతున్న ఫిర్యాదును చెప్పె య్యాలని ఉత్సాహం కలిగింది. మన చలనచిత్రా లలో ప్రేమలోపడిన యువతీ యువకులు ఆనందంగా వనవిహారం చేస్తూ సన్నిహితంగా సర సాలు చేసుకుంటూ, వారితోబాటు ప్రేక్షక లోకాన్ని కూడా ఏవో మధురస్మృతుల వైపునకు లాక్కుని వెళ్లుతున్న మధుర ఘట్టంలో ఒక పాటను ప్రవేశపెట్టి, పాట వెంట తక్కువగా రాండోళ్లతో నేపథ్య సంగీతం ప్రవేశపెట్టి సహ జత్వానికి దూరంగా ప్రేమ సన్నివేశాల్ని చిత్రీక రించే ఆచారానికి స్వస్తి చెప్పమని ఆయన కోరాడు. ఏకాంతంగా గడిపే ప్రేమికుల జంట పాటలు పాడరనీ, అది సహజ విరుద్ధమనీ, ప్రతి హీరో హీరోయినూ, కవులూ కవయిత్రులూ కారనీ, ఆ మధురసన్నివేశాలలో వారి ప్రణయభావాన్ని పెంచగలిగే సాధనగా ఏ రేడియో, ట్రాన్సిస్టర్ నుంచో వెలువడే సన్నని సంగీతమే కాని, రాండోళ్ల వాయిద్యాలతో వారు ప్రేమను పెడబొబ్బలతో ప్రదర్శించుకోరని మంత్రి శ్రీ ఆవేదన, విమర్శ కూడా.

నిజమే, ఆయన ప్రతిపాదనను ముందుగా మేం 'సెకండ్' చేస్తాము. 

# గళ్లనుడికట్టు - 86

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | ■ | 4 | ■ | 5 | | 6 |
| | ■ | 7 | | | | | | | ■ | |
| ■ | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | ■ |
| 8 | ■ | 9 | | | ■ | 10 | | 11 | ■ | 12 |
| 13 | | | ■ | | ■ | 14 | ■ | 15 | | |
| | ■ | | ■ | ■ | ■ | ■ | ■ | | ■ | |
| 16 | | | ■ | 17 | ■ | 18 | ■ | 19 | | |
| | ■ | 20 | | | ■ | 21 | | | ■ | |
| ■ | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | ■ |
| 22 | ■ | 23 | | | | | | 24 | ■ | 25 |
| 26 | | | ■ | | ■ | | ■ | 27 | | |

## అడ్డం

1. వాడి గుణము !
5. చీటివేల చెలికత్తెల కాళ్లక్రింద.
7. తాళవృక్షము, ఫణము, తృతీయ పురుష—ఇవి కలిస్తే బలరాముడు, భీష్ముడు !
9. ఒక నదిపేరు శరత్ నవల పేరు ఒకటి.
10. నడవక సేతువుకోసం వెతకాలి.
13. శబ్దము.
15. చిందరవందర అయిపోయిన కాలు, బంతి.
16. తిరిగి గానం చెయ్యుము, అనే మాటకలగా పులగ మయిపోయింది !
19. బోడి కలిస్తే సేవకుడు దొరుకుతాడు !
20. బంటు.
21. ఈ తూకము చిందరవందర అయిపోయింది. రూపాయి ఎత్తు.
23. మొసలి ముఖ మేర్పడజేసిన పురుషుని కర్ణ భాషా విశేషము, అవి శబ్దరత్నాకరము. ఒక రాశి పేరు, కుండ కలిపితే తెలుస్తుంది!
26. ఆఖరున.
27: మసి వంగిన మాటలో ఒక జంతువు.

## నిలువు

1. దూడి.
2. క్రిందనుంచి చుట్టవస్త్రం.
3. ఒక యుగం !
4. రాకను రావద్దనము.
5. మంచి కాదు.
6. ఖడ్గము.
8. మృగములు.
9. 13. అడ్డంలో మధ్య తీసి, తలక్రిందులయిన వద్దకు చేరిస్తే హంస !
11. ఎక్కువగా మాట్లాడేవాడు.
12. కలిగించేది ఆపాదమస్తకములోనే !
17. గగుర్పాటు.
18. క్షీరసాగరము.
22. 'బొబ్బిలి యుద్ధం'లో ఒక వ్యక్తి పేరు వంభూతము !
23. కీలు.
24. రాము సిరా మరకలో బొంకు.
25. తామ్రము.

## 85-వ గళ్లనుడికట్టుకు జవాబు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆ | య | న | ■ | డ | లు | కు | ■ | జ | న | ప్ర |
| వృ | ■ | య | ■ | ర | ■ | లు | ■ | ల | ■ | ద్ధ |
| ■ | ఆ | నం | ద | ము | ■ | కు | టి | జ | ము | ■ |
| పే | గు | ■ | రు | ■ | ■ | ■ | ము | ■ | త్యం | ప్ర |
| కు | ■ | అ | వు | స్సు | ■ | శ | కు | ని | ■ | ష్టి |
| ■ | పాం | టు | ■ | లి | వ | న | ■ | జ | డ | ■ |
| నె | ■ | క | ను | క | ■ | గ | జ | ము | ■ | సాం |
| వే | ల | ■ | సు | ■ | ■ | ■ | వు | ■ | తో | కం |
| ■ | యు | మ | పు | రి | ■ | మి | ళి | తే | ము | ■ |
| ఆ | ■ | లు | ■ | క్షా | ■ | త | ■ | జి | ■ | తా |
| వే | ల | పు | ■ | లు | త్యా | ము | ■ | కి | ణు | పు |

పొరుగింటాయన తన మీదకు అనవసరంగా కజ్జాకు వస్తున్నాడని ఒక పెద్దమనిషి పోలీసు అధికారులకు ఫిర్యాదు చేశాడు.

పోలీసు అధికారి: మీ పొరుగింటాయన ఎలా ఉంటాడండీ! మీసం ఉంటుందా?

ఫిర్యాది: ఏమోనండి గట్టిగా చెప్పలేను. అతడికి మీసం ఇది వరకు ఉన్నా ఇప్పుడు ఉంటుందని నమ్మకం ఏమిటి.?

*　　*　　*　　*

ఆరోగ్యం బాగుపడటానికి యోగాసనాలు వేయమని ఒక త్రాగుబోతుకు ఒక సన్యాసి నచ్చచెప్పాడు. ఏ కళనా ఉన్నాడో అతడికి ఆ సలహానచ్చింది. కొంత కాలం తంటాలుపడి యోగాసనాలు వెయ్యటం నేర్చుకున్నాడు.

ఒకరోజున ప్రక్క ఇంటి పిన్నిగారు 'యోగాసనాల వల్ల మీ ఆయన ఆరోగ్యమేమన్నా బాగుపడిందా అని' ఆయన భార్యను అడిగింది.

'ఆరోగ్యం బాగుపడటం మాట దేవుడెరుగు! ఇప్పుడాయన శీర్షాసనం వేసికూడా త్రాగుతున్నారు.' అని ఆమె నిట్టూర్చింది.

ఆ కాంతులు గూడ చీకట్లను అలముకొని మసక మసకగా నున్నవి. కాల మెట్లు గడచుచున్నదియు తెలియుటలేదు. సూర్యుడస్తమించెనో, లేదో తెలియుటలేదు. ఆ వర్షావేళ పగటివేళను రాత్రి వచ్చి గ్రసించినట్టు లున్నది. సుదక్షిణ ఎప్పుడో తండ్రిదగ్గరనుండి లేచినది. ఎప్పుడో వేడినీట స్నాన మాడినది. తండ్రి ఆ దినమున నిట్రుపవాసము. తానును ఉపవాస మున్నది. మధ్య నెప్పుడో ఆకాశము తెరపి యిచ్చి, అంతలో మరల మూసుకు పోయినది. పౌండ్రకుడు, వాచాలుడు ఎచ్చట నున్నారో ఆమెకు తెలియలేదు. ఆమె అతని మందిరమునకుపోయి చూచినది. ఆ మందిరములో బంగారముతో చేయబడిన ఒక లేడి యొక్క ప్రతి రూపము తప్ప మరి ఎవ్వరును ఆమెకు కన్పించ

# హరివంశం

11వ పేజీ తరువాయి

లేదు. ఆ స్వర్ణమృగమును గూర్చి తన స్వామి తనకు చెప్పలేదు. సుదక్షిణ దానిని పరీక్షగా చూచినది. అది సాందీపని ఆశ్రమ మృగమును పోలి ఉన్నది. దానిని చూడగా నామెకు పౌండ్రకుని యెడ ప్రేమయు, సానుభూతియు పుక్కిలింత లయినవి.

ఆమెకు ఒకసారి తన స్వామియొక్క విద్యాభ్యసన పద్ధతి యంతయు కన్నులముం దాడినది. అంతలో నామెకు ఏదో ఆలోచనయు కల్గినది. తన స్వామి యిప్పుడు ఏమి చేయుచుండును ? బయట వర్షము. బృందావనమున ఇంద్రుడు శ్రీ కృష్ణదేవునిపై కినిసి కురిపించిన జడివలె ఉన్నది. అప్పుడు స్వామి గోవర్ధనము నెత్తి అందరను రక్షించెను. ఇప్పుడు తన స్వామి ఏమి చేయుచున్నాడు. ఆమెకు పౌండ్రకు డెక్కడున్నాడో వెదుకవలయు ననిపించినది. ఇంత వర్షము పడుచుండగా ఎచ్చట నుండును ? ఏమి చేయుచుండును ! వాచాలుడు కన్పించినను బాగుండును ! ఈ విషయమును సేవకులతో, దాసీలతో, చెలికత్తెలతో మాటాడరాదు. ఆమె మాటాడలేదు. వాచాలు డామెకు కనుపించలేదు.

ఆమె తిరిగి తన తండ్రి మందిరమునకు వచ్చినది. అప్పుడు అచ్చటి దృశ్యమును చూచి ఆమె అప్రతిభురాలై పోయినది. ★

కీ టప్పింటప్పీ పెంచిం చింకోటుంది. మామయ్య దగ్గర నలుడు, భీముడు లాంటి యితిహాస నాయ కుల వంశంలో పుట్టాల్సిన మాంచి ఒకటో రకం వంటవాడు కిష్టయ్య ఉన్నాడు. కిష్టయ్య గోపాలా నికి మరీ యిష్టమయిన తైర్‌వడల స్పెషలిస్టు! కిష్టయ్యలాగా వంట చెయ్యడం ఆడవాళ్లకూ్కడా రాదంటే రాధకి కోపం వస్తుంది.

కాబట్టి తైర్‌వడలు తినాలంటే, కొన్నాళ్ళ రాధ నింటికి వెళ్లనిచ్చేసి తను చిన్నమామ దగ్గ రికి వెళ్లిపోడమే కర్తవ్య మనిపించింది గోపాలానికి.

గోపాలం, మామయ్య ఇంటిలో కడుగు పెట్ట గానే, వాకిట్లో మొదటగా కనబడింది, రామయ్య గారు. రామయ్యగా రిక్కడో దూరపు బంధువు. సుమారు ఎనభైఏళ్ల వయస్సు, బ్లడ్ ప్రెషర్. ముక్కుమీద కోపం, తనెప్పుడో వెలిగించిన తాసి ల్దారు గిరీ నాటి మధురస్మృతులు, మొండి పట్టు దల, కొద్దిపాటి అహంకారం—అవీ ఆయన ఆస్తి.

"ఏరా, గోపాలం! కులాసాగా ఉంటున్నావా! రా .... రా!" అంటూ ఆహ్వానించాడు ముసలాయన. తనంతటివాడిని పట్టుకుని యిలా ఏకవచన ప్రయోగం చేసెయ్యడం గోపాలానికి, తేలిగ్గా చెప్పాలంటే రుచించలేదు.

"చిన్నప్పు డింతుండేవాడివి. ఇప్పుడు తాటి చెట్టులా ఎదిగిపోయావు!" చేతిని కప్పలా ముడిచి నేలకి జానె డెత్తున ఒకసారి, సాగినంత ఎత్తున ఒకసారి చూపెట్టి అభినయిస్తూ మరీ చెప్పాడు రామయ్యగారు.

చెట్టంతటి మనిషిని, చెట్టులా ఎదిగావనడం, యింకా అసలే బాగోలేదు. ఇదిగాదు పనసుకొని లోపలి కెళ్లాడు గోపాలం.

మామయ్య మేడమీద కనబడ్డాడు గాని, ఆ మొగంలో యిదివరకటి కళ, ఉత్సాహం వగై రాలు లేవు. కళ్ల చుట్టూ నల్లగీతలు, శూన్యం లోకి చూడ్డం, బుగ్గలు పాలిపోయి దిగజారడం, పెదిమలు వాలిపోవడం లాంటి మహా బాధితుల లక్షణాలు ఏవీ లేకపోయినా, మామయ్య మన సులో ఏదో పెద్ద సమస్యే జొరబడి దొలిచేస్తోం దని గ్రహించాడు గోపాలం. గోపాలానికీ పరిస్థితి అంతగా అర్థంకాలేదు. భోలెడు ఆస్తి, పెద్ద మేడ, చక్కటి పల్లెటూర్లో రాజాలాగ జీవనం, కిష్టయ్య, యిన్ని సదుపాయాలున్న మానవు డెవడూ అలా డీలాపడిపోవడాని కర్హుడుగాడు.

"ఏంరా! వచ్చావా!" ఉత్సాహం తెచ్చుకుని మామయ్య పలకరించాడు. ఆ పలకరింపులో ఉత్సా హము కన్నా నీరసం, ఆనందం కన్నా విచారం, సంతోషంకన్నా దుఃఖం, సుఖంకన్నా బాధ ఎక్కు వగా కనిపిస్తూంటే, గోపాలం కొంచెం తేలిగ్గా మాట్లాడి, మామయ్య గుండెల్లో బాధ బరు వుని దించాలనుకున్నాడు.

"నీ దగ్గిర కిష్టయ్య ఉన్నంతకాలం, నెలకొకసా రయినా రాకుండా ఉంటానా మామా!"

"ఇంకెక్కడి కిష్టయ్య గోపీ! వాడాశ వదులుకో వలసిందే!"

"ఏం, టపా కట్టేస్తున్నాడా? హేమరేజా? థ్రాంబోసిసా?"

8-వ పేజీ తరువాయి

"నీ మొహం! హేమరేజో, థ్రాంబోసిస్సో అయి తేనేగాని చావరేంరా మనుష్యులు? .... ఇంతకీ చిట్టి పాపేది! క్రింద నుందా!" నీరసంగా నవ్వి అన్నా డాయన.

"చిట్టి లేదు, పాట్టి లేదు! నే నొక్కణ్ణే వచ్చాను."

"పాప లేకుండా ఏం చేద్దామని వచ్చావురా ఒక్కడివీ, వేలు లూగించుకుంటూ! తైర్‌వడలు తినడానికా!"

మామయ్య నవ్వుతూనే అన్నా గోపాలానికి నసాలాని కంటింది.

"మొత్తానికి కష్టపడి ఎలాగయితేనేం, ఆరు గురూ కలిసి వో పాపాయిని కన్నారు గాని, దాని కొక్కత్తెకే లేదు బుర్ర! నాకూ ఉంది!"

---

ఒక ప్రఖ్యాత రచయితకొక ఉత్తరం వచ్చింది. దానిపైన అతని పేరేగాని చిరునామా లేదు: "ఎక్కడున్నాడో దేవుడి కెరుక!" అని వ్రాసివుంది,

ఉత్తరం పంపినాయనకు రచ యిత సమాధానం పంపాడు. 'దేవుడికెరుకే!'

వి.సి. చౌదరి, (తెనాలి)

---

"ఒరేయ్! నువ్వలా రెచ్చిపోకు. చెప్పేది విను" అంటూ సంగతి నెమ్మదిగా చెప్పుకొచ్చాడు మామయ్య.

రామయ్యగా రిక్కడికి వచ్చి వారంరోజు లయింది. సరిగ్గా రెండు నెళ్ళ విశ్రాంతి తీసు కోవాలనే తలపులో ఉన్నవాడు గాబట్టి, ఇంటిలో యిద్దరు అడివికోతుల్లాంటి పిల్లకాయల్ని చూడ గానే బేజారెత్తిపోయాడు. వీళ్లిద్దరూ కలిసి ఏదన్నా అఘాయిత్యం చేస్తే తన గతేంకాను రక్తంపోటు ఎక్కువై అసలికే మోసం అవుతుం దేమో!

"ఇద్దరెవరు? బుజ్జి ఒక్కడేగా!"—గోపాలం సందేహం.

" 'నానీ' కూడా యిక్కడే ఉన్నాడులే ప్రస్తుతం. కాలేజీకి సెలవులుగదాని వాణ్ణి రమ్మన్నాను."

గోపాలాన్ని యెవరో వీపు బాది లేపినట్ట యింది. అతనికున్న సుమారు డజన్న పైచిలుకు బావమరుదుల్లోనూ 'నానీ' ఒకటోరకం పిలకాయ. నానీ ముట్టుకు పెళ్ళక్కడున్నా ఉన్నాడంటే, గోపాలం అటు భూమిలోకో యిటు ఆకాశంలోకో పారి పోతాడు. వాడికి తెలియని, రాని సాహస కృత్యాలూ ఘాతుకచర్యలు వగైరా ఏం లేవు. ఉన్నా, లేటెస్టు చెత్త కామిక్సు, టార్జాన్ సినిమాలు చదివి, చూసి నేర్చేసుకుంటాడు.

"నానీ యిక్కడున్నాడా!" మాటల్ని కంఠంని భావాన్ని బయటపెట్టా తిరిగి అన్నాడు గోపాలం.

"ఏం, అలా కెంగిలు పడిపోతావు? .... వీళ్ళి ద్దర్నీ గోల చెయ్యకుండా అదుపులో ఉంచేం దుకు ముసలాయనో ప్లాను వేశాడు. తనిక్కడున్న రోజుల్లో ఎవ రెక్కువ మంచబ్బాయి అనిపించు కుంటే వాడికో వంద రూపాయలు బహుమానంట.'

"దానికేం! నిక్షేపంలా ఆ వంద రూపాయలు తనవే ననుకొని బుజ్జిగాడు బడ్జెట్టు వేసినుకో వచ్చు. లేకపోతే అది చూపెట్టి అడ్వాన్సుగా అప్పుచ్చుకోవచ్చు!"

"అలాగే అనుకుని నేను గడ్డి తిన్నాను. బుజ్జిచేత ఎవడూ గోల చేయించలేదు. నానీ గోల తగ్గించలేదు. అందుకని, ఆ యింటి పక్క మాజీ సర్కిలు యినస్పెక్టరాయన తీరికగా కూర్చుని పందెం కాయమంటే, కాశాను. నానీ నెగ్గుతాడ నాయన! బుజ్జి అని నేను! షరతు లేమిటో తెలుసా! నే నోడిపోతే కిష్టయ్యని మనం వదులు కోవాలి! కిష్టయ్యంతటి నమ్మకస్తుడూ, మంచి వాడు యింకెక్కడా దొరకడు. అతనిమీ దెప్పటినుంచి కన్నేసి ఉంచాడో! యిప్పుడీ సన్నాగం పన్నాడు!"

"అయితే నేంలే! బుజ్జిమీద పందెం కాయడం అంటే, నెహ్రూ ఎలక్షన్లో నెగ్గుతాడని కాసినట్టే! మీ పొరుగాయన యిస్తానన్న వెయ్యి రూపా యలూ కృష్ణార్పణ మనుకోవచ్చు!"

"పరిస్థితు లంత ఆశాజనకంగా లేవురా, గోపీ!" అన్నాడు మామయ్య, దుఃఖాన్ని ఉబకకుండా దిగ మింగి. "నానీ మంచివాడయి పోయాడు! వాడలా ఉన్నట్టుండి మారిపోతా డనుకోలేదు! కిష్టయ్య యింక మనకి కానట్టే!"

"అదేమిటి మామా, అలా గాభరాపడిపోతావు! నే వొచ్చాగా! అంతా రైటయిపోతుంది చూడు."

"నువొచ్చావని సంతోషించాను, చిట్టి పాపని కూడా తీసుకొస్తా వనుకొని! యిప్పు డింక ఆ ఆశా లేదు!"

"అది లేకపోతే పోయిందేం లేదు! అసలు మీరంతా దాన్నలా నెత్తి కెక్కించుకోబట్టే ఇప్పుడు నామాట వినకుండా పోయింది!"

"ఏమిట్రా అది చేసిన అపరాధం!"

గోపాలం ఓ చక్కటి సాయంకాలం, ఆకాశంలో మేఘాలు ఎరుపురంగు దిద్దుకుంటున్నప్పుడు, రాధతో కలిసి సినిమాకి తయారయి ఎప్పుడో కొన్న ముదురు ఎరుపు చారల 'క్రీం' రంగు టె

పిగిలించడం మొదలెట్టాడు. అది బాగోలేదు, తీసెయ్యమని రాధ అనడంతో రాజుకొంది పేచీ. తన శరీరంమీద, బట్టలమీద అధికారం చలాయించ టానికి ఆమెకేం హక్కుందంటాడు గోపాలం. గోపాలం అది తగిలించుకుని పోతూంటే, తను గూడా సర్కస్ జంతువుని చూసినట్లు వెక్కిరింతగా చూస్తూంటే పక్కనుండి, తను భరించలే నంటుంది రాధ. అదలా చినికి చినికి గాలివానయింది.

"నా వ్యక్తిగతస్వేచ్ఛని, స్వాతంత్ర్యాన్ని ఆమె నియంతలాగ ఆక్రమించ జూడ్డం, ఒక పౌరుడిగా నా ప్రాథమిక హక్కులికి భంగం!" అని బల్లగుద్ది చెప్పేశాడు గోపాలం.

"ఏడిశావులే గాని, క్రీం రంగుమీద ఎర్ర గీతలు ఏమిట్రా, పగటి వేషగాడిలాగ!" మామయ్య కెరటాల్లా వస్తున్న నవ్వు నాపుకో లేక మధ్య మధ్య వదిలిన మాటల సారాంశం అది.

చివరికి గోపాలం ఆయన్ని ఒప్పించలేనని ఒప్పేసుగుని, అసలు విషయం సాధించడానికి కంకణం గట్టుకుని, సాధిస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

మర్నాడు పొద్దున్నే నెమ్మదిగా రామయ్యగారి దగ్గిర జేరి, 'తాతయ్యా' అంటూ కుశలప్రశ్నలు వేసి ఆయన నడపబోతున్న మంచితనం పోటీ వివరాలు సేకరించాడు గోపాలం. గోపాల మంతటి నవయువకుడు తన అద్భుత ప్రణాళికలో ఉత్సాహం చూపెట్టడం చూసి మురిసిపోయాడు ముసలాయన.

"నీకేమన్నా ఐడియా లుంటే చెప్పు .... నే ననుకున్న దిదీ. ప్రతిరోజూ పొద్దున్నే లేవగానే యిద్దరికీ చెరో పాతిక మార్కులూ యిస్తాను. ఆతర్వాత రోజంతా వాళ్ళు చేసే పనులు గమనించి, కానిదేదన్నా చేస్తే కొన్ని మార్కులు తీసేస్తాను. మొత్తం ఎవ రెక్కువ మార్కులు తెచ్చుకుంటే వాళ్ళు నెగ్గినట్టు! ఒక్కటి చెప్పాలోయ్ గోపాలం! యీ పోటీ పుణ్యమా అని పాపం పిల్లకాయ లిద్దరూ పోరెత్తడం లేదు సరిగదా, పట్టి సాధువు లయిపోయా రనుకో!"

" 'కాని పనులు' అంటే ఏమిటో నిర్వచించండి."

"నా మంచంకింద కుక్కచేత మొరిగించాడనుకో, లేకపోతే ఏ మధ్యాహ్నంపూటో నేను కాస్త కునుకుదీసేవేళ సినారేకు డబ్బామీద వాయించాడనుకో! అపని నా క్కలిగించిన చికాకును బట్టి అయిదో, పదో విరగ్గోస్తాను."

"మీకు చికాకు కలిగిస్తేనే తీసేస్తారా, లేకపోతే నాలాంటివాడికి కలిగించినానా! 'సపోజ్!' ఏ కాలవొడ్డునో కూర్చున్నప్పుడు నన్ను ఉన్నపళాన నీళ్ళల్లోకి తోసేశా డనుకోండి. ఎన్ని మార్కులు తీసేస్తారు?"

"ఆఁ! అంతపనే! అలా చేసినవాడికి నిర్దాక్షిణ్యంగా పూరా పాతిక మార్కులు విరగ్గోసేస్తాను. నాకుజరిగితే ఒకటీ, నీకు జరిగితే ఒకటీనా! నిన్నేదన్నా ఎవడన్నాచేస్తేవెంటనే నాకుచెప్పు. ఆసంగతి నేను చూస్తాను.యిదుగో, గోపాలం! ఈ పోటీ విజయవంతం కావాలంటే, నేనేదో పక్షపాతంతో ఆ వంద రూపాయలూ ముట్టజెప్పానని నలుగురూ అనుకో

## తీయని బాధా తొలి ప్రేమా

**కుండా ఉండాలంటే, నీ సహాయం, సహకారం చాలా అవసరం. నాకు చాలా తోడ్పడాలి నువ్వు!"**

తప్పకుండా అలాగే అంటూ బయటపడ్డాడు గోపాలం.

గోపాలం అనుమానాలు విడిపోయాయి. ఇంక జరగాల్సింది కార్యాచరణే. నానీ తనని చూడగానే ఎలాగా వూరుకోడు. ఏదో కొంటెపని చేస్తాడు. చెయ్యకపోయినా రెచ్చగొట్టి చేయించవచ్చు. దాంతో నానీ మంచితనం కాస్తా గుడ్డుసున్నా చుట్టినట్టే!

నెమ్మదిగా అలా తోటలో నడిచి వెళ్తూంటే దూరంగా నానీ ఒక్కడూ అటు తిరిగి కూర్చుని కనిపించాడు, మోటబావి అంచున కూర్చుని ఆకాశంలోకి చూస్తూ. పక్కనేవో పుస్తకా లున్నాయి. దగ్గిరకి రాగానే ఏదో సణుగుడు వినిపించింది గోపాలానికి. నెమ్మదిగా పొంచుండి విన్నాడు.

"రాత్రే నీ ముసుగు. నక్షత్రాలే నీ దీపాలు. భూమే నీ ఉయ్యాల. నేనే ఆటబొమ్మ. నీ గుడి

---

"మేనేజరుగారిని చూడటానికి వీల్లేదు," అన్నాడొక అటెండరు "ఆయన నిద్రపోతున్నారు."

ఎ. వి. ఆర్, (మద్రాసు)

---

మాత్రం నా కలల్లో! నీతోనే నా ఆటలు, మాటలు. నీకోసమే నా కోపం, కన్నీరు! నువ్వే నా గర్వం, నువ్వే నా నిరాశ! ఈ ఉదయాలు, అస్తమయాలు అన్నీ నీకోసం! ఈ విశ్వమంతా నీ హృదయంలో, నువ్వు నా హృదయంలో!

"అగాధ జలాంధకార తరంగాలమీద తేలివచ్చే నీలచ్ఛాయలు, శీతల వాయు సంచలనంతో కలిసి తాకే మృదుశాంత కీటకరవాలు, నిశ్శబ్ద నిబిడ ప్రశాంతిలో వూగే జలజపత్ర సుగంధాలు, నిఖిలం, నిర్నిద్ర నిశ్వాసరహిత నిరీక్షణావస్థలో వేచి ఉన్నాయి. భవదీయకరుణ ఝంఝా ప్రళయానిలం కోసం, నీకై, సమస్తం నీకోసం!

"దిక్కులు నిశ్శబ్దంగా మార్మ్రోగే అన్వేషణ ఫలితంగా చూశాను నిన్ను. నీ తెల్లటి నుదుటిమీద పడే నల్లటి కుంతలాల కోసం, కార్తీక ఆకాశాన్ని ధిక్కరించే నీ మెడకింద నునుపుకోసం, మధ్యాహ్నపు కొండనీడల చీకట్లవంటి నీ వక్షపు ఛాయలకోసం, నే నెంత తపించాను! ఎన్ని గీతాలు కీర్తించాను! .... నీకోసం! నీకోసం నీ ముందు మోకరిస్తున్నాను. నా చేతుల్ని కాదని తప్పించుకొని అంధకారంలోకి జారి నానుంచి దూరమైపోకు! నన్ను నిరాకరించకు!

"ప్రియాలింగనం తర్వాత ఆనందపు టాకాశంలో తేలిపోయే సుందరివదనంలాంటి గాలిలో! కొత్త చల్లదనం శరీరంమీద తగిలి హృదయంలో! దూసుకుపోతూంది. ఆకాశం మబ్బుల వెనక మాయమైంది. నిద్ర కమ్మిన కన్నులాగ ఒక్కగా నొక్క నక్షత్రం మిణుకు మంటోంది. ప్రపంచాన్నే తుడిచేద్దా మన్నట్టు వీస్తోంది గాలి. నల్లని సందె యింకా నల్లని మబ్బు వస్త్రాలు కప్పుకుని ఏడుస్తోంది. హోరుమని అరుస్తూ వానలోపలికి వస్తానని పంతంపట్టి, మూసిన నా తలుపుల మీద యీడ్చి కొడుతోంది తెరవమని. కొంచెం మరిచిపోతుంది. మళ్ళా నేను జ్ఞాపకం వస్తాను గావును, దబదబా బాదుతుంది. యీ గోలలో, గాలిలో పాపం ఏదో పిట్ట లేచి అరుస్తోంది. చప్పున గాలి ఆగింది. చచ్చిపోయినట్టు నది కూడా నిశ్శబ్దం అయింది. చీకటి! నిశ్శబ్దం! నువ్వు లేవు!

"నువ్వు రావు! నన్ను రానీవు! మరల్చి మత్తెక్కించి, కలలతో లాలించి, మధుర గానాలతో వూగించి, లోకానికి పనికిమాలినవాడ్ని చేశావు! దిగులు కళ్లతో, వెర్రిచూపులతో, మరపు మాటలతో, అన్ని విశ్వాసాలు నశించి తిరుగుతున్నా ఓ బైరాగి. అనాదిగా విన్న నీ పిలుపు, స్వప్నంలో అనుభవించిన నీ కుంతలాల కొనల స్పర్శ, ఏ యుగాంత అవలి తీరాన్నో ఆలింగనమనే నమ్మిక—ఇంతే నాకు మిగిలిన ఆశలు. నీకోసం వెతికి అలిసి నా చూపులు తమలోకి తామే చూసుకుంటున్నాయి. హృదయం తనలో తానే గొణుక్కుంటోంది. ఎండమావుల సౌందర్యానికై తపించి, ఎండి, ఒడిలి లయమయ్యే యీ నిర్భాగ్యుణ్ణి చూసి దిక్కులే నవ్వాయి, చుక్కలే ఏడ్చాయి.

"రాలేవా! ఒక్కసారి యీ రాత్రికి రాలేవా! నీ కిటికీలోంచి, సముద్రంమీంచి ఎగిరి, అద్భుత మహిమాన్వితమైన యీ రాత్రిలో నక్షత్రాలకింది వెలుగులో రాలేవా! ఒక్కసారి యీ రాత్రికి! నిన్ను తల్చుకుని నీకోసం, శూన్యంవైపు చేతులు జాచి జాచి నా మనోవేదనకై యేడ్చి యేడ్చి గతి లేక ఎక్కిళ్లను లోపలే కుక్కుకుని పడుకుంటాను ప్రతి రాత్రీ.

"నీ కోసం నిద్రలో వెతుక్కుని చేతులు, నన్ను నిద్రనుంచి లేపి 'ఎక్కడ' అని అడుగుతాయి. సముద్రంలోకి ఎంత ప్రవహించి వినుగుచెందని నదిలాగ, నిన్నన్వేషించే గుణాన్ని మనసు మానుకోలేదు. ఇట్లానే రాత్రులు పక్కమీద ఒంటరిగా పడుకొని, ఉత్తచేతుల్ని శూన్యంవైపుకి జాచి, శుష్కించి మరణించడంలోనే అంతమా! ఇట్లా నీనుంచి వేరుపడి చివరికి నువ్వు వచ్చినప్పుడు మాడి బొగ్గునై ఉంటానేమో! ఈ కలలు కూడా మిగలవేమో!

"నే నెట్లా మరువను నిన్ను! మబ్బుల వెనుక నుంచి నీ దోబూచులు, పువ్వుల వెనక నుంచి నీ నవ్వులు, నా కళ్లలో నీ నీడలు, నా సుఖాలలో నీ స్పర్శలు, నిద్దట్లో నీ రహస్యాలు! ఎట్లా మరు

వను నిన్ను. చీకట్లో ప్రతీ మూలా నీ చేతులే! ప్రతి శబ్దంలోనూ నీ కంఠమే. ప్రతి ఆశలోనూ నీ సహాయమే! ప్రతీ దిక్కునా నీ చూపులే! ఎట్లా మరువను నిన్ను.

"రాత్రి రాత్రి నీకోసం వెయ్యి కళ్లతో అడిగే నక్షత్రాల నడుగు. ఏడుస్తో ప్రవహించే నదుల నడుగు. వెదుకుతో పరుగులెత్తే గాలి నడుగు. నీ ద్రోహాన్ని నమ్మలేక వెలవెలబోయే చందమామ నడుగు—ఎట్లా మరువను నిన్ను! ఏంచెయ్యను.'!

చాటునుండి వింటున్న గోపాలానికి యీ మాటలు అంతు చిక్కలేదు. అనంతమైన విరహాలహరి అది.

"హలో వోల్డ్ బాయ్! యిలా ఒక్కడివి కూర్చుని ఆకాశం, మబ్బులు, గాలి, ఉడతలు, కొంగలు అంటూ ఎంగిలిమాట లప్పజెప్పుతున్నా వెవడికిహోయ్!" యిదేమన్నా సీరియల్ ప్రేమపురాణ మేమిటి?"

"ఎవరదీ, నువ్వా బావా! ఎప్పు డొచ్చావు?" నాని మాటలు చాలా శాంతంగా, నెమ్మదిగా, గౌరవంగా మరో లోకం నుంచి అన్నట్టు వినవస్తున్నాయి. గోపాలాని కాశ్చర్యం, జాలి, సానుభూతి లాంటి వెన్నో కలిగాయి.

"ఏంరా! నిక్షేపంలా బతుకుతున్నవాడివి యిలా గయిపోయావు! ఏమి టిదంతా! నువ్వింకా ఆ తడికల కాలేజీలోనేనా చదివేది?" నానిని రెచ్చగొట్టే మార్గాల్లో అదొకటి. ఉత్తప్పు డెప్పుడన్నా అమాట గోపాలం అంటే, దారుణమైన ప్రతీకార మేదో ఒకటి చేసితీరాడన్నమాటే! యిప్పుడు మాత్రం నాని నిసలయిన వేదాంతిలాగా మందహాసం చేశాడు..

"ఈ ప్రపంచమే వో పెద్ద తడికల గూడు బావా! కాలేజి ఎంత అందులో! ఎక్కడ చూసినా కన్నాలు, కంతలే! వీటి నసహ్యించుకొని పారిపోయి చేసేదేముంది? వీటికి బదులు వీటికన్నా పెద్దవి ఎదురవుతాయి, అంతే!"

"నీ కీ రోగం ఎప్పట్నుంచిరా! ఏమి టసలు నీ బాధ?"

"ఏమని చెప్పమంటావు! .... మదీయ మానసోద్యానము నిండ రక్కసిపొదల్, చిగిరింతలు, గారకంపలే గాని పదేపదే పయిరు గాలికి నూగు గులాబి గుత్తులే కానగరావు! మదీయ జీవితాఖ్యానము నందు క్లిష్టగతి కష్టసమన్వయ దుష్టసంధులే గాని సుగమ్య సుందర సుఖంకరసూక్తి సువర్ణపంక్తియే గానగరాదు. నా విపంచిపై దీనగళమ్ములతో తెగిన తీగలమీద విషాదగీతులే కాని రసంబు పొంగి పులకల్ మొలిపించు ప్రమోదగీతియే కానగరాదు. మదీయ భావాంభోనిధిలో మహా మకరముల్, సుడిగుండములున్ తుఫానులే గాని, సుధాకిరణ కల్పక దివ్యమణి వితానమే కానగ రాదు! మదీయ సంతత ధ్యాన సమాధిలో వెకిలి దయ్యపు మూకల వెక్కిరింతలే గాని ప్రసన్నభావ కళికా లవలేశ విలాస మేనియున్ కానగరాదు! ...."

"ఒరేయ్! కొంచ మర్థ మయ్యేట్టు స్వంత భాషతో చెప్పరా!"

"ఏం చెప్పను! సృష్టిదైన విరహబాధ తన మాధుర్యభారంవల్ల తనే పగిలి మా యిద్దర్నీ చేసింది. పుట్టినప్పుడు మాత్రం—ఆ ఒక్క క్షణమే మేం కలిసి ఉన్నది. జన్మ మాధుర్యంలో పోలిన మా చేతుల్ని చిరునవ్వుతో విడదీసి, మేఘశయ్యల మీద పండబెట్టి, ప్రేమగీతాలు పాడుతో తారాపథాల నూరేగించి యిద్దరి మధ్యా అగాధమైన వ్యవధి కల్పించి యీ లోకంలో చెరో మూలకి విసిరేశారు. నా నోటి నుంచి వచ్చిన మొదటి శబ్దం పేరులేని ఆ పేరే!

"అది మొదలు నీకోసం వెతుకుతున్నాను. నే నాడుకున్న బొమ్మల్లోను నువ్వున్నావేమోనని వెదికాను. నేను చదువుకున్న పుస్తకాల్లో నీ రూపం ముద్రించారేమో నని చూశాను. కవులు నీ అందాన్ని పాడారేమోనని చదివి, నీకూ నాకూ అతికిందల్లా బట్టీపట్టాను. నీ వెక్కడున్నా కనబడతావేమోనని మొహాలు వెతుకుతూ దేశదేశాలు తిరిగాను.

"కనబడవు కాని, నీవు నాకు చిరపరిచయవు. నీ రూప మగోచరం. నీస్వభావం మనోభావాని కతీతం. నీకన్నా నాకు హృదయానుగత మేదీ లేదు. నీ నామ మమ్రుతం. కలలో విన్న గానంవలె అనుక్షణం నా చెవుల్లో ధ్వనిస్తోంది. నావైపు నడిచివచ్చే నీ మృదు

---

"ఏమి చోద్యమండీ! నిన్న, మొన్న, అటు మొన్న లొట్టలు వేసుకుంటూ తిన్న వంకాయ కూర ఈ వేళ మీకు సొక్కటం లేదు." అని అన్నది ఒక ఇల్లాలు భర్తమీద విరుచుకుపడుతూ.

కె. ఎస్. రావు (గుంటూరు)

---

పాద రజము అస్తమయ మేఘాలకి ఎర్రని రంగు పూస్తోంది. నన్ను వెతుకుతూ వచ్చే నీ అడుగుల చప్పుడు నా హృదయంలో ప్రతీ నిముషం ప్రతి ధ్వనిస్తోంది. నా పరమావధివి నీవు.

"కాని, నిరాశ! యివన్నీ నువ్వెలా కాగలవు! ఇదంతా నా వెర్రి భ్రమయేమో! మృణ్మయమైన ఆత్మలూ, తమో నిర్మితాలయిన మేధస్సులూ నిన్నూ నన్నూ అర్థం చేసుకోగలవా!"

గోపాలానికీ చిగురు మాటలు మాత్రం తనని గురించి అన్నవే ననిపించి మాట్లాడకుండా లేచి వచ్చేశాడు.

మరో రెండు రోజులు గడిచాయి, మార్పేమీ లేకుండా. ఒక ఉదయాన్నే ఎటో పోతున్న గోపాలాన్ని రామయ్యగారు పిలిచారు. "ఇదుగోహోయ్, గోపాలం, మాట! మొన్న నీతో అల్లరి చేసినందుకు మైనస్ మార్కు లిస్తానని చెప్పాను గదూ! పైగా నీకు జరిగినా నాకు జరిగినా ఒకటే అని కూడా అన్నాను. సరే, అవి దృష్టిలో పెట్టుకొని పోవని చెయ్యాల్సి వచ్చింది."

ఏమి టన్నట్టు తెల్లబోయి చూశాడు గోపాలం.

"ఏంలేదు! నిన్న రాత్రి చీకటిపడి చాలా సేపయినా, నానీ యింటికి రాలేదు. ఏమయినాడా అని తోటలోకి వెళ్లి చూస్తే అక్కడా లేడు. సరే, మీ మామా, నేనూ కాలవగట్టంట వెదుకుచ్చుకున్నాం, వెన్నెట్లో. కాసేపటికి ఎదురొచ్చాడు. అలసిపోవటాన్న కాళ్ళు నీరసంగా పడుతున్నాయి. సంగ తేమంటే, నీకు పత్రికుంటేనే గాని కాలక్షేపం కాదని, పాపం మూడు మైళ్ళు నడిచెళ్లి పల్నూరు నుంచి పత్రిక కొనుక్కొచ్చాడు. నాకోసం వక్కపొడి కూడా తెచ్చాడనుకో. చెప్పొద్దూ! నాకు వాణ్ని చూడగానే జాలేసింది."

"ఏం జేశా రేమిటి?"

"పదిహేను మార్కులు బోనసిచ్చాను. ఏం సరిపోవంటావా! అవున్లే. అంత మంచి పనికి పాతికేనా యియ్యాలి!"

గోపాలం బారుమన్నాడు. నానిగాడికి మార్కులు తగ్గడం మాట అటుంచి ఎక్కువై పోతున్నాయి. గబగబ పరుగెత్తి మామయ్యకి జేరేశాడు.

"నేను మొదటే చెప్పానుగా నీకు చేతకాదని! యిప్పటికైనా పాపని రమ్మని ఉత్తరం రాయి!"

గోపాలం రాశాడు. రాధ వచ్చేసింది, వోడిపోయిన రాజు కోటలోకి అడుగుపెడుతున్న చక్రవర్తిలాగ.

"రాధే! గతం మర్చిపో! ఆ షై, బూట్ పాలిష్‌కి వాడేస్తున్నాన్లే! యింక అది కట్టుకుంటానని నువ్వు బెంగెట్టుకోక్కర్లేదు." గోపాలం ఏకాంతంలో రాధ చెవులు మెలేసి సంధి చేసేసుకున్నాడు.

"ఏమిటో వెర్రిదాన్ని! మీ ఉత్తరం ఎప్పొస్తుందా అని ఎంత యిదిగా చూశా ననుకున్నారు! మీరు రాకపోయినా, యివాళో, రేపో వచ్చేద్దా మనుకుంటున్నాను." తన వంతు తాను పశ్చాత్తాప పడిపోయింది రాధ.

"ముష్టి పందరూపాయల కాశపడి మీ తమ్ముడు మంచివాడై పోయాడు. ఎంత ఘోరంగా ఉందో చూడు లోకం! మీ తమ్ముడు బాగుపడ్డాడని కాదు ఏడిచేది. కిష్టయ్య మీ బాబాయిని వదిలి పోతాడు. నే నింక యిక్కడి కెందు కొచ్చేట్టు ..."

"పంద రూపాయలకన్నా పెద్ద కారణ మేదో ఉండాలి. చూద్దాం ఉండండి!" అంటూ రాధ రంగంలోకి దిగింది.

ఆ మధ్యాహ్నం, సాయంకాలం సస్పెన్సులో గడిచిపోయాయి గోపాలానికి. రాత్రి రాధ తన పరిశోధనా ఫలితాలేం చెప్పలేదు. నికార్సయిన డిటెక్టివ్ లందరిలాగే.

"ఎందుకంత కంగారు! రేపు రాత్రితో మన పని అయిపోతుంది చూడండి!" అంది తాపీగా రాధ, మరీ వేధించిన గోపాలా న్నూరుకోబెట్టడానికి.

మర్నాడు మధ్యాహ్నం. పన్నెండు గంటల వేళ. అంతా భోంచేశారు. మామయ్య మేడమీద గదిలో తాతయ్య మెట్లపక్క హాల్లో విశ్రమించారు. నానీ పైన గదిలో చదువుకుంటున్నాడు. బుజ్జి లెక్కలు చేసుకుంటున్నాడు. ఇంతలో ఉన్నట్టుండి పెద్ద ఘోష బయల్దేరింది మేడపైన. కుక్క

## తీయని బాధా తొలి ప్రేమా

ఢోంయ్‌మని మొరుగుతోంది. బూట్లతో దబ్బు దిబ్బు మంటూ పరుగులు, కుర్చీలూ, బల్లలూ నేలమీద లాగిన చప్పుడు క్రిందికి ఘోరంగా విన బడుతోంది. టీపాయిలు, స్టూల్సు, పూలకుండీలు మీద విసురుకొని కింద పగిలిన చప్పుడు. ఇదంతా మేడమీద పావుగంటసేపు జరిగాక మెట్లమీదకి వచ్చాయి ధ్వనులు. "ఇడియట్", "స్కౌండ్రల్", "రాస్కెల్", "బ్రూట్", "స్టుపిడ్", 'యాస్' "పిగ్", "గూస్" లాంటి ముచ్చట మాటలు కటువుగా వినబడుతున్నాయి. అరవ సినిమాలో స్టంటులాగ "ఠాం", "ఠాం" అని మేడంతా దద్దరిల్లుతోంది. చివరికి కుక్క మెట్లమీంచి పరుగెత్తుకుంటూ వచ్చి సగంలోంచే దభీమని క్రింది దూకింది. "భౌ, భౌ" మని పెద్దగా అరుస్తూ. ఆ దూకులో కొంచెం సుళువుగా క్రింద పడ్డానికి గాను తాతయ్య మంచంమీది దూకి మరో అంగలో కిందపడి పరుగెట్టింది. ఆ వెనకే వో పదేళ్ల కుర్రాడు, నానీ క్యూలో తాతయ్య మంచంమీద వో కాలు వేసి మరో అంగలో నేలమీద ఆని బయటికి పరుగెత్తారు.

మంచం బోరగిలపడి తాతయ్య అడుగున మంచం పైన పడ్డారు. ఆ తర్వాతేం జరిగిందీ వివరించక్కర్లేదు. నానీ పేరు స్క్రాచ్ చేసేసి బుజ్జి నిస్సంశయంగా గెలిచినట్టు ప్రకటించాడు తాతయ్య ఉరఫ్ రామయ్యగారు.

"అసలిదంతా ఎలా జరిగిందే పాపాయి !" గోపాలం గోముగా రాధ చెంపలు నిమిరి అడిగాడు.

"అదికాదు బావా ! నానీగాడికి ఎన్నేళ్ళు చెప్పు. పదహారు. అవునా ! మొన్నే కాలేజీలో చేరాడు. కాస్త కూస్త ప్రేమ కవిత్వం వల్లించాడు. తరవాతి మెట్టుమీద కూడా యిటీవలే అడుగు పెట్టేశాడు. ప్రేమపిచ్చి బాగా బుర్రలో కెక్కిన వాళ్లు అమాంతంగా వేదాంతు లయిపోయి పరమ సాధువు లయిపోతారు. ఈ లోకం విషయాలు ఆట్టే పట్టవు !"

"మా గొప్ప సిద్ధాంతం కనిపెట్టావులే గాని, సంగతి చెప్పు ?"

"అలా వేళాకోళం చేశావంటే అసలేం చెప్పను ఫో ! .... అయిందా ! ప్రేమించినవాళ్లకి—అందులోనూ తొలి ( కుర్ర ) ప్రేమికులికి—ఇంకో జబ్బు లుంటుంది. తమ ప్రేయసి ఎవతో అప్సరస న్నట్టూహించుకుని, దానిమీద యీగ వాలనివ్వరు. నానీగాడి ప్రేయసిమీద దుమ్మెత్తి పోయడానికి మన పక్కింటబ్బాయికి నాలుగు మినపసున్ని ఉండలిచ్చి పప్పించాను. దాంతో పులిలా మీద పడ్డాడు నానీ. కుర్రాడికి ఉండలమీద మోజా ఎక్కువై మోతాదు ఎక్కువ చేశాడు. అంతే."

"ఇంతకీ ఎవరేమిటి, ఆ ప్రేయసి ! వాళ్ల కాలేజీ అమ్మాయా ?"

"అలా అయితే బాగానే ఉండును. ఆమధ్య కొత్తగా ఓ ఫ్రెంచి సినిమా చూశాట్ట ! అప్పట్నుంచి బార్డో అంటూ ఒహటే ప్రేమ !" ★

# పారిశ్రామిక ప్రదర్శనం

7-వ పేజీ తరువాయి

పారిశ్రామిక ప్రదర్శనంలో అమెరికన్ శాల సందర్శిస్తే, అమెరికన్ల శక్తి సామర్థ్యాలు కొంతవరకు అర్థం చేసుకోవచ్చు. ప్రదర్శనలోగల మిగతా శాల లన్నింటిలోకి ఇదే పెద్దది. 5½ ఎకరాల విస్తీర్ణం గల ప్రదేశంలో 1959 వ్యవసాయ ప్రదర్శన నప్పుడు నిర్మించిన స్వర్ణ గోపురాల భవనంలో దీనిని ఏర్పాటు చేశారు. అమెరికాలోని 118 పారిశ్రామిక సంస్థలు, సుమారు కోటి రూపాయల విలువకల వెయ్యిటన్నుల యంత్ర సామాగ్రిని ఇందులో పెట్టారు. ఇంత పెద్ద ఎత్తున వారిదివరకు ఎక్కడా ఏ ప్రదర్శనలోనూ పాల్గొనలేదట. అయితే రష్యా ప్రదర్శనశాల మాదిరి, ఆడంబరంకోసమని, తమదేశంలో తయారయ్యే సర్వ వస్తు నిచయాన్ని ఇందులో పెట్టలేదు. ప్రస్తుత ఘట్టంలో భారత అభివృద్ధి కృషికి యే యే యంత్రాలు ముఖ్యంగా ఉపయోగపడతాయో వాటినే ప్రదర్శనలో పెట్టారు. ఈ యంత్రాలను కేవలం బొమ్మలు మాదిరి గాకుండా కొన్ని అసలు యంత్రాలను, కొన్ని నమూనా యంత్రాలను, శిక్షణ పొందిన భారతీయులచే వాటిని నడిపించి ఎలా పని చేస్తాయో, వాటి ఉపయోగమేమిటో ప్రేక్షకులకు చూపెడుతున్నారు. రష్యన్ శాల ప్రక్కనే ఉన్న తూర్పు జర్మనీ శాలలో అత్యాధునికమైన రకరకాల యంత్రాలు అమర్చారు. బివెల్ గేర్ హాబింగ్ యంత్రం, తీగ అల్లికపు యంత్రం, తీగ మగ్గం, మౌల్డింగ్ ప్రెస్, బ్రహ్మాండమైన పాలీగ్రాఫ్ కెమెరా, నవీనమైన లెటర్ ప్రెస్ ప్రింటింగ్ యంత్రం, నేత లేకుండా బట్ట తయారుచేసే యంత్రం, ప్లాస్టిక్ వస్తువులు తయారుచేసే యంత్రం. ఇలాంటి వెన్నో ఇందులో చూడవచ్చు. ఈ శాలలో అత్యాకర్షణీయమైనది 'గాజు వనిత" స్త్రీ శరీరంలో సర్వ అవయవాలు, ప్రత్యక్షంగా చూచేందుకు వీలుగా గాజుతో డ్రెస్డెన్‌లోని ఒక జర్మన్ మ్యూజియం తయారుచేసింది. దీన్ని అక్టోబర్ 2 నుంచి 16 వరకూ కలకత్తాలో ప్రదర్శించారు. 1955లో జరిగిన భారత వస్తు ప్రదర్శనలో "గాజు పురుషుణ్ణి" 1959 లో జరిగిన ప్రపంచ వ్యవసాయ ప్రదర్శనలో గాజు గోవును ప్రదర్శించారు. గాజు ప్రతిమలు కేవలం వినోదం కోసం గాక, శరీరంలో ఆయా అవయవాలు ఎలా పనిచేస్తవో చూచి తెలుసుకోడానికి ఉపయోగిస్తాయి. తూర్పు జర్మనీ శాలలో భారత తూర్పు జర్మనీ సంస్థల సహకారంతో తయారైన హిందీ టైప్‌రైటర్ కూడా ఉంది.

పశ్చిమ జర్మనీ శాలలో 12 టన్నుల డైవింగ్ ఉక్కు గోళం చూడవచ్చు. ఈ పశ్చిమ జర్మనీ శాలలో 12 టన్నుల డైవింగ్ ఉక్కు గోళం చూడవచ్చు. ఈ లోహ గోళంతో 12 సంవత్సరాల క్రితం ఒక శాస్త్రజ్ఞుడు 7 మైళ్ల సముద్ర గర్భంలోకి వెళ్లగలిగాడట. ఇంకా క్రుప్స్ పారిశ్రామిక సామ్రాజ్య వైభవం ఎలాంటిదో దిజ్మాత్రంగా తెలుసుకోడానికి ఈ శాల ఉపకరిస్తుంది.

బ్రిటిష్ శాల రెండు భాగాలుగా ఉంది. ఒక భాగంలో బ్రిటన్, భారత దేశాభివృద్ధికోసం, ఆయా భారత పరిశ్రమలలో భాగస్వామిగా ఎలా తోడ్పడుతున్నదీ ప్రదర్శించారు. రెండవ భాగంలో, రకరకాల జెట్ విమానాల నమూనాలు ప్రదర్శించారు.

ఇందులో ఆకర్షణీయమైనది నైలాన్ భవనం. రెండు పొరలుగల నైలాన్ వస్త్రంలోకి గాలిని పంప్ చేసి పెద్ద గోపురాకారంలో భవనం మాదిరి తయారుచేశారు.

హంగేరియన్ శాలలో 196 రకాల పారిశ్రామిక యంత్రాలు చూడవచ్చు. ఇందులో విచిత్రమైన యంత్రం ప్రోగ్రాం కంట్రోల్డ్ వర్టికల్ మిల్లింగ్ మెషిన్. ఇది ఏ యంత్ర పరికరాన్నయినా నిర్ణీతమైన పద్ధతిన తయారుచేయగలదట.

బల్గేరియా శాలలో అనేక రకాల లేత్‌లు, బట్టల యంత్రాలు, ఎలెక్ట్రానిక్ సామగ్రి, యంత్రపు పరికరాలూ మన దేశానికి విరివిగా ఎగుమతి చేయగలమని ఆశిస్తూ మోటార్ బైసికిల్ వగైరా చాలా ఉన్నాయి.

జెకోస్లోవేకియా శాలలో, మన దేశంలో ప్రస్తుతం పనిచేస్తున్న జెక్ యంత్రాల నమూనాలున్నాయి. 13 జెక్ వాణిజ్య సంస్థలు ఈ శాలలో తమ యంత్రసామగ్రి ప్రదర్శించారు. ఒక పరిశ్రమకు కావలసిన యావత్తు యంత్రాలు సప్లయిచేసే టెక్నో ఎక్స్‌పోర్ట్ సంస్థ 100 మెగావాట్ల స్టీం టర్బైన్, జలవిద్యుత్ యంత్రం, 220 కి. వాట్ల స్విచ్ యంత్రం, రాంచీలో నిర్మిస్తున్న లోహ పరిశ్రమ నమూనా ఇందులో ప్రదర్శించింది.

ఫ్రెంచి శాలలో, తక్కువ ఖరీదుగల రినాల్డ్ కారులు ప్రదర్శించారు. ఈ కారు ఖరీదు సుమారు 6 వేలు. చూడ ముచ్చటగాఉంది. భారతప్రభుత్వం జనతాకారుగా దీన్ని ఇక్కడ తయారు చేయించాలని అనుకొని ఫ్రెంచి సంస్థతో సంప్రదింపులు జరిపారు కాని, ఇదేమంత వారికి నచ్చినట్లుగా లేదు.

ఈ శాలలన్నీ చూసి, మన ప్రైవేటు, పబ్లిక్ రంగాల శాలలు చూస్తే మనం ఎవరికీ తీసిపోమనీ, 200 సంవత్సరాల దాస్యంనుండి బయటపడి, గత 15 ఏళ్లలోనే శాస్త్ర సాంకేతిక రంగాలలో ఇంత పురోభివృద్ధి ఎల్లా సాధించగలిగామా అనీ ఆశ్చర్యం కలగకమానదు.

ముఖ్యంగా అణుశాస్త్రంలో, రక్షణ పరికరాల ఉత్పత్తిలో, రైల్వేలలో మనం సాధించిన అభివృద్ధి అద్భుత మనిపిస్తుంది. రైల్వేశాల, ప్రదర్శనలోని పెద్ద శాలల్లో రెండవది. ఇందులో మనం తయారు చేసిన రైలు ఇంజన్లు, రైలు పెట్టెలు, వాగన్లు ప్రదర్శించారు. రైల్వేలో జరుగుతున్న అభివృద్ధి యావత్తు, ఫోటోగ్రాఫ్‌ల ద్వారా, నమూనాల ద్వారా చూపెట్టారు.

దీని తరువాత చెప్పుకోదగింది రక్షణశాఖ. ఇందులో అనేక రకాల ఆయుధసామగ్రి, లోహ పరికరాలు, మన ఫ్యాక్టరీలు తయారు చేస్తున్నవి ప్రదర్శించారు. నీటిలోనూ, నేలమీద నడిచే ఉభయచర శకటాలు కూడా ఏర్పాటు చేశారు. జబల్‌పూర్‌లో తయారైన 4 టన్నుల మిలిటరీ ట్రక్కు కూడా ఒకటి ఉంది. వైమానిక విభాగంలో బెంగుళూర్ హిందూస్థాన్ ఫ్యాక్టరీలో తయారైన సూపర్ సానిక్ జెట్ ఫైటర్ విమానం, కాన్పూర్‌లో తయారైన ఎవ్రో 748 విమానం, కాన్పూర్ 1, 2 మోడల్ విమానాలు రకరకాల విమానాల ఇంజన్లు ప్రదర్శించారు. ఇంకా అనేక రకాల సున్నితపు పరికరాలు, ట్రాన్సిస్టర్ రేడియోలు, ఎలెక్ట్రానిక్ పరికరాలు — ఈ వివిధ రంగాలలో మనం సాధించిన అభివృద్ధికి తార్కాణాలుగా ఉన్నాయి. అన్నింటిలో అత్యంత ఆకర్షణీయంగా ఒక కెమెరా ఉంది. ఇది ఒక సెకండుకు 20 వేల ఫోటోలు తీస్తుందట. దీనిలోపల ఒక అద్దం, దాని చుట్టూ 20 లెన్సులు అమర్చారు. ఆ అద్దం సెకండుకు వెయ్యిసార్లు తిరిగితే, చుట్టూ ఉన్న లెన్సులద్వారా 20 వేలు ఫోటోలు వస్తాయట.

తరువాత చూడదగినది అణుశాస్త్రానికి సంబంధించిన శాల. ఇందులో ట్రాంబే రియాక్టర్ నమూనాలు, తారాపూర్ అణువిద్యుత్ కేంద్రం నమూనాలు, అనేక డయాగ్రంలో చార్టులు, ఫిల్ములు ఉన్నాయి. అణువు అంటే ఏమిటి, దానివల్ల ఉత్పన్నమయ్యే శక్తి ఎలాంటిది, దాన్నెలా ఉపయోగించుకోవచ్చు— ఈ విషయాలన్నీ వీటన్నింటి సహాయంతో తెలుసుకోవచ్చు.

ఫిలిప్స్ కంపెనీశాలలో, ఫ్లోర్‌సెర్ పౌడర్లతో, ఒక మాజిక్ గార్డెన్ ఏర్పాటు చేశారు. రెండు ట్యూబ్‌లైట్లను కాగితపు పూలచెట్లపై ఫోకస్‌చేసి రంగురంగుల పూలు కన్పించేట్లు చూపారు. ఈ అద్భుత ఉద్యానవనం ఆ దీపపు కాంతులతో చూస్తే అతి రమణీయంగా కన్పిస్తుంది. ఈ శాలకు వెలుపల ఉన్న సరస్సులో 'ఎలెక్ట్రానిక్' ఏర్పాటుతో నీళ్లతో నృత్యం చేయించి ప్రేక్షకులను విశేషంగా ఆకర్షిస్తున్నారు.

బిర్లా, టాటా, ప్రదర్శనశాలలు కూడా చాలా ఆకర్షణీయంగా ఉన్నవి. బిర్లా శాలలో హిందూస్థాన్ మోటార్స్ (ఎంబాసెడర్ కారు) నమూనాలు బిర్లా క్రింద అనేక సంస్థల తాలూకు వస్తువులు ప్రదర్శించారు. టాటాశాలలో టాటా కంపెనీల సామగ్రి చూపెట్టారు.

ప్రభుత్వ రంగంలో నూనె పరిశ్రమకు సంబంధించిన ప్రత్యేక శాల ఒకటి నెలకొల్పారు. ఇక్కడ నూనె అన్వేషణ కృషి ఇంతవరకు సాధించిన విజయాలు చూడవచ్చు.

ఎగుమతుల శాల అంటూ మరొకటి ఉంది. భారతదేశం విదేశాలకు ఎగుమతి చేయగల సామగ్రి యావత్తు ఇందులో ప్రదర్శించారు.

## ఆంధ్ర శాల

దేశంలో గల 15 రాష్ట్రాలలో 11 రాష్ట్రాలు శాలలు ఏర్పాటుచేసి తమ తమ పారిశ్రామిక వస్తు సంపద కళాఖండాలు ఇందులో ప్రదర్శించాయి. ఈ శాలల్లో, ఆంధ్ర శాలే కొంత ముచ్చటగా ఉంది. దీన్ని ఇప్పటికప్పుడే 2½ లక్షల మంది దర్శించారు. అమరావతి స్థూపం ఆకారంలో నిర్మించారు. ప్రవేశ ద్వారంవద్ద వరంగల్ గేటు నమూనా పెట్టారు. లోపలికి వెడుతుంటే, ప్రేక్షకుల సంఖ్య నమోదు

# పారిశ్రామిక ప్రదర్శనం

చేసే ఎలెక్ట్రానిక్ యంత్రం పెట్టారు. మంటపంలో ప్రవేశించగానే ఆంధ్రుల ప్రాచీన చరిత్ర తెలిపే చిత్రపటాలు కన్పిస్తాయి. తరువాత పంచాయతీరాజ్యం ఎలా సాగుతుందీ, కొండపల్లి బొమ్మల సహాయంతో చూడవచ్చు. విశాఖ నౌకా కేంద్రం యొక్క త్రీ డైమన్షనల్ నమూనా, సాలార్‌జంగ్ మ్యూజియం, కూచిపూడి నృత్యభంగిమపు తెలుపు చిత్రాలు ఇలాంటివి ఉన్నాయి. ఒకవైపు ప్రాగా టూల్స్ కర్మాగారంలో తయారయ్యే యంత్ర పరికరాలు అమర్చారు.

సిగరెట్, పొగాకు పంటకు సంబంధించిన నమూనాలు, తదితర పంటలకు సంబంధించిన వివరాలు, గూడూరు పింగాణీ ఫ్యాక్టరీలో తయారయ్యే సామగ్రిలు, నాగార్జునసాగర్, మూసీ, తుంగభద్ర ఎగువ కాల్వల పథకాల నమూనాలు, గోదావరి, కృష్ణలోయలలో వివిధ ప్రాజెక్టుల ఫోటోలు ఏర్పాటు చేశారు. నాగార్జునసాగర్ జల విద్యుత్ కేంద్రం, శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు నమూనాలు కూడా ఇందులో ఉన్నాయి.

ఖనిజాలు వివిధ రకాలైన రాళ్లు, వీటి నమూనాలను ప్రదర్శించారు. రాష్ట్రంలో వివిధ ఖనిజాలు లభించే ప్రాంతాల చిత్రపటం కూడా ఒకటి ఉంది. సనత్ నగర్ పారిశ్రామికవాడలో తయారైన రిఫ్రిజిరేటరులు కుట్టుమిషన్లు వగైరాలూ కూడా పెట్టారు. ఇది మొదటి విభాగంలో ఉన్న విశేషాలు. రెండవ విభాగంఅంతా కళామయం. ఇక్కడ నిర్మల్ చిత్తరువులు, దంతపు సామగ్రి, బిద్రీ వస్తువులు, కొండపల్లి బొమ్మలు, గద్వాల, ధర్మవరం, పెద్దాపురం చేనేత వస్త్రాలు, హిమ్రూ శాలువలు ఇవన్నీ ఉన్నాయి. ఈ విభాగం చూచినవారు ఆంధ్రుల కళాకౌశలానికి ముగ్ధులౌతారనడంలో ఆశ్చర్యంలేదు.

అయితే ఈ కళల విషయం తెలియని ప్రేక్షకులకు విడమర్చి చెప్పేవాళ్లెవరూ ఈ శాలలో అక్కడ కన్పించలేదు. నిర్మల్ చిత్రాలు చూచి, ఇవేమిటని అడిగితే 'నిర్మల్' చిత్రాలన్న జవాబు తప్ప ఆ నిర్మల్ ఎక్కడ, ఎంతకాలంగా, అక్కడ ఆ కళ అభివృద్ధి చెందింది అన్నవిషయాలు తెలపరు. విదేశాలలో ఒక్కొక్క యంత్రానికి ఇద్దరేసి చొప్పున ఉండి అడక్కముందే అన్ని వివరాలు తెలుపుతారు. ఇక్కడ అడిగినా విషయాలు తెలియవు. ఈ శాలకు ప్రభుత్వం ఐదు లక్షలు ఖర్చుపెట్టింది. కాని శాల తగినంత విశాలంగా లేక ఇరుకుగా ఉంది.

విజ్ఞాన ప్రబోధకమైన ఇటువంటి ప్రదర్శనకు దేశంలో నలుమూలల ప్రజలు చూడటానికి వీలుగా ప్రభుత్వం ప్రత్యేక రైళ్లు ఏర్పాటు చేయలేదు సరిగదా, ఉన్న రైళ్లను కూడా గోవా నెపంతో ఈ సమయంలోనే తగ్గించింది. పోనీ ఇంకా కొన్నాళ్ళు పొడిగిస్తారా అంటే అదీ లేదు. జనవరి ఒకటో తేదీతో ఎత్తివేస్తున్నారు. ఇదే నిరుత్సాహకరమైన సంగతి. ముందు ముందు ఇలాంటి ప్రదర్శనలను రాజధాని అని ఎక్కడో ఉత్తర కొసన నెలకొల్పేకన్నా, అని ప్రాంతాలవారికి అందుబాటులో ఉండేట్లు దేశం మధ్యలో ఏర్పాటు చేయడం మేలు. ★

# మనసూ మనదేహస్థితి

13-వ పేజీ తరువాయి

పసరుతిత్తి కుంచుకుని పిత్తరసం డుయోడినంలోకి ప్రవేశిస్తుంది. కొన్ని పరిస్థితులలో లివరులో పిత్తరసం ఉత్పత్తి తగ్గిపోతుంది. అప్పుడు పిత్తరసం నిలవ వుండకుండా సరాసరి డుయోడినంలోకే పోవచ్చును.

పిత్తరసం భౌతిక రసాయన స్వరూపము:

లివరులో తయారైన పిత్తరసం పలచగా ఉంటుందనీ, పసరు తిత్తిలో నిలవ వున్న పిత్తరసం చిక్కగా ఉంటుందనీ యిదివరకే తెలుసుకున్నాము. అంతేకాదు. లివరులో తయారయినప్పుడు పిత్తరసం లేత ఆకుపచ్చరంగు కలదైతే పసరుతిత్తిలో ఉన్న పసరు ముదురు ఆకుపచ్చరంగు కలదై ఉంటుంది. రసాయనికంగా పిత్తరసం క్షారగుణం కలది (Alkaline). పిత్తరసంలో యీ క్రింది పదార్థములు ఉంటవి :

(1) పిత్తరస లవణములు (B le salts)
(2) పిత్తరస ఆమ్లములు (Bile acids)
(3) పిత్తరస వర్ణములు (Bile pigments)
(4) కొలెస్ట్రాల్ (Cholesterol)
(5) లెసిథిన్ (Decithim)
(6) మ్యూసిన్ (Mucine)
(7) సోడియం, పొటాసియం, మెగ్నీషియం కాల్షియం భాస్వరంవంటి వస్తువులతో లవణములు.

పిత్తరస లవణములు :—ఇవి లివరు కణములలోనే తయారవుతవి. పిత్తరసంలో ఉండే కొలెస్ట్రాల్ అనే పదార్థం నీటిలో కరగదు. కాని యీ లవణములున్నప్పుడు అది నీటలో కరుగతుంది. మనిషి ఉపవాసం చేసేటప్పుడూ ఆహారంలో శర్కరా ద్రవ్యములు (పిండి పదార్థములు అధికంగా ఉన్నప్పుడూ ఈ లవణములు తగ్గిపోతవి. ప్రొటీనులు అధికంగా తీసుకున్నప్పుడు అధికంగా ఉంటవి.

ఈ పిత్తరస లవణములు పాంక్రియస్ రసం యొక్క జీర్ణశక్తిని అధికంచేస్తవి. ఇవి లేకపోతే తైల ద్రవ్యములు జీర్ణంవల్లఏర్పడినపేటీ (Fattiacid) ఏసిడ్లు ప్రేగులలోనుంచి రక్తంలోకి ఆహరించబడవు జీర్ణం కావడంలేదు. జీర్ణ ఫలితంగా తయారయిన వస్తువులు శరీరంలోకి ఆహరించబడడం లేదు. పిత్తరసలవణములు లేకపోయినా జీర్ణం జరగవచ్చు కాని కొవ్వు పదార్థములు పిత్తరస లవణములు లేకపోతే శరీరంలోకి ఆహరింపబడవు పసరునాళం మూసుకపోయినప్పుడు యీ లవణములు ప్రేగులలోకి పోవును. అందువల్ల ఈ పేటీ ఏసిడ్లు పోర్టల్ వెయిన్‌లోకి రావు. అప్పుడు అవి మలం ద్వారా బయటికి పోయి వ్యర్థమవుతవి. అందుకనే కామెర్లు వచ్చినప్పుడూ లివర వ్యాధిగ్రస్తమైనప్పుడూ డాక్టర్లు కొవ్వు పదార్థములు తీసుకోడం మానివేయమని ఆదేశిస్తారు. పిత్తరసలవణము మలం ద్వారా బయటికి పోవు ప్రేగులలో ఉండే రక్తనాళములు వాటిని ఆహరించి మళ్లీ లివరుకు పంపుతవి. అవి చాలా ఉపయోగకరములైన, విలువైన వస్తువులు.

(సశేషము)

# యువ ప్రపంచం

## హాస్టలు వసతులు

కథల్లో నే బ్రహ్మచారులకు గదులు అద్దెకు ఇవ్వరనుకునే వాడిని. కాని నాకుకూడా ఆ కష్టం ఇప్పుడు తెలియవచ్చింది. కథల్లో లాగ అబద్దాలు చెప్పడం సులభం కాదు కాబట్టి నాయాతన ఇంతా అంతా కాదు! తిరిగితిరిగి, విసిగి చివరకొక 'రూమ్' సంపాదించుకున్నాను.

హాస్టల్లలో ఖాళీలు లేకనే ఈ కష్టాలు పడవలసి వచ్చింది. ఎంత ప్రయత్నించినా హాస్టల్‌లో వసతి దొరకలేదు. పలుకుబడి మీదనే సంపాదించవచ్చని విన్నాను. చివరకు నేనూ ఈ పద్ధతినే అవలంబించానుకోండి! కాని 'ఉన్నత విద్య' అని పేరుపెట్టి వాటికి తగిన సౌకర్యాలు ఏర్పరచకపోతే విద్యార్థులు చాలా బాధపడవలసి వస్తుందనే విషయం అధికారులు గుర్తించాలి. కాలేజీ సీట్లనుబట్టి హాస్టల్‌లో 'ఎకామడేషన్' ఏర్పరచాలని నా మనవి.

ఎస్. వి. రావు, (విశాఖపట్నం)

* * *

## సంప్రదాయం - మార్పులు

సంప్రదాయానికి మార్పుకి యువ ప్రపంచంలో చిన్న చిన్న సమరాలు జరుగుతూనే వున్నాయి. కొట్లాటలు, సివిల్ యుద్ధాలు, ప్రపంచ యుద్ధాలు వున్నట్లే యువ ప్రపంచంలో కూడ చిన్నవి పెద్దవి సాంఘిక యుద్ధాలు జరుగుతున్నాయి. వీటిలో వర్ణాంతర వివాహాదుల విషయంలో సంప్రదాయానికి మార్పుకి జరుగుతున్న సంఘర్షణను "యువ ప్రపంచ (సాంఘిక) యుద్ధం" అనవచ్చునేమో! ఎందుకంటే, సాంఘిక సంస్కరణ లన్నిటిలోను వర్ణాంతర వివాహాలకి సంప్రదాయం ఎక్కువ ప్రతిఘటన చూపుతోంది. కొన్ని విషయాలలో సంప్రదాయానికి, మరికొన్ని విషయాలలో మార్పుకి ప్రాముఖ్యం ఇచ్చి, మనముకూడ 'న్యూట్రల్'గా వుంటే మంచిదేమో? ఎంత వదలించుకొందామని ప్రయత్నించినా, తల్లిదండ్రుల, సంప్రదాయ ప్రభావంనుండి మనం విముక్తులము కాలేము. పైకి ఎంత గంభీరంగా కనబడినా, రహస్యంగా (నూటికి నూరుపాళ్లు వర్ణాంతర వివాహాలు రహస్యంగానే జరుగుతున్నాయని అందరికి తెలిసిన విషయమే) వివాహం చేసుకొన్న యువతీ యువకులు, ఉభయులు ఆత్మీయులకు దూరమైపోయామని, తల్లిదండ్రుల హృదయాలకి మానని గాయం కలుగజేసామని లోలోపల బాధ పడుతూనే వుంటారు. 'కొత్త మోజులో' ఈ బాధ మరుగున పడిపోయినా మెల్లిగా అప్పుడప్పుడు సాధింపుల రూపంలో బయటపడుతూ వుంటుంది. ఒక విధమైన 'అన్‌ప్లెజంట్ సెన్స్' వారి జీవితంలో ప్రవేశించి కలుషితం చేస్తుంది. 'పెద్దలకు' తెలియకుండా వివాహం చేసుకొన్నందుకు వారు 'గిల్టీగా' ఫీలవుతారు. ఆ 'గిల్టీ కాంప్లెక్సు' క్రమక్రమంగా వారిని క్రుంగదీస్తుంది. సంప్రదాయానికి బానిస అయిన ఒక తల్లి వున్నది అనుకోండి. ఆమె విధవ. ఆస్తి లేదు. ఆమెకో కూతురు వుంది. తల్లి కష్టపడి కూతురికి చదువు చెప్పించింది. ఆమె హృదయం ఉప్పొంగిపోయింది. కాని — ఎన్నో ఆశలు పెట్టుకొని చదువు చెప్పించిన కూతురు ఒక 'తక్కువకులం' (తల్లి దృష్టిలో) యువకుణ్ని ప్రేమించి పెళ్ళి చేసుకోబోతున్నదని తెలిసి ఆమె క్రుంగిపోయింది. ప్రాణంకన్నా సంప్రదాయానికి ఎక్కువ విలువనిచ్చే ఆ తల్లి, కూతుర్ని బతిమాలుకొన్నది, సవర్ణ యువకుడినే వివాహం చేసుకొని కులగౌరవం నిలబెట్టుమని. నిజానికి ఆ 'తక్కువ కులం' యువకునిలో 'తక్కువతనం' ఏమీ లేదు. అతడూ చదువుకున్నవాడు, అందమైనవాడూ, ప్రయోజకుడునూ. కాని తల్లి సంప్రదాయానికి దాసురాలు. ఆమె దృష్టిలో కూతురు చేస్తున్నది ఒక నీచమైన పని. కూతురు ముందు తల బద్దలు కొట్టుకొని ఏడ్చింది — 'అతన్ని' చేసుకోవద్దని. ప్రియుని మోజులో పడిపోయి ఆత్మీయుల బాధనుకూడ అర్థం చేసుకొనే శక్తిని కోల్పోయింది కూతురు. ప్రేమించినయువకుణ్నే జీవిత భాగస్వామిగా 'ఎన్నుకొన్నది' చేసుకున్నది. కాని ఆమె మనసు బాధ పడుతూనే వుంటుంది. 'గిల్టీగా' ఫీలవుతుంది. అందుకే, కొన్ని విషయాలలో, ముఖ్యంగా వివాహం విషయంలో సంప్రదాయాన్ని గౌరవించాలనుకుంటాను.

"సొంత కులంలో నే యోగ్యతగల యువతీ యువకులు వున్నప్పుడు, పరాయికులం దాకా వెళ్లవలసిన అవసరం ఏముంది?" అని అడిగితే మన యువకులు ఏమంటారో? ఈ వర్ణాంతర వివాహ విషయ సమస్యలో యువతుల సలహా తీసుకోటమే మంచిది. ఎందుకంటే, సామాన్యంగా వర్ణాంతర వివాహాలన్ని యువతి ప్రోద్బలం వల్లనే జరుగుతున్నాయని మీరంతా నమ్మకారని ఈ 'బ్రహ్మచారి' నమ్ముతున్నాడు కాబట్టి! —

"బ్రహ్మచారి" (బందరు)

* * *

నేటియువకులది కేవలం మేకపోతుగాంభీర్యమేనని శ్రీ కృష్ణమోహన్ (సికింద్రాబాద్) వ్రాయడం శోచనీయం. ఎక్కడో గాని యువకులు ఈ రోజుల్లో తల్లిదండ్రుల అభిప్రాయాల్ని (తమకునచ్చనివి) మాటలను ఎదిరిస్తూ తమతమ అభీష్టాలు, మమతలు, కోర్కెలు తీర్చుకొంటూ నేవున్నారు. ఇలాగని అవివేకముగా తల్లిదండ్రుల వివేక వచనములను 'కాదుపో' అని త్రోసివెయ్యడం జరుగుతున్నదని కాదు. బలహీనత యువకుల్లోను, తల్లిదండ్రుల్లోనూ వున్నది. దానికి తల్లిదండ్రులో యువకులో (అంటే కొడుకులని) లొంగక తప్పదుమరి! అటు కొడుకుల అభిప్రాయాల కనుగుణంగా తల్లిదండ్రులు ఇటు తల్లిదండ్రుల అభిప్రాయాల కనుగుణముగా కొడుకులు (యువకులు) నడచుకుంటే కావల్సింది అంతకంటే ఏముంది?

గూబిషా. (ఏలూరు).

* * *

పోణంగి కృష్ణమోహన్ గారి లేఖచూడగా నాకీ యభిప్రాయము తెలుపవలెనని కోరిక కొడమినది.

నేటి యువకులకు మేకపోతుగాంభీర్యమున్నమాట వాస్తవమే. కాని 'తమ కాళ్లపై నిలబడవలెనని, ఇతరులపై ఆధారపడుట శోచనీయమని వ్రాశారు. నేటి యువకుల విద్యార్హతలకు తగిన జీవన సౌకర్యమును మన దేశములో కల్పింపలేకున్నారు. ఇదే మన దేశమందలి చిన్నలోపము. 'డిగ్రీ'లకు తగిన జీవనాధారములను చూపవలసిన బాధ్యత ప్రభుత్వముపై ఉన్నదనుట నిస్సంశయము. నేటి యువకులకు వివాహవిషయమున పెద్దల నెదిరించు ధైర్యము లేదనుట యథార్థమే. నిరుద్యోగసమస్య నివారణ కానంతవరకు మనకిట్టి "డిపెండెంట్ లైఫ్" తప్పదని నా అభిప్రాయము.

పె. వ. రామాచార్యులు. (కాకినాడ).

**కవరుపైన 'యువప్రపంచం' శీర్షికకుఅని స్పష్టంగా వ్రాయాలి.**

# ఆంధ్రసచిత్రవార పత్రిక

# 12-1-1962

## సంక్రాంతి సంచిక

● ముఖచిత్రం - బాపు



శ్రీమతి సావిత్రి-



వాసంతి బి. ఎ.
వ్యాసం

● ఏడుకొండలు - రంగధామ్ (సాంఘిక నవల ప్రారంభం)



నేనూ నా ఫాన్ మెయిల్ - జమున.

● పగటి దొంగలు - ఎం. ఎల్. పతి

● కాల్పనిక జగత్తులో వరకట్నాలు - సింగరాజు రామచంద్రమూర్తి

● ప్రత్యేక వ్యాస రచన పోటీ

● కొత్త సంవత్సరం కోరికలు - రమణారెడ్డి

ఇంకా కార్టూన్లు, శీర్షికలు వగైరా

ఎక్కువ పేజీలు

**వెల: 25 నయాపైసలు**

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Stre
Madras-1. Chief Editor : S. Sambhu Prasad.



చక్రపాణి

ఫొటో : ఎ. వి. ఎస్. నారాయణ్, (గూడూరు)